శ్రీరామ    శ్రీ హనుమతేనమః    శ్రీరామ

# శ్రీ హనుమచ్చరిత్ర



మూలం

పూజ్యపాదశ్రీ 108 ప్రభుదత్త బ్రహ్మచారిగారు

సంకీర్తనభవన్, ఝూసీ, ప్రయాగ

అనువాదం

డా॥ కె. శివసత్యనారాయణ M.A. Ph.D.,

హిందీ శాఖాధిపతి

శ్రీ. వై. యన్. కళాశాల

నర్సాపురం, ప. గో. జిల్లా. (ఆం. ప్ర)

ప్రకాశకులు

శ్రీనివాసా పబ్లిషర్సు

నర్సాపురం



RAM BHAGAT HANUMAN

S. S. BRIJBASI & SONS,
33/1 FATEHPURI

# రెండు మాటలు

కీర్తిశేషుల శ్రీ సిమా రఘువర దాసుగారు సంకీర్తన చక్రవర్తిగా ప్రసిద్ధిజెందారు. వారు ఆంధ్రప్రదేశమంతటా రామనామాన్ని వెదజల్లి శ్రీ హనుమాన్ చాలీసాలను లక్షలు పంచిపెట్టి, శ్రీచాలీసా శిలాఫలకాలను శతాధిక దేవాలయాలలో వేయించారు. తరువాత శ్రీఅవధూతేంద్ర సరస్వతీ నామధేయముతో సన్యాసాశ్రమాన్ని స్వీకరించారు. 1975లో సిద్ధిబొందారు. భీమవరంలో శ్రీగురుస్వామి–మీనాక్షి దంపతులు తమ యింట హనుమత్సీతారామ- లక్ష్మణ- భరత- శత్రుఘ్న సమేతంగా బ్రహ్మీభూత ప. ప. శ్రీఅవధూతేంద్ర సరస్వతీస్వాముల వారి పాలరాతి విగ్రహాన్ని ప్రతిష్ఠించి తమ శ్రద్ధాభక్తుల్ని ప్రకటించారు.

జనవరి 1977లో ప్రయాగలో 144 సంవత్సరాల తరువాత మహాకుంభమేళ జరిగింది. దానికి నేను వెళ్ళాను. శ్రీమతి మీనాక్షిగారుగూడా వచ్చారు. శ్రీ బ్రహ్మచారిగారు హనుమచ్చరిత్రను తెలుగులోనికి అనువదించి శ్రీస్వామి వారి జ్ఞాపకార్థం ప్రచురించమని ఆదేశించారు.

ఈ ప్రచురణకార్యములో నాకు ఎంతగానో తోడ్పడిన నామిత్రులు, స్నేహశీలి, శ్రీపాద వేంకటఅచ్యుతరామ లింగేశ్వరశాస్త్రిగార్కి నేను సదా కృతజ్ఞతడను. ఈ పుస్తకాన్ని సర్వాంగసుందరంగా తయారుజేసిన శ్రీ నవజ్యోతి ప్రెస్సు వారికి నా శుభాకాంక్షలు.

ఇట్లు

భక్తపాదరేణువు

కె. శివసత్యనారాయణ

# అనుక్రమణిక

వాసుదేవ ఓం వాసుదేవ

భక్తిపూర్ణ హృదయముతో
భరిత నిత్య వినయముతో
మహావీర హనుమ చరితను
అంకితమ్ముగా సమర్పింతును.



బ్రహ్మీభూత ప. ప. పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ
అవధూతేంద్ర స్వాములవారికి అంకితము








రచయిత:

పూజ్యశ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారు.

❋❋❋❋❋❋❋❋❋❋❋❋❋

అనువాదకులు:

డా॥ కె. శివసత్యనారాయణ.
M.A., Ph.D.



# మహావీర హనుమాన్



## హనుమచ్చరిత్ర

## I

రామం రామానుజం సీతాం భరతం భరతానుజమ్।
సుగ్రీవం వాయుసూనుంచ ప్రణమామి పునః పునః॥

**శ్రీ రామచంద్రునికి, లక్ష్మణునికి, సీతామాతకు, భరతునకు, శత్రుఘ్ననకు సుగ్రీవునకు, హనుమంతునకు మాటిమాటికి నమస్కరిస్తాను**

మహావీర హనుమంతుని చరిత్ర పరమపావనమైనది. ఈ ప్రపంచంలో సేవకి ఇలాంటి అద్భుతమైన ఉదాహరణ మరెచ్చటా కానరాదు. సేవకుడు తన సేవాప్రభావంచేత స్వామికన్నా మిన్న అవుతాడు, అనేది ధృవసత్యము. రాముని కన్నా రాముని దాసులు మాన్యులు, పూజనీయులు అవుతారు. సేవకునకు, నౌకరునకు తేడా ఏమంటే నౌకరు సేవచేసి దాని ప్రతిఫలాన్ని కోరుతాడు. సేవకుడు సేవచేయడం మినహా ఏమీకోరడు. అతనికి సేవచేయడంలోనే అలౌకికమైన ఆనందం కలుగుతుంది. సేవకుడు స్వామికి అనన్యభక్తుడవుతాడు. స్వామిపట్ల అతనికి గాఢమైన స్నేహం వుంటుంది. సేవకు వశీభూతుడై అతను సేవచేయడానికి ఎల్లవేళలా వ్యగ్రుడై వుంటాడు. స్వామియెడల భక్తి కుదిరితే మిగతా సద్గుణాలన్నీ స్వయంగా తమకితామే ఏ ప్రయాస, పరిశ్రమ చేయకుండానే

వచ్చేస్తాయి. కోరికకల్గి సేవచేయువాడు సేవకుడుకాదు; వ్యాపారస్తుడు, వ్యాపారంలోనే ఇచ్చి-పుచ్చుకోవడం జరుగుతుంది. భక్తుడు గుణములకు నిధిఅవుతాడు. హనుమంతునిలో వున్న పెక్కుగుణాలను స్వయంగా శ్రీరామచంద్రులవారు తననోట వర్ణించారు.

హనుమాన్ భయభీతుడైన సుగ్రీవుడు ఆదేశించగా ఋష్యమూక పర్వతంపైపు వస్తూ శ్రీరామునిజాడ తెలుసుకోవడానికి వెళ్ళినప్పుడు తన కపిరూపాన్ని మార్చుకొని భిక్షుకుని వేషాన్ని ధరించారు. శ్రీరామచంద్రుని పరిచయం అడిగారు. శ్రీరాముడు స్వయంగా మాట్లాడకుండా ఆయనతో లక్ష్మణుని మాట్లాడమని ప్రేరేపించారు. శ్రీరామచంద్రుడు స్వయంగా హనుమంతునితో మాట్లాడకపోవడానికి ఎన్నో కారణాలు ఉన్నాయి.

మొదటికారణం - హనుమాన్ తన యథార్థరూపంలో రాకుండా మారువేషంలో వచ్చారు. భగవంతునకు కృత్రిమత నచ్చదు. వారులోపల బయట నిర్మలమైన మనస్సు గల్గిన వారినే కోరుతారు. అలాంటివారినే స్వీకరిస్తారు.

రెండవకారణం - ఇటు శ్రీరాముడు రాజు. లక్ష్మణుడు ఆయనమంత్రి. అటుసుగ్రీవుడుకూడా రాజేగదా. హనుమాన్ ఆయనమంత్రి. ఈకారణంగా మంత్రితో మంత్రిగారే మాట్లాడాలి.

మూడవకారణం - హనుమాన్ భగవంతునకు నిత్య దాసుడు. దాసునకు స్వామియెడల ఎంత ఎక్కువగా ఉత్కంఠ పెరుగుతూవుంటుందో దాసునకు అంతఎక్కువ సుఖం కలుగుతుంది. ఇందుచేత ఆయన ఉత్కంఠను పెంపొందించడానికి, ఎక్కువగా సుఖాన్ని కలుగచేయడానికి గాను మాట్లాడ లేదు.

నాల్గవకారణం - భగవంతుడు తనకార్యనిమిత్తం వెళుతున్నారు: హనునుంతునితోనే ఆయనకార్యం సిద్ధించవలసివుంది, ఆయన పిలవకుండానే స్వయంగా పనిచేయడానికి హాజరైనారు, ఇందుచేత భగవంతుడు ఆయనపట్ల కృతజ్ఞతా భారంచేత క్రుంగిపోయి స్వయంగా మాట్లాడలేక లక్ష్మణుని పేరేపించారు.

ఐదవకారణం - హనుమాన్ ఆగకుండా శుద్ధసంస్కృత భాషలో ధారాప్రవాహంగా సులలితమైన వాక్కుతో ఉపన్యసిస్తున్నారు. ఈయన వాక్పటుత్వం, విద్వత్తు, సహృదయత, మధురవాణి, ధైర్యము, సాహసాది గుణాలకు మోహితులై ఈయనతో ఏమిమాట్లాడాలో నిర్ణయించుకోలేక పోయారు.

ఆరవకారణం-హనుమాన్ వారిని పరిచయం అడిగారు. పరిచయం ఇవ్వడంలో కొద్దో-గొప్పో ఆత్మప్రశంస నోట వెలువడుతుంది. ఆత్మప్రశంస అన్నిటికన్నా పెద్దదోషం. ఈ

దోషాన్నుంచి తప్పించుకొనడానికి ఎవరూ తననోటపరిచయం చేసుకోరు. ఇతరులు ఎవరైనా వారి పరిచయం ఇస్తుంటారు. ఇలాంటి ఎన్నో కారణాలవల్ల భగవాన్ హనుమానునితో లక్ష్మణుని మాట్లాడమన్నారు. హనుమానుని గుణాలను కీర్తిస్తూ భగవాన్ లక్ష్మణునితో అన్నారు. లక్ష్మణా! ఈయనసుగ్రీవుని మంత్రి హనుమాన్.

ప్రభూ! తమరు ఎలాతెలుసుకున్నారు? అనిలక్ష్మణుడు అడిగాడు.

భగవాన్ అన్నారు- సోదరా! వాక్కే వ్యక్తిని పరిచయం చేస్తుంది. మానవుడుమాట్లాడటం ప్రారంభించినప్పుడుఅతని కుల, వంశ, విద్యాబుద్ధి, గుణాల పరిచయం కలుగుతుంది. ఈయన మాటలనుబట్టి ఈయన నాలుగు వేదాలపండితులు, వేదాంగములను బాగా అధ్యయనం చేసినట్లు, వ్యాకరణంలో దిట్ట అనిపించింది. ఎందుకంటే మాట్లాడటం ప్రారంభించినప్పటినుంచి ఒక్కవాక్యం గూడా దోషయుక్తంగా మాట్లాడడంలేదు. చాలామంది మాట్లాడుతూవుంటే ఆకారమే చెడిపోతుంది. కొందరు ముఖాన్ని తిప్పుతారు, కొందరి నేత్రాలు అదోలా అయిపోతాయి. మరికొందరి కనుబొమ్మలు నిక్కపొడుచుకుంటాయి. ఇంకొందరి అన్యాన్య అంగములు వికృతమైపోతాయి. ఈయన మాట్లాడునప్పుడు వీరిలో ఏఒక్కటీగూడా దోషం కనుపించలేదు. చాలామంది

చిన్న విషయాన్ని విస్తరించి చెబుతారు. చాలామంది ఆగి-ఆగి అస్పష్టంగా మాట్లాడుతారు. చాలామందిశిష్టులు, సుశిక్షితులు, ఆచారవంతులు మాట్లాడవలసినట్లుగా మెల్లగా మాట్లాడుతారు. ఈయన సంభాషణ మధురంగానూ, స్పష్టంగానూ, చిత్తాకర్షకంగానూవుంది. ఈయన సంభాషణ వింటూవుంటే, ఇంకా ఇంకా వింటూనేవుండాలి అని అనిపిస్తుంది. ఈయన మాటలను వినగానే శత్రువు హృదయంగూడా మారిపోతుంది. ఈయన అస్త్రశస్త్రాలతో దెబ్బకొడుతున్నా ఆగిపోతారు. ఈయన సుగ్రీవుని సచివులు. ఏరాజు దగ్గర ఇలాంటి సుయోగ్యుడైన సచివులు వుంటారో ఆరాజు సకలమనోరథాలు నెరవేరుతాయి.

ఎవరి ఉపన్యాసమునువిని స్వయంగా సాక్షాత్తు భగవంతుడుగూడా ఇంతగా ప్రభావితుడైనాడో, అలాంటి హనుమంతుని గుణాలను ఎలా ప్రశంసించడం?

జానకిమాతగూడా ఈయన గుణాలకు ప్రసన్నురాలై అన్నది- హనుమాన్! నీభక్తి, భగవద్విశ్వాసము, బలము, పౌరుషము, పరాక్రమము, కార్యదక్షత మొదలగు అద్భుత గుణాలను చూసి నాకుచాలా సంతోషం కలిగింది. నాయనా! నేను నిన్ను ఆశీర్వదిస్తాను. నీవు అద్వితీయ బలవంతుడివిగా, శీలసంపన్నుడువిగా, అజరుడివిగా, అమరుడివిగా, సద్గుణాలనిధిగా, భగవానుని భక్తుడివిగా అవుగాక. రాఘవులు నీమీద ఎల్లవేళల స్నేహం వుంచుతారు. తనభక్తిచేత సీతా

రాములను వశంచేసుకున్నవారిని గురించి విశేషంగా చెప్పనవసరంలేదు.

హనుమాన్ అందరిమీద దయాదృష్టి కలిగివుంటారు. కాని, కథావాచకులమీద ఎక్కువగా స్నేహాన్ని చూపుతారు. ఒకవేళ ఎవరైనా కథావాచకులు నిష్కాములైన ఎడల హనుమాన్ అట్టివారి సమస్తభారాన్ని తానే వహిస్తారు. ఇలాంటికథావాచకునకు ఎప్పుడూ ఏవి యూనికి లోటురాదు. సకామ కథావాచకులపైనగూడా వారు కనికరించుతారు.

సకామీ పురుషుడు ఈయనమంత్రాన్ని ఒక్కసారి జపించి పురశ్చరణ చేసుకున్నట్లయితే అతని కోరికలన్నీ నెరవేరుతాయి. దేవాలయంలోగాని, పవిత్ర నదీతీరమందు గాని, పుణ్యక్షేత్రములోగాని హనుమంతునిమూర్తి వుంటే దానిని పూజించండి. మూర్తిలేకపోతే ఫోటోను పెట్టుకొని, అదీలేకపోతే చివరకు భూమిమీద మూర్తిని వేసుకొని ముందుగా మూలమంత్రింతో వారిని పూజించండి. "హనుమతే రుద్రాత్మకాయ హుంఫట్" ఇది ఏకాదశాక్షర మంత్రం. ముందుగా చేతులను శుభ్రించేసుకొని ప్రాణాయామం చేయాలి. తరువాత నేను ఫలానా కోరిక నెరవేరడానికి లేక నిష్కామభావంగా అని సంకల్పం చెప్పుకోవాలి. పదకొండు అక్షరాల మంత్రం గనుక పదకొండు లక్షలు లేక ఒకలక్షమంత్రజపంచేస్తాను అని, తిరిగి మూలమంత్రాన్ని చదువుతూ ఆవాహనచేయాలి. హనుమతే రుద్రాత్మకాయ హుం ఫట్, ఆవాహయామి. ఈ

మాదిరిగానే మంత్రాన్ని చదివి 1. ఆసనం సమర్పయామి, 2. పాద్యం సమర్పయామి, 3. అర్ఘ్యం సమర్పయామి, 4. ఆచమనీయం సమర్పయామి, 5. స్నానార్ధం జలం సమర్పయామి, 6. యజ్ఞోపవీతం సమర్పయామి. 7. వస్త్రం సమర్పయామి. 8. చందనం సమర్పయామి, 9. అక్షతాన్ సమర్పయామి, 10. పుష్పాణి-పుష్పమాలాం సమర్పయామి, 11. ధూపం సమర్పయామి. 12. దీపం సమర్పయామి, 13. నైవేద్యం సమర్పయామి. 14. ముఖశుద్ధ్యర్థం తాంబూలం సమర్పయామి, 15. దక్షిణాం, మంత్రపుష్పం సమర్పయామి. 16. నీరాజనం సమర్పయామి. హారతియిచ్చి ప్రదక్షిణచేసి సాష్టాంగ నమస్కారం చేయాలి. హనుమంతుణ్ణి ముందుగా ఈవిధంగా ధ్యానించండి.

మహాశైలం సముత్పాట్యధావన్తం రావణం ప్రతి
తిష్ఠ తిష్ఠ రణే దుష్ట ఘోర రావం సముత్సృజన్
లాక్షారసారుణం రౌద్రం కాలాన్తక యమోపమ్
జ్వలదగ్ని లసన్నేత్రం సూర్యకోటి సమప్రభమ్
అంగదాద్యైర్మహావీరై ర్వేష్టితం రుద్రరూపిణమ్
ఏవం రూపం హనూమంతం ధ్యాత్వాయః ప్రజపేన్మనుమ్.

ఈరూపాన్ని ధ్యానిస్తూ జపంచేసుకుంటే తప్పనిసరిగా ఇష్టసిద్ధి కలుగుతుంది.

హనుమంతుణ్ణి చాలామంది ప్రత్యక్షం చేసుకున్నారు. వీరిలో కొందరు కపటభక్తులు, కొందరు యథార్థమైన భక్తులు హనుమాన్ అందరిని అనుగ్రహిస్తారు. హనుమానుని అనంత గుణాలలోనుంచి మనంజీవితంలో ఏఒక్క గుణాన్ని అలవరచు కున్నా మనజీవితం సార్థకమవుతుంది. వీరి సేవచేత లౌకిక. పారలౌకిక వాంఛలన్నీ సిద్ధిస్తాయి.

మహావీర హనుమానుని ఈ జీవితచరిత్ర వారిప్రేరణ చేతనే వ్రాశాను. ప్రియమిత్రుడు బిందుజీ ఒకరోజున హఠాత్తుగా వచ్చి—మహరాజ్! మీరుఎన్నో గ్రంథాలు వ్రాశారు. ఏవిధంగా భాగవతకథ వ్రాశారో, అలాగే ఒక మహావీర హనుమానుని చరిత్రగూడా వ్రాయండి, అని అన్నారు. మరల మాబంశీవట బిహారీ గిరిధారీ మందిరాన్ని చూసి- ఇక్కడ ఒక హనుమంతునిమూర్తిని గూడా ప్రతిష్ఠించాలిఅనిఅన్నారు. వారి రెండుకోరికలు కార్యరూపాన్ని ధరించాయి. ఒకవైపున ఈహనుమంతునిచరిత్ర వ్రాయనారంభించాను. రెండవవైపున హనుమాన్ కోసరం చిన్నమందిర నిర్మాణం ప్రారంభ మయింది. ఒకవైపున హనుమానుని మందిరం తయారైంది. రెండవవైపు ఖాళీ—ఖాళీగావుంది. అక్కడగరుడ భగవానుని స్థాపిస్తే బాగుంటుంది, అని అనిపించింది. రెండుమందిరాలు తయారుఅయాయి. జయపూర్ వెళ్లి మారామరాజు శ్రీహనుమానుని, శ్రీగరుడ విగ్రహాలను తీసుకొని వచ్చాడు. పుస్తకం వ్రాయడం పూర్తి అయిపోయింది. ఒకచిన్నపుస్తకం

వ్రాద్దామనుకున్నాను, కానిహనుమాన్ ముందుగా ఆలోచించు కొని వున్నదేఅవుతుంది. మనం ఆలోచించడంచేత ఏమౌతుంది? పిల్లవాడు జన్మించకపూర్వమే తల్లిస్తనాలలోకి పాలువస్తాయి అతనికోసరం, మందిరం తర్వాత తయారైంది కాని దానికి కావలసినమూర్తి ముందుగానే నిర్మించబడింది. నిర్మాణానికి పూర్వమే ఇది నిర్ణయమైపోయింది. ఈమూర్తి ఫలానారోజున ఫలానాస్థలంలో శ్రీబృందావనంలో ప్రతిష్టింపబడుతుంది ఈవిధంగా చేశేవారు, చేయించేవారు అన్నీవారే. ఎవరిచేత వారు ఎప్పుడు ఏంపని చేయించుకుంటారో అతనిచేత ఆపని అదేసమయంలో హఠాత్తుగా చేయించుకుంటారు. ఇందువలన ఓ పవనతనయా? మీరు ఏవిధంగా ప్రేరేపించారో, ఆపని మీ ప్రేరణచేతనే మీఅనుగ్రహ ఆశీర్వాదాలచేతనే పూర్తి అయింది. ఇకమీరు ఈసాంసారిక మాయా మోహాలలో మనస్సు రమించ కుండా వుండునట్లు అన్నివేళల ప్రభు చింతనలోనే సమయం గడచి పోయేటట్లుగా ఆశీర్వదించండి. శరీరంపట్ల అహంకా రమూ, సాంసారిక వస్తువులపట్ల మాయా మమకారాలు కలుగ రాదు. ఇంతమాత్రంగానే వ్రాసి నా ఉపన్యాసాన్ని ముగిస్తాను. పాఠకులను చేతులు జోడించి ప్రార్థిస్తాను, వారు శ్రీమహావీర హనుమానుని చరిత్రను ప్రేమతో చదివి మననం చేసుకుందురుగాక. హనుమాన్‌నుంచి సేవా రహస్యాన్ని, సేవకుని ధర్మాన్ని, అనుసరించవలసిన విధానాన్ని నేర్చుకొందురుగాక. హనుమంతుని భక్తులలోనుంచి ఏ ఒకరి కైనా ఈచరిత్ర చదవడంచేత సంతోషంకల్గితే నేను నాపరిశ్రమ

మీరుచంచల వానరజాతి గౌరవాన్ని వృద్ధిచేశారు. ఓ కందమూల ఫలప్రియ కపీశా! మీరు సూర్యుణ్ణిగూడా ఫలంగా భావించి దాన్ని భక్షించడానికి అద్భుతంగా ప్రయత్నించారు. ఓ హనుమాన్! ఇంద్రునితో గూడా యుద్ధంచేసి మీరు మీ అద్భుత పరాక్రమాన్ని పవిత్రంచేశారు. ఓ సూర్యశిష్యా! మీరు భగవాన్ సూర్యదేవునివద్ద విద్యనభ్యసించి వారికి మీబుద్ధివైలక్ష్యాన్ని చూపి విస్మయమొందునట్లు చేశారు. ఓ నృత్యాచార్యా! మీరు మీ అతులనీయమైన నృత్యకళచేత కోసల కిశోరుల్ని ఎల్లవేళల మీ వశపరచుకున్నారు.

ఓ సుగ్రీవ సచివుడా! మీరు మీఅమోఘ మంత్రశక్తిని చూపి సుగ్రీవుని రామునకు స్నేహితునిగానూ, సేవకునిగానూ, దాసునిగానూ జేశారు. ఓ సీతాన్వేషక! ఎవరూ చేయజాలని సీతాన్వేషణ దుష్కరకార్యాన్ని మీరు శత యోజనసముద్రాన్ని చేతులతో దాటివెళ్ళి సీతకు శ్రీరాముని సందేశాన్ని వినిపించారు. ఓ విదేహ తనయోచ్ఛంగలాలిత? మీవిలక్షణ బుద్ధిచేత సీతను లంక యావత్తూ వెదికి ఆమెకు రఘునాధుని చరిత్ర వినిపించి ఆమెను అనుకూలంగా చేసుకొని రాఘవునకు ముద్రికను ఇచ్చి వారిశోక-సంతాపాన్ని తగ్గించారు. ఓ అక్షయకుమార హంతా! అక్షుని హతమార్చి సైనికులను సంహరించి మీరు అద్వితీయ మైన పరాక్రమాన్ని ప్రదర్శించారు. నాగపాశంచేత బంధించబడినప్పటికీ మీరు అద్భుతసాహసాన్ని అపూర్వ నిర్భయత్వాన్ని చూపారు. ఓ లంకా భయంకర! రాక్షసుల

ద్వారా తోకకునిప్పుఅంటించినప్పుడు అద్భుతనాటకమాడారు. సువర్ణలంకను ధూ–ధూ అంటూ భస్మంచేసినపని శరీరాన్ని పులకింపచేస్తుంది. మీతండ్రి వాయువు మీకు సహాయపడ్డాడు. మీతల్లి సీతమ్మ మీకొరకు మొక్కు మొక్కింది. అగ్నిదేవుడు మీకోసరం మంచుకంటేగూడా ఎక్కువగా చల్లబడ్డాడు. మీరు లంకనుభస్మంచేసి దభీమని అంతులేని సముద్రంలోకి దూకారు.

ఓ రామదూత। మీరు లంకనుకాల్చి జగజ్జననీ జానకి నుంచి అనుజ్ఞతీసుకొని గుర్తుగా చూడామణిని పుచ్చుకొని దుఃఖ సాగరంలో మునిగివున్న మీ స్నేహితులను సంతోషపరిచారు. రామునకు సీతసమాచారాన్ని వినిపించి వారినిజన్మ-జన్మాంత రాలదాకా ఎప్పటికీ మీరు ఋణపడివున్నట్లుగా చేశారు.

ఓ సేతుబంధన కార్యదక్షా। శతయోజనాల వెడల్పు గల సముద్రంమీద నలనీలులచేత సేతువుని నిర్మించి మీరు వానరసైన్యాన్నంతా దానిమీదుగా దాటించి తీసుకొనివెళ్ళి అక్కడ రావణునిఓడించారు. రాముణ్ణి మీపైన ఎక్కించుకొని ద్రోణగిరినుంచి సంజీవని మూలికను తెచ్చి లక్ష్మణుణ్ణి రక్షించి నానారాక్షస సేనాపతులను యమసదనానికి పంపి విభీషణుని శ్రీరామునితోకలిపి సీతామాతను తీసుకొనివచ్చి శ్రీరామునితో కలిపారు. విభీషణుని బంగారులంకకు రాజునిగా చేశారు. మీబలము, పురుషార్థము, శక్తి, భక్తి, ప్రేమ, అనురాగము అన్నీ ధన్యమైనాయి. అందుకేకదా మీరు రామునికంటే

గూడా లోకప్రియులైనారు. రామునికంటే రామునిదాసుడే గొప్పవాడౌతాడుగదా. ఇందులో ఆశ్చర్యమేమున్నది?

ఓ నిజమైన సేవకుడా, మీరు చిటికవేసి ఇతర సేవకుల నందరినీ శక్తిహీనులుగా చేశారు. ఓ జానకీ ముద్దుబిడ్డా, మీరు జానకిధరించు సిందూరాన్ని అవయవములన్నిటియందు పులుముకొని తల్లిని నవ్వించారు. ఓ శంకరుని సేవకుడా, మీరు రామేశ్వరునితో సమానంగా హనుమదేశ్వరుని ప్రతిష్ఠించి జగత్తులోనిజీవులను ఆపదలబారినుంచి దూరమయే మార్గాన్ని చూపారు. మీరు అనేక అశ్వమేధపు గుర్రాలవెంట వెళ్లి అద్భుతమైన అద్వితీయమైన పౌరుషాన్ని చూపారు.

ఓ సంకీర్తన ప్రియుడా! మీరు మీ రామకథానురక్తి చూపి భక్తులకు ఒక ఆదర్శవిధానాన్ని చూపించారు. రామకథ జరిగే ప్రతిచోటా అశ్రువిమోచన చేస్తూ ఆ కథను వింటూ ఉంటారు. మీరు రాముని ద్వారపాలకులు, జానకిముద్దుబిడ్డలు. భక్తులకు ఒకే ఒక ఆసరా. భవసాగరాన్నుంచి తరింపజేశే వారు. తండ్రి కేశరికి, శివునకు, వాయుదేవునకు, తల్లిఅంజనకు అత్యంతప్రియులు. మీరు ఎందరోభక్తులను దుఃఖసాగరాన్నుంచి ఒడ్డుకుచేర్చారు. మీరు దీనులకు సర్వథారక్షకులు, మీరు మాపై కనికరించండి, అనుగ్రహించండి, అనుకంప చూపండి. మీ అగాధచరిత్ర సాగరాన్నుంచి కొన్ని బిందు కణములను తీసుకొని కొంత నటనచేద్దామని అనుకొంటున్నాం. ఈనటన జేయునట్లు మమ్ములను ఆశీర్వదించండి.

# అంజనానన్దన హనుమాన్

## 3

అంజనానన్దనం వీరం జానకీ శోక నాశనం।

కపీశమక్ష హన్తారం వన్దే లంకా భయంకరం॥

(ఎవరు మాతా అంజనాదేవి ఆనందాన్ని వృద్ధిచేస్తారో, వీరులో, మాతా జానకి శోకాన్ని పోగొట్టుతారో, కపులకు ప్రభువో, రావణ తనయుడైన అక్షకుమారుని హతమార్చారో, లంకాపురానికి భయాన్ని కలగ జేశారో, అట్టిహనుమంతునికి నేను నమస్కరిస్తున్నాను.)

మహావీరహనుమాన్ గొప్ప బలవంతుడు, చాలా విచిత్రమైన చాలా సరళ స్వభావం గల్గిన, సర్వసామాన్య దైవము. విష్ణు భగవానునికి వస్త్రాలు, ఆభరణాలు, పళ్లు, పూలమాలలు, గంధము, అత్తరు ఇలాంటివి ఎన్నో అలంకరణ వస్తువులు కావాలి. స్నానానికి పంచామృతాలు, గంధము, దివ్యౌషధులు, మహౌషధలు మొదలగు పెక్కు వస్తువులు కావాలి. కాని మా ఈ హనుమంతుణ్ణి దర్శిస్తేచాలు, లడ్డూ నివేదన చేస్తే చాలు; పూజ అయిపోయినట్టే. స్నానం చేయించే పనిలేదు. చందన ధూప, దీపాల నిమిత్తంలేదు. వారానికో, పక్షానికో, మాసానికో, లేక సంవత్సరానికో ఒకసారి ఎర్రని వస్త్రాన్ని అర్పించండి, పూలమాలా, ఫలాలు మీకుఅర్పించాలని వుంటే అర్పించండి, కాని లడ్డూమాత్రం తప్పనిసరిగా కావాలి.

అవిగూడా శనగపిండివి. పాలకోవతో చేసినవైనా సరే. లడ్డు లేకపోతే హనుమంతుడు త్వరగా అనుగ్రహించడు. లడ్డు లభించకపోతే శ్రీరాముని ఆదేశాన్ని గూడా తారుమారుచేస్తారు. ఇందుకు సంబంధించిన ఒక కథ చెబుతాను.

జగన్నాథపురిని సముద్రుడు ఎప్పుడు తలచుకుంటే అప్పుడే ముంచేస్తుండేవాడు. ఇందువలన జగన్నాథునకు చాలాకష్టం కలుగుతుండేది. ఒకసారి జగన్నాథజీ శ్రీరామ చంద్రునితో నేరారోపణ చేశారు–మహారాజ్! ఈసముద్రాన్ని మీవంశస్థులైన సగరుని పుత్రులు త్రవ్వారు. ఈయన మాతో ఎప్పుడూ గొడవపెట్టుకుంటున్నాడు, తలుచుకున్నప్పుడల్లా అదేపనిగా మాపురిని ముంచేస్తున్నాడు. ఇలా జరుగకుండా ఎదైనా ఏర్పాటుచేయాలి.

భగవంతుడు– భవగన్, ఈసముద్రుడు జడము నాపట్ల గూడా ఈతను ఇలాగే వ్యవహరించాడు. నేనుఎన్నో సత్యాగ్రహాలు, ఉపవాసాలు చేశాను. అప్పటికీ లొంగలేదు.. నాకుకోపంవచ్చి బాణం ఎక్కుపెట్టేసరికి కానుకలు తీసుకొని వచ్చి సేతువుని నిర్మించి దాటివెళ్ళమని ఉపాయంచెప్పాడు అయితే నేను ఇతనికి నచ్చజెబుతాను.

భగవంతుడు సముద్రునితో అన్నాడు– ఓసోదరుడా, నీవు జగన్నాథునకు కష్టాన్ని కలిగించకు.

అప్పుడయితే సముద్రుడు అలాగే అలాగేఅని అన్నాడు

కాని ఎవరికి ఏలాంటి స్వభావం ఏర్పడుతుందో, అదివోదు; అప్పుడప్పుడు సరదా కలిగినప్పుడు పట్టణాన్ని ముంచుతూనే వున్నాడు. ఇందుకుగాను శ్రీ జగన్నాథస్వామి మరల ఫిర్యాదుచేశాడు.

ఈసారి శ్రీరాముడు హనుమను ఆదేశించాడు— హనుమాన్? ఈ సముద్రుడు జడస్వరూపుడు: బొత్తిగా వినడంలేదు. నీవు జగన్నాథపురిని రక్షించడానికి సముద్రపు ఒడ్డున కూర్చొనివుండు, ముందుకి పొంగివస్తే బుద్ధివచ్చేలాగా గదతో గట్టిగా ఒకదెబ్బ కొట్టవలసినది.

హనుమాన్ ఆజ్ఞాపాలకుడుగదా. జగన్నాథపురిలో సముద్రపు ఒడ్డునకూర్చున్నాడు. సముద్రునకు హనుమంతుని బలపరాక్రమాలు తెలుసు. భయంచేత పట్టణాన్ని ముంచడం లేదు. కాని జగన్నాథపురిలో హనుమంతునికి ఒక గొప్ప ఇబ్బంది కలిగింది. జగన్నాథస్వామి అన్నం తింటారు. అన్నమే వారికి ముఖ్యభోజనం. అచట అన్నాన్నే అందరికి ప్రసాదరూపంలో యిస్తారు. జగన్నాథునిఅన్నానికి జగత్తంతా చేతులను సాచుతుంది. వారిదగ్గర మడి, మడని అంటూ, ఆచారము, ఎంగిలి, వింగిలి అలాంటివి వుండవు. జగన్నాథునకు నివేదనచేస్తేచాలు, అన్నం పవిత్రమౌతుంది. దానిని ఎవరుతాకినా అంటులేదు. ఎక్కడికైనా తీసుకొనివెళ్ళవచ్చు, ఎవరితోనైనా కలిసి తినవచ్చు. కాని హనుమంతునికి అన్నం

రుచించడంలేదు. మనస్సు విసిగిపోయింది, ఒకనాడు మెల్లగా రాత్రిపూట ఎవరికీ తెలియకుండా అయోధ్యకు వచ్చి మనసారా లడ్లను భుజించి సూర్యోదయంకాకుండా పురికి తిరిగి వచ్చాడు. ఇక ఆయన రుచి మరిగి రాత్రికాగానే, అయోధ్యకు వెళ్ళి కడుపునిండా లడ్లను తిని వస్తూవున్నాడు. కర్తవ్యంపట్ల విముఖుడుగా వున్నట్లు ఎక్కడ ఫిర్యాదు వస్తుందో అని శ్రీరామచంద్రుని దర్శించడంలేదు. ఇది దొంగతనంగా రావడంగదామరి.

సముద్రునకు హనుమంతుని దొంగతనం గురించి తెల్సింది. అయినా దొంగతనం ఎన్ని రోజులు దాగుతుంది. ఒకరోజున హనుమాన్ లడ్లను తినడానికి అయోధ్యకు వెళ్ళగానే సముద్రుడు తన పూర్తిబలాన్ని వినియోగించి పురిని ముంచేశాడు. జగన్నాథస్వామి వెదకించారు, కాని హనుమంతుని జాడ తెలియలేదు.

జగన్నాథస్వామి అయోధ్యలో మహారాజుగారి న్యాయస్థానంలో హనుమంతుని గురించి తిరిగి ఫిర్యాదుచేశారు. హనుమాన్‌కి తాకీదు వచ్చింది, ఆయన చేతులను కట్టుకొని హాజరైనాడు.

శ్రీరాముడు — హనుమా? నీవు కాపలామానేసి ఎక్కడికి వెళ్లావు? ఎందుకు వెళ్లావు? తగిన కారణం చెప్పవలసినది, అని అడిగాడు.

హనుమాన్ యథార్థ విషయాన్ని చెప్పాడు. మహారాజ్! కొట్టండి లేక విడిచిపెట్టండి. అన్నంతిని నామనస్సు విసిగి పోయింది. అన్నం రుచించకపోవడంచేత, రుచిని మార్చుకుందామని లడ్డూను తిందామని అయోధ్యకు వచ్చాను.

శ్రీరాముడు - అయితే నీవు రోజూ అయోధ్యకు వస్తున్నావా?
హనుమ - అవును, మహారాజ్? నేను నిత్యమూ వస్తున్నాను
రాముడు - అయితే, నీవు నన్ను ఎందుకు కలుసుకొనడంలేదు

మహారాజ్: దొంగతనంగా దాగివస్తున్నాగదా. అలాంటప్పుడు తమ దర్శనం ఎలాచేసుకుంటాను. భయంచేత రావడంలేదు, అని హనుమాన్ అన్నాడు.

శ్రీరాముడు ఈ మాటలు విని నవ్వి జగన్నాధునితో అన్నాడు - మహారాజ్? మీరు మీ మాదిరిగానే అందర్ని అన్నం తింటారని అనుకుంటారు. ఇతనికి లడ్డు కావాలి, కనుక లడ్లను ఏర్పాటు చేయించండి, ఇతన్ని పారిపోకుండా బంధించి వుంచండి.

జగన్నాధస్వామి హనుమంతునకు కావలసినట్లుగా లడ్లను ఏర్పాటు చేశారు. ఆయన చేతులకు, కాళ్లకు సంకెళ్లు వేయించి సముద్రపు ఒడున బంధించి వుంచారు. జగన్నాధపురిలో నేటికీ ఆయన "బేడీ హనుమాన్" అనే పేరుతో వున్నాడు. మేము స్వయంగా ఆయన పాదాలకు సంకెళ్లు వేసివున్నట్లు చూశాం. జగన్నాధుని దర్శించడానికి వచ్చిన

వారు సముద్రపు ఒడ్డున వున్న బేడీహనుమాసుని దర్శిస్తారు. అక్కడ మాత్రం అన్నాన్ని నివేదన చేయడానికి నిషేధించారు. అందరూ లడ్లను అర్పిస్తారు. అక్కడే లడ్లు దొరుకుతుంటే ఇంకొక చోటకి వెళ్ళవలసిన అవసరమేముంది? ఈవిధంగా లడ్లకొరకు హనుమాన్ పాదాలకు సంకెళ్లు వేయించుకున్నాడు. నిజానికి లడ్లరుచి అలాంటిది. పైగా మన హనుమాన్ మోదక ప్రియుడుగదా.

హనుమంతుని తల్లి అంజనా తండ్రి కేశరి, శంకరుడు, వాయువు ముగ్గురు తండ్రులు ఎలా అయ్యారు అని మీరు అడగవచ్చు. కానివిభిన్న పురాణాలలో విభిన్నగాధలువున్నాయి. కొన్నిటిని ఇక్కడ ముచ్చటిస్తాము. ముందుగా అంజనామాత గురించి చెబుతాను.

స్వర్గలోకంలో ఇంద్రుని దగ్గర ఎందరో అందమైన అప్సరసలున్నారు. వారందరిలోనూ మిక్కిలి అందంగా "పుంజికాస్థలా" అనే ఒక అప్సరసవుంది. ఆమె ఎంతటి అందకత్తో అంతటి చంచలస్వభావము గలది. నవ్వు ఆమె పెదవులపైన ఎల్లవేళలా వుట్టిపడుతూ వుంటుంది. ఒక రోజున తన చంచల స్వభావంచేత ఒకానొక మహర్షిని వేళాకోళం చేసింది. అందుకు కోపబడి మహర్షి "నీవు కోతిమాదిరి చంచలంగా వ్యవహరిస్తున్నావు గనుక భూలోకంలోకి వెళ్లి కోతిగావుండు, అని శపించాడు.

మహర్షి నోట శాపం వినగానే ఆమెకు మతిపోయి ఆయన పాదాలపై బడి మిక్కిలి వినయంగా అపరాధాన్ని మన్నించమని వేడుకొన్నది.

మహర్షులు సహజంగా దయకల్గి వుంటారు. వారి క్రోధం నీటిపైని గీతలాగా ఒక్కక్షణం కనుపించి మాయమైపోతుంది. ఆయన ప్రసన్నుడై - నేను ఎప్పుడూ అసత్యం పలుకలేదు. నీవు కోతి రూపాన్ని ధరించవలసిందే, కాని అభీష్టరూపాన్ని ధరిస్తావు. కోరినప్పుడు మానవరూపాన్ని ధరించగలవు, వానర రూపాన్ని గూడా ధరించ గలవు, అని అన్నాడు.

మహర్షి శాపం సత్యమయింది. పుంజికాస్థలా సుమేరు పర్వత గుహలో ఒక వానరిగా జన్మించింది, నిజానికి భూలోకంలో వుండే వానర జాతి మాదిరి జాతి కాదు. ఇది ఉపదేవతలలోని కింపురుషజాతికి చెందినది, వీరు అభీష్ట రూపధారులు. వీరి ఆకృతి మానవాకృతి మాదిరిగానే వుంటుంది. తోకగూడా వుంటుంది. కేశరీ ఒక వానరరాజు, అంజనా మిక్కిలి రూపవతి. కేశరికి ఆమెకు వివాహమయింది. వీరికి సంతానంలేదు. స్త్రీలకు సహజంగా తల్లికావాలని, పుత్రుడు కలగాలని కోరిక వుంటుంది. అంజనా పుత్రప్రాప్తికి భగవాన్ శూలపాణిని ఆరాధించింది.

శ్రీరాముడు అవతరించనున్నాడు. తను గూడా అవనిపై అవతరించి శ్రీరామునికి సేవచేద్దామని శంకరునకు కోరిక కలిగింది. శంకరుడు ఏకాదశరుద్రరూపుడు. పదకొండవ అవతారమే హనుమాన్. శంకరుని వరప్రసాదం చేత అంజనా గర్భాన్నుంచి స్వతః శంకరుడు అవతరించి నందున ఇతనిని "శంకరసూనుడు" అని అంటారు. శంకరుని వరప్రసాదాన్ని అనురక్తితో పవనదేవుడు అంజనా గర్భంలో వుంచుటచేత ఈయన పవనకుమారుడైనాడు. కేశరీపత్నికి జన్మించుటచేత కేశరీ నందనుడైనాడు. ఈయన శ్రీరామునకు సేవకుడు. స్నేహితుడు, మంత్రి గూడాను. శ్రీరాముడు ఈయనను విశేషంగా ఆదరించేవాడు ఈవిషయాన్ని వారు తననోట భావావేశంలో వెలిబుచ్చారు - హనుమా! "నీవు నాకు ఎన్నో ఉపకారాలు చేశావు. అందులో ఏ ఒక్క ఉపకారానికి నా ప్రాణాలను అర్పించినా గూడా సరిపోదు. మిగతా ఉపకారాలకు నేను నీకు ఎప్పుడూ ఋణపడేవుంటాను. ప్రత్యుపకారం సామాన్యంగా ఆపదలోనే చేస్తూవుంటారు. నీకు అపదలు రానేరావు గదా."

భగవంతుని ఈమాటలకు ఎంత విలువవున్నదో మీరే తెలుసు కుంటారు. శ్రీరాముని హృదయంలో హనుమాన్ పట్ల విశేషంగా అనురాగం వుండేది.

ఒకచోట భగవాన్ హనుమంతునితో అన్నారు- నీవు నాకు సోదరుడగు భరతునితో సమానంగా ప్రియుడవు,

సోదరుడవు. ఇందులకు సంబంధించిన ఒకకథ చెబుతాను.

దశరథమహారాజుకు సంతానంలేదు. సంతతికొరకు ఆయనమహర్షి ఋష్యశృంగుని రప్పించి పుత్రికామేష్ఠియజ్ఞం చేశారు. ఆయజ్ఞంలో సాక్షాత్తుగా అగ్నిదేవుడే చరుపాయస పాత్రను తీసుకొని ప్రత్యక్షమైనాడు. ఆపాత్రను వశిష్ఠ మహర్షికిచ్చి మహారాణీలకు పంచమన్నాడు.

వశిష్ఠులవారు ఒకభాగాన్ని పెద్దదిగానూ,రెండవదాన్ని దానికంటే చిన్నదిగానూ మూడవదాన్ని ఇంకాచిన్నదిగానూ మూడుభాగాలుగా చేశారు. పెద్దభాగాన్ని కౌశల్యకు, రెండవ దాన్ని కైకకు, మూడవదాన్ని సుమిత్రకు ఇచ్చారు.

తనభాగాన్ని చిన్నదిగాచూచి కైక కుపితురాలై అన్నది- నేను మహారాజుగారికి ఎన్నో ఉపకారాలుచేశాను. దేవాసుర సంగ్రామంలో వారిరథానికివున్న మేకు వూడిపోతే నాచేతివ్రేలినివుంచి వారిని రక్షించాను. అయినానాకు చిన్న భాగం లభించింది. చేతిలో చరపాయసం వుంచుకొని ఆమె విలపించుతూ దెబ్బలాటకు సిద్ధమయింది.

మహర్షి - అమ్మా, ఆలస్యంచేయక ప్రసాదాన్ని స్వీకరించాలి, ఆలస్యంచేస్తే ఏదైనా విఘ్నం కలుగవచ్చు అనిఅన్నారు.

కైకేయి ఏమీవినకుండా విలపిస్తూఉండగా ఆకాశంలో

ఎగురుతూవున్న గద్ద వచ్చి కైకేయి చేతిలోవున్న ఆపాయసాన్ని నోటితో తీసుకొని ఎగిరిపోయింది. కైకేయికి వున్న కొద్దిపాటి ధైర్యంగూడా పోయేసరికి బిగ్గరగా విలపించ సాగింది దశరథమహారాజ్ కౌసల్యకు, సుమిత్రకు కంటితో ఏదో సంజ్ఞచేశాడు. వెంటనే కౌసల్య తనపాయసంలో నాల్గవ భాగాన్ని, సుమిత్ర మూడవభాగాన్ని కైకేయికిఇచ్చారు.

ముగ్వురూ పాయసం పుచ్చుకొని గర్భవతులయ్యారు. కౌశల్యకు శ్రీరాముడు, కైకేయికి భరతుడు, సుమిత్రకు లక్ష్మణ, శత్రుఘ్నులు జన్మించారు.

ఇకపోతే కైకేయి చేతిలోనుంచి గద్దతీసుకునివెళ్ళిన పాయసం గురించి చెబుతాను, వినండి కేసరీ తనభార్య అంజనాతో కలిసి కిన్నరులలోకంలో సమేరుపర్వతంపైన తిరుగుతూవున్నారు. అంజనా పుత్రప్రాప్తికై ఏడువేల సంవత్సరాలు శివుణ్ణి ఆరాధించగా ఆయనప్రసన్నుడై ఆమెను ఏదైనా వరాన్ని కోరుకొమ్మనగా- ప్రభూ! నాకు సర్వగుణ సంపన్నుడగు కుమారుణ్ణి అనుగ్రహించమని అంజనాకోరింది.

శివుడు-ఏకాదశ రుద్రులలో నాఅంశమైన పదకొండవ రుద్రుడు నీకుపుత్రుడుగా జన్మిస్తాడు. నీవు ఈమంత్రాన్ని స్వీకరించు. అనిఒకమంత్రాన్ని ఉపదేశిస్తాడు. వాయుదేవుని అనుగ్రహంచేత నీకుపుత్రుడు కలుగుతాడు- అనిచెప్పి వెళ్లిపోయినాడు. అంజనా ఆమంత్రాన్ని చేతులుసాచి జపిస్తున్నది.

కైకేయి చేతిలోని పాయసాన్ని తీసుకొని ఆకాశం లోకి గ్రద్దఎగిరేసరికి ఒకపెద్ద గాలిదుమారం వచ్చింది. ఆ గాలికి గద్ద అవయవాలు ముడుచుకుపోతున్నాయి. దాని నోటినుంచి ఆపాయసం పడిపోయింది. వాయుదేవుడు మరందునిరంచే అంజనాప్లట్ల అనురక్తుడై వున్నాడు. ఆయన ఆపాయసాన్ని అంజనాచేతిలోవుంచాడు. శివుడుఈరహస్యాన్ని ముందుగానే చెప్పివెళ్ళాడు. మంత్రప్రభావానికి పాయసం లభించగానే ఆమె స్వీకరించింది. ఈవిధంగా హనుమాన్ జన్మించాడు. రాముసకు భరతునితో సమానంగా హనుమ ప్రియసోదరుడైనాడు.

అయితే ఆగద్ద పాయసాన్ని వెంటనే ఎందుకు తినలేదు? అని మీకు సందేహము కలుగవచ్చు. ఈవిషయానికి సంబం ధించిన కథనుగూడా చెబుతాను వినండి.

బ్రహ్మలోకంలో చాలామంది అప్సరసలు వున్నారు. వారిలో సువర్చసా అనే అప్సరసమిక్కిలి అందంగావుంది. చంచల స్వభావంగలది. ఒకరోజున నృత్యంచేస్తూండగా చాంచల్యానికి ఆమె మనస్సులో కామేచ్ఛకలిగింది. ఆస్థితిలో ఆమెతాళాన్ని స్వరాన్ని మరిచిపోయింది. బ్రహ్మగారు ఆమె మనోభావాల్ని తెలుసుకుని—ఇక్కడగూడానీవు ఇలాంటిచాప ల్యాన్ని చూపుతున్నావు గనుక మర్త్యలోకానికి వెళ్ళిపోవల సినది, అనిశపించారు.

ఆమె బ్రహ్మగార్ని ప్రార్థించగా ప్రసన్నుడై – నీవు గద్దరూపాన్ని ధరించవలసిందే, కాని కొద్దిరోజులలో దశరథ మహారాజు పుత్రేష్టి చేస్తారు. ఆయజ్ఞంలో అగ్నిదేవుడు స్వయంగా పాయసాన్ని తీసుకొని ప్రత్యక్షమవుతాడు. వశిష్ఠ మహర్షి ఆపాయసాన్ని ముగ్గురు రాణీలకు పంచుతారు. నీవు కైకేయిపాయసాన్ని తీసుకొని వెళ్ళిపోతావు. కానితినజాలవు. ఆపాయసస్పర్శకి నీవు గ్రద్దశరీరాన్ని వదిలి తిరిగి ఇక్కడకు చేరుతావు, అని అన్నారు.

అలాగేజరిగింది కూడాను. గద్దనోటినుంచి పాయసం పడిపోగానే ఆగద్ద తనదేహాన్ని వదిలి బ్రహ్మలోకానికివెళ్ళి "సువర్చసా" అనేడి దేవాంగన అయింది.

అంజనా గర్భాన్ని ధరించింది. కార్తీకబహుళ చతుర్దశి నాడు హనుమాన్ జన్మించాడు. ఒకానొక కల్పంలో ఈయన చైత్రశుద్ధపూర్ణిమ మంగళవారంనాడు జన్మించినట్లున్నది. కొందరుశనివారంనాడు జన్మించినట్లు భావిస్తారు. భావుకులైన భక్తులు పై రెండు తిథులందు రెండువారములందు హనుమ జ్జయంతి చేస్తారు.

ఈవిధంగా భాగ్యవంతురాలైన అంజనాగర్భమ్నుంచి మన చరిత్రనాయకుడైన హనుమాన్ ప్రాదుర్భవించాడు. ఇకముందు వారికొన్ని బాల లీలలను గురించి ముచ్చటిస్తాము, గనుక పాఠకులు సావధానమనస్కులై వింటురుగాక!

---

# బాల - హనుమాన్

## 4

ఆంజనేయ మతిపాటలాననమ్
కాంచనాద్రి కమనీయవిగ్రహమ్।
పారిజాత తరుమూల వాసినమ్
భావయామి పవమాన నందనమ్ *

పుత్రుని పాదాలమెరుగులు ఊయలలోనే కనుపిస్తాయి అనిఅంటారు. హనుమాన్ బాల్యాన్నుంచే తనపరాక్రమాన్ని చూపసాగారు. ముగ్గురు మహాబలవంతులైన తండ్రులను కల్గినప్పుడు ఎందుకుచూపరు? ఆయన రుద్రుని అవతారము. దేవతలందరికి పరమ ప్రియుడు, శౌర్య పరాక్రమాల్లో అద్వితీయుడు, సేవచేయుటకే జన్మించారు. కాబట్టి ఆయన చరిత్ర అద్భుతంగానే వుండివుండాలి.

హనుమంతునిచెవులకి విద్యుత్సదృశకాంచనకుండలాలు పుటుకతోనే వున్నాయి. వారు మాతృగర్భాన్నుంచే చెవులకు కుండలాలను, మణిమండిత శిరస్త్రాణాన్ని, కౌపీనాన్ని, చేతిలో

---

* ఎవరు అంజనీ పుత్రులో, ఎవరి ముఖారవిందము ఎర్రగావుందో, సువర్ణశైలము మాదిరి కమనీయ విగ్రహం ఎవరికి వున్నదో, పారిజాత తరుమూలమున ఎవరు నివసించుతారో, అట్టి పవనకుమారుడగు హనుమంతుని నేను ధ్యానిస్తున్నాను.

వజాగ్నిన్నీ తీసుకొని నడుముకు ముంజామేఖలాన్నీ, సువర్ణ యజ్ఞోపవీతాన్నీ ధరించి జన్మించారు. వీరి రూపసౌందర్యం చూడ ముచ్చటగావుంది. బాల్యంలో వీరిని అందరూ ప్రేమించే వారు. తల్లిగారు వీరిని ఎంతో గారాబంగా పెంచారు.

ఒకరోజున అంజనా ఈయనను ఊయలలో పరుండ పెట్టి పూలను ఫలాలను తీసికొనిరావడానికి అడవికివెళ్ళింది. ఈయనకు ఆకలివేసింది. నాలుగువైపులా తినడానికి ఏమైనా దొరుకుతుందేమోనని చూశాడు. ఎక్కడా ఏమీ కనుపించలేదు. అదే సమయంలో సూర్యుడు తనబాలారుణ కిరణాలను ప్రసరింపజేస్తూ తూర్పున ఉదయిస్తున్నాడు, ఏదో ఎర్రని పండు మెరుస్తున్నట్లు భావించి దీనినితిని ఆకలితీర్చుకుందా మనుకున్నాడు. వాయుపుత్రుడుగదా, ఎలుకపిల్లలకు బిలాన్ని త్రవ్వడం ఎవరూ నేర్పనక్కర్లేదు. అవే నేర్చుకుంటాయి. లేడిపిల్లలకు పరుగుతీయడం ఎవరూ నేర్పరు. అవి తల్లి గర్భాన్నుంచి పుట్టగానే పరుగిడుతాయి.

ఈమాదిరిగానే పవనపుత్రుడవడంచేత ప్రయాస లేకుండానే ఈయన తనకితానే ఆకాశంలో ఎగురసాగాడు. ఆసమయంలో కపీశ్వరుడగు కేశరిగూడా లేడు. అంజనాగూడా లేదు. అంతటా వ్యాపించివున్న తండ్రిపవనదేవుడే ఈయనను చూస్తున్నాడు. తనపుత్రుణ్ణి ఆకాశంలో సూర్యునివైపువెళ్ళడం చూసి వాయుదేవుడు మెల్లగా శీతలసుగంధాన్ని వెదజల్లుతూ ఆయనవెనుక పయనిస్తున్నాడు. ఆరోజు అమావాస్య.

సూర్యగ్రహణం పట్టనున్నది. రాహువు సూర్యుణ్ణి మిగ్రింగడానికివచ్చాడు. హనుమాన్ సూర్యుని దగ్గరకు చేరాడు. రాహువు సూర్యుణ్ణి మిగ్రింగుదామనుకుంటున్నాడు. హనుమాన్ ఎవడో బాలకుడు ఆపండునుతినడానికివెళ్ళుతున్నాడనుకున్నాడు. రాహువుని తనతోకకి గట్టిగాచుట్టి ఫెళ్లుమని ఒక్క-దెబ్బ కొట్టేసరికి రాహువుకి మతిపోయి ఇంద్రునిదగ్గరకు వెళ్ళి రక్షించమని వేడుకున్నాడు. ఇంతటి బలవంతుడువవడు వచ్చాడాఅని దేవరాజు అనుకొని ఐరావతంపైన సూర్యుని దగ్గరకు చేరాడు. ఇందుృడు హనుమంతుణ్ణి యుద్ధానికి రమ్మనమన్నాడు ఈయన తయారుగానేవున్నాడు. ఇరువురి మధ్య గొప్పయుద్ధంజరిగింది. హనుమాన్ ఐరావతాన్ని తన తోకకుచుట్టి లాగి ఒక్కదెబ్బ కొట్టేసరికి ఇందుృడు ఒకచోటకి ఐరావతం మరియొకచోటకి వెళ్ళిపడ్డారు. ఈయనఐరావతాన్ని లేవదీయడానికివెళ్ళేసరికి ఇందుృడుఈయనగడ్డాన్ని (హను) వజ్రంతోకొట్టగా ఎడమవైపు గడ్డంలోనిఎముక విరిగిపోయింది. వెంటనే మూర్ఛితుడై ఈయన భూమిమీద పడిపోయినాడు.

తనపుతృడు మూర్ఛనొందడంచూచి వాయుదేవుడు పుతృశోకంచేత విలపిస్తున్నాడు. ఆయనకు ఇంద్రునిపైన కోపంవచ్చి తనవేగాన్ని తగ్గించాడు. అప్పుడు ముల్లోకాలలో సకలప్రాణుల పాృణ, అపానాలు ఆగిపోయాయి. దేవతలందరూ గాబరాచెంది పరుగు–పరుగున బృహ్మగారిదగ్గరకు చేరారు. వెంటనే బృహ్మ విష్ణువు, శివుడు, సకలదేవతలు

కలసి హనుమ స్పృహకోల్పోయి పడివున్నచోటుకి వచ్చారు. అక్కడ వాయుదేవుడు విలపిస్తూవున్నాడు.

వాయుదేవా! ఎందుకు విలపిస్తున్నావు? అని బ్రహ్మ గారు అడిగారు.

అయ్యా, ఏడవకపోతే ఏంచేయమంటారు? ఈప్రపంచంలో పుత్రుడు అందరికి ప్రియుడని: పుత్రశోకం దుర్భరమని చెప్పనే చెప్పారుగదా. ఇంద్రుడు నాపుత్రుణ్ణి చంపాడు. ఇతనిగడ్డం విరిగిపోయింది. అని వాయువు అన్నాడు.

విష్ణువు- ఏమయ్యా. నీవెందుకు ఇంతగా గాబరా చెందుతావు. ఇతనుచనిపోలేదు స్పృహకోల్పోయాడు. నేను ఇతన్ని వెంటనే బ్రతికిస్తాను, అని విష్ణువు హనుమను వడిలోకి తీసుకొని తనచేతితో నిమిరేసరికి హనుమకు తెలివి వచ్చింది.

అప్పుడు బ్రహ్మగారు వాయుదేవునితో ఇలాఅన్నారు, సోదరా। ముల్లోకాల్లో జీవులు వ్యాకులత చెందివున్నారు. నీవు నీగమనాన్ని తగ్గించావు. తిరిగి నీవు మామూలుగా సంచరించి ముల్లోకాలకు సుఖాన్ని కలుగజేయి.

వాయుదేవుడు— అయితేమీరంతా నాపుత్రుణ్ణి అజరామరునిగా సర్వత్రా విజయునిగా, బలవంతునిగా వుండునట్లు

ఆశీర్వదించండి. నేను మీరుచెప్పినట్లు చేస్తాను, అని అన్నాడు.

ఇక దేవతలంతా వరుసగా హనుమను ఆశీర్వదించారు.

విష్ణువు- వాయుదేవా! నీకుమారుడు అందరికి ప్రియుడవుతాడు. చతుర్దశ భువనాలలో ఇతనిని ఎవరూ చంపలేరు, అని ఆశీర్వదించారు.

శివుడు - ముల్లోకాల్లో ఇతనికి ఎవరూ సంతాపాన్ని కలుగజేయలేరు. నేను నాత్రిశూలాన్ని ఇస్తున్నాను. ఇతడు దీని రహస్యముల నన్నిటినీ తెలుసుకొంటాడు, అని అన్నాడు.

బ్రహ్మ - ఇతనికి నా శాపంగూడా తగులదు. ఏ అస్త్రశస్త్రీలు గూడా ఇతని అవయువాలను ఛేదించజాలవు, అని అన్నారు. ఇంద్రుడు - నావజ్రించేత ఇతని గడ్డం విరిగింది గనుక ఇతని పేరు "హనుమాన్" అవుతుంది. నా వజ్రాన్ని మించి ఇతని శరీరం బలంగా వుంటుంది, అని అన్నాడు.

కుబేరుడు - "యక్షరాక్షసులు గూడా ఇతన్ని పరాజితుణ్ణి చేయజాలరన్నాడు.

వరుణుడు - ఇతను యుద్ధంలో సదా అజేయుడుగానూ యశస్వీగానూ వుంటాడు - అని అన్నాడు.

యమధర్మరాజు - మాకాలదండం ఇతన్ని ఎప్పుడూ

బాధించదు. ఇతని నామాన్ని యుద్ధంలో స్మరించువారికి కాలదండం వలన భయముండదు.

ఈవిధంగా దేవతలందరూ ఈయనకు గొప్పవరాలను ప్రసాదించారు. ఈయన గనుకనేమిక్కిలి బలవంతుడైనాడు. ఇతనినితనజాగాలో పరుండబెట్టి వాయుదేవుడు వెళ్ళి మామూలుగావీచనారంభించాడు. లోకాలన్నిటికి తిరిగి సుఖంకలిగింది కొద్దినిముషాలకి అంజనాతిరిగివచ్చింది. పుత్రుణ్ణి సంతోషంగా ఆడుకొంటూ ఉండడంచూసి ఎంతగానో మురిసిపోయింది. మాతృ స్నేహానికి తనస్తనములనుంచి వస్తున్న పాలను యిచ్చింది. తల్లిపాలు తాగి ఈయన ఇంకా బలవంతుడైనాడు. కొద్దికాలానికి పెరిగి పెద్దవాడై చదువుకొనడానికి యోగ్యుడైనాడు.

ఈయన స్వయంగా ప్రజ్ఞకలవాడే అయినా సూర్యుని దగ్గరకువెల్లి అనతికాలంలోనే సకల శాస్త్రాలను అభ్యసించి ప్రకాండపండితుడు, మహాబలశాలి, రణవిజయీ, అజరామరుడు, సర్వగుణసంపన్నుడూ అయ్యాడు. అయినా వానరచాపల్యం ఎక్కడికి పోతుంది. స్వభావం దురతిక్రమమైనది. జీవులు తమ స్వభావానికి వివశులౌతారు. ఈయన ఋషులను, మునులను కష్టపెట్టనారంభించాడు. ఒకప్పుడు ఎవరిజడ మీదనో ఎక్కికూర్చుండేవాడు. మరిఒకప్పుడు ఇంకొకరి గడ్డాన్ని లాగేవాడు. ఒకప్పుడు ఒకరి మృగచర్మాన్ని

కప్పుకొని పారిపోతే మరికప్పుడు ఒకరికమండలంలోని నీటిని త్రాగేసేవాడు. ఇలాచేస్తూంటే మహర్షులు- తనబల పరాక్రమాలను మరచివుండుగాక అని ఇతన్ని శపించారు. అయితే ఎవరైనా ఇతనికి తనబలపరాక్రమాన్ని గుర్తుచేస్తే వెంటనే జ్ఞాపకం వస్తుందని అన్నారు.

ఈకారణంగా మహర్షులశాపంచేత ఈయనతనఅతులిత బలపరాక్రమాలను మరచిపోయి మిక్కిలి సరళస్వభావం కల్గిన కోతిగా మారిపోయినాడు. తరువాత ఇతని బుద్ధి కౌశలాన్ని చూసి వానరరాజైన సుగ్రీవుడు తనమంత్రిగా చేసుకున్నాడు. సుగ్రీవుడు ఇతని సలహా లేనిదే ఏపనీ చేశేవాడుకాదు. ఋక్షరాజుకి వాలి, సుగ్రీవులు ఇరువురు కుమారులు. ఇరువురి ఆకారము, ప్రకారము, రూపము, రంగు లేవడమూ, కూర్చొనడమూ, మాట్లాడుట, నడచుట అన్నీ ఒకేమారిదిగా వున్నాయి. ఇరువురిమధ్యా మిక్కిలి స్నేహం వుండేది. ఇరువురు సమానంగా తండ్రిరాజ్యాన్నిఅనుభ విస్తున్నారు. తండ్రి పరలోకానికి వెళ్ళాక వాలి రాజైనాడు. సుగ్రీవుడు అన్నపట్ల మిక్కిలిస్నేహం కలిగివుండడంచేత వారిలో ఏవిధంగానూ భేదభావం కలుగలేదు.

ఒకనాడు దుందుభి అనెడి అసురుడు వారితో పోరాడ టానికి వచ్చాడు, వాలి మిక్కిలి వీరాభిమాని. వెంటనే యుద్ధానికి వెళ్ళాడు. అతను ఒకగుహలోకి ప్రవేశించాడు. వాలిగూడా అతనివెంట వెళుతూ తానుతిరిగి వచ్చేంతవరకు

అక్కడే కూర్చొని ఉండమని సుగ్రీవునితో చెప్పివెళ్ళాడు.

చాలాకాలం యుద్ధం జరిగింది. చివరికి వాలి యుద్ధంలో ఆ అసురుణ్ణి చంపివేశాడు. గుహనుంచి రక్తం వెలుపలికి ప్రవహించింది. సుగ్రీవుడు అసురుడు నా అన్నను చంపివుంటాడు, బయటకు వచ్చి నన్నుగూడా ఎక్కడ చంపుతాడో, అని అనుకొని ఒక పెద్దరాతిని తీసుకొని వచ్చి గుహయొక్క ముఖాన్ని మూసివేసి తన రాజధానికి తిరిగివచ్చి హనుమాన్ మొదలగు మంత్రుల సలహాపైన రాజైనాడు. కొంత కాలానికి వాలి తిరిగివచ్చాడు. రాజ సింహాసనంపైన సుగ్రీవుని చూసి కోపగించి అతన్ని కొట్టి గూడా రాజ్యంనుంచి బహిష్కరించాడు. స్వామిభక్తుడైన హనుమాన్ సుగ్రీవుని వెంట అడవుల్లో తిరుగుతూవున్నాడు.



# మంత్రి హనుమాన్

# 5

సుగ్రీవ సచివాయచ కపి శ్రేష్ఠాయ మంత్రిణే
స్వామిభక్తాయ శాంతాయ హనుమంతాయ నమోనమః॥ *

స్వామి సుఖాన్ని తన సుఖంగా, స్వామిదుఃఖాన్ని తనదుఃఖంగా భావించడమే నిజమైన స్వామిభక్తుని లక్షణం. సుఖసమయంలో సంతోషంగావుండి దుఃఖం ప్రాప్తించగానే స్వామిని వదలి వెళ్లువారు నిజమైన సేవకులుగారు. అట్టివారు తమస్వార్థసిద్ధికొరకు సేవకులయ్యారన్నమాట, తమస్వార్థం సిద్ధించగానేవదలి వెళ్ళిపోతారు. కాని మనచరిత్ర నాయకుడైన వీరహనుమాన్ తనను నిజమైన సేవకునిగా నిరూపించుకున్నారు. వారుగూడా స్వాములే, కాని ఎప్పుడు, ఎలా అభినయించినా దాన్ని యధావిధిగా నెరవేర్చుతారు.

కపిరాజైన కేశరీ కపులకు యూధపతి. వారందరూ ఋక్షరాజకపి పరిపాలనలో వుండేవారు. ఋక్షరాజు తన పుత్రులైనవాలి, సుగ్రీవులకు రాజ్యమును అప్పగించి పరమపదించాకజ్యేష్ఠుడు శ్రేష్ఠుడుఅవడంచేత వాలికిష్కింధకు రాజైన సుగ్రీవుణ్ణి విశేషంగా ప్రేమిస్తూనే వున్నాడు.

---

* ఎవరు సుగ్రీవునకు సచివులో మంత్రియో, స్వామి భక్తులో శాంత స్వభావులో, అట్టిహనుమంతునకు మాటిమాటికి నమస్కరిస్తాను

హనుమాన్ సుగ్రీవునకు మంత్రి అయినాడు. ఇరువురి సోదరుల మధ్యరాజ్యాన్ని గురించి కలహమేర్పడగా వాలి సుగ్రీవుణ్ణి కొట్టి రాజ్యంనుంచి బహిష్కరించి అతని భార్య రుమని తన భార్యగా చేసుకున్నాడు. సుగ్రీవుడు అన్న భయంచేత కనుపించకుండా అడవులలో తిరుగుతూవుండేవాడు నిజమైన సేవకునిమాదిరి హనుమాన్ ఆయనవెంట ఎల్లప్పుడూ వుండేవాడు. వాలి ఎక్కడవచ్చి కొట్టి చంపుతాడో అనే భయం సుగ్రీవునకు వుంటూనేవుండేది. అందుకుగాను ఋష్యమూక పర్వతంపైననివా సమేర్పరచుకొనివుంటున్నాడు. అక్కడకు వాలి వచ్చిన యెడల మతంగముని శాపకారణంగా చనిపోతాడు. అక్కడకు వాలిరాడు. శాపరూపకవచం వుండడంచేత సుగ్రీవుడు తన మంత్రితోనూ, అనుచరులతోనూ కలసి సుఖంగా వుంటున్నాడు.

కైకేయివరాలకి శ్రీరాముడు సీతాలక్ష్మణులతో కలసి అడవికి వచ్చాడు. చిత్రకూటంలోనూ, దండకారణ్యంలో చాలామందిమహర్షుల ఆశ్రమాల్లో శ్రీరాముడు 13సంవత్సరాలు తిరుగుతూనేవున్నాడు. పదునాల్గవ సంవత్సరంలో వారు పంచవటి దగ్గర పర్ణకుటీరాన్ని ఎర్పరచుకొని సుఖంగావుంటూ సీత మనోరథాన్ని సిద్ధిపంచేస్తూవున్నారు. రావణుడు పంపగా మారీచుడు బంగారు లేడిరూపాన్ని ధరించి పర్ణకుటీరానికి నాలుగువైపులా తిరుగుతూవున్నాడు. జానకి ఆలేడినిచూసి తనకు కావాలని శ్రీరామునితో అన్నది. రాముడు ఆలేడి

కొరకు వెళ్ళాడు. వెంటనే రావణుడువచ్చి సీతను తీసుకొనివెళ్ళి లంకలోని అశోకవాటికలో ఆమెనువుంచాడు.

శ్రీరాముడు లక్ష్మణునితో సీతనువెదకుతూ శబరి ఆశ్రమానికి వచ్చాడు. పంపాసరోవరం దగ్గర ఋష్యమూక పర్వతంపైన కపిరాజైన సుగ్రీవుడు తనమంత్రులతో కలసి వుంటున్నాడు. మీరువెళ్ళి ఆయనను స్నేహితునిగాచేసుకుంటే సీతామాత అన్వేషణ కార్యక్రమాలలో వారు సహకరిస్తారని శబరి శ్రీరామునకు తెలియజేసింది. శ్రీరాముడు ఋష్యమూక పర్వతంవైపు ప్రయాణమైనాడు. వాలిస్వయంగా రాక పోయినా ఎవరినైనా పంపుతాడేమో అని భయపడుతూ వుండేవాడు. మునులవేషంలో రామలక్ష్మణులను ధనుర్బాణా లను ధరించి తనవైపు రావడంచూచి సుగ్రీవుడు మిక్కిలి గాబరాచెందాడు. అతడు. బుద్ధిమంతులలో అగ్రగణ్యుడైన హనుమంతుని ఆకపటవేషధారులెవరో తెలుసుకొని రమ్మన మని పంపాడు.

సుగ్రీవునిఅనుమతితో హనుమాన్ బ్రహ్మచారిరూపాన్ని ధరించి శ్రీరామునిదగ్గరకువెళ్ళి వారి పరిచయాన్ని అడుగగా శ్రీరాముడు లక్ష్మణునితో- లక్ష్మణా! ఇతను గొప్పబుద్ధిమంతు డుగా, గుణవంతుడుగా, శీలసంపన్నుడుగా కనుపిస్తున్నాడు. సకలశాస్త్రాలను చదివినవాడులాగా ఇతని మాటలనుబట్టి తెలుస్తున్నది. మనతో మాట్లాడుతున్నప్పటినుంచీ చూస్తే

న్నాను. ఒక్కశబ్దంకూడా తప్పుగా మాట్లాడలేదు, దీన్నిబట్టి ఇతను వ్యాకరణశాస్త్రంలో గొప్పవాడు పండితుడని స్పష్టమవుతున్నది. ఇతను ఎవరికో మంత్రిలాగా వున్నాడు. స్వామి అయివుంటే నేనే మాట్లాడుదును. మంత్రి గనుక నీవే ఇతనితో మాట్లాడుము.

లక్ష్మణుడు - విప్రోత్తమా! మేము దశరథ మహారాజు పుత్రులం. వీరు నాజ్యేష్ఠ సోదరులైన శ్రీరామచంద్రమూర్తి. వీరు తమ ధర్మపత్ని సీతాదేవి వెంటవచ్చారు. ఎవరో ఆమెను అపహరించుకొని తీసుకొని వెళ్లారు. ప్రస్తుతం మేము ఇరువురం ఆమెనుఅన్వేషించేనిమిత్తం సహాయాన్ని అర్థించడానికి కపిరాజైన సుగ్రీవునిదగ్గరకు వెళ్లుతున్నాం. దయయుంచి మాకు సుగ్రీవునిజాడ తెలియచేస్తారా?

శ్రీరాములవారని తెలియగానే హనుమాన్ తన నిజ వేషాన్ని ధరించి ప్రభువు పాదాలపైన పడ్డాడు. వెంటనే ప్రభువు అతన్నిలేవనెత్తి కౌగలించుకొని సుగ్రీవుని క్షేమ సమాచారాన్ని అడిగితెలుసుకొని- సుగ్రీవుడు మాతో స్నేహం చేస్తాడా? మాప్రయత్నంలో సహకరిస్తాడా? అని అన్నారు.

హనుమాన్ సవినయంగా - ప్రభూ, దౌర్భాగ్యుడైన వాడే మీతో స్నేహం చేయాలనుకోడు. తమరు జీవులకు మిత్రులు, స్వాములు, దయచేయండి. తమను సుగ్రీవులవారి సమక్షమునకు తీసుకొనివెళ్లుతాను. ఈ సేవకుని సేవను స్వీకరించండి.

ఆక్షణంలోనే హనుమాన్ శరణాగత వత్సలుడైన శ్రీరామునకు ఆత్మార్పణగావించి నిజమైన సేవకుడై రామ లక్ష్మణులను తనభుజాలపై కూర్చుండబెట్టుకొని సుగ్రీవుని దగ్గరకు తీసుకొని వెళ్ళాడు.

మిత్రత్వం ఎప్పుడూ సమాన గుణవంతులమధ్య ఏర్పడుతుంది. నిజానికి స్వామిఎక్కడ? సేవకుడెక్కడ? జీవుడెక్కడ? బ్రహ్మఎక్కడ? అయినాగూడా పరమాత్మ జీవునకు నిజమైన స్నేహితుడే. ప్రస్తుతం ఆయన మానవరూపంలో నటన చేయుచున్నారు. సుగ్రీవునికి స్నేహితులవడానికి ఉత్సాహంగా వున్నారు. తనను ఆయనతో సమానంగానే నిరూపిస్తున్నారు. అయోధ్యలో రాముణి రాజ్యసింహాసనం నుంచి తొలగించునట్లుగానే యిక్కడ సుగ్రీవుడినిగూడా తొలగించడం జరిగింది. రాముడు తనసేవకుడైన లక్ష్మణుని వెంట వనవాసంలో వుంటున్నాడు. సుగ్రీవుడుగూడా తనకు మంత్రి సేవకుడు, స్నేహితుడైన హనుమతో కలసి వనంలో వుంటున్నాడు. వీరిభార్యను రావణుడు అపహరించి తీసుకుని వెళ్ళాడు. అటుసుగ్రీవుడు ఒకరిసహకారం కొరకు ఎదురు చూస్తున్నాడు. ఇటురాముడు తన నిజమైన స్నేహితుల అన్వేషణకై తిరుగుతున్నాడు. వీరిరువురిమధ్య మధ్యవర్తిగా వుండటానికే హనుమాన్అవతరించింది. హనుమాన్ జీవాత్మను పరమాత్మతో కలపడానికి ప్రయత్నిస్తాడు. దూరమైపోయిన శక్తిని శక్తివంతునితో కలుపుతాడు. తాను స్వయంగా

భార్యకు దూరంగావుండి దూరమైపోయినవారి భార్యను దగ్గరకు చేర్చడానికి ప్రయత్నిస్తాడు.

శ్రీరామ సుగ్రీవులమధ్య హనుమాన్ మధ్యవర్తిగా వ్యవహరించి అగ్నిని ప్రజ్వలింప జేయగా అగ్నిసాక్షిగా వారిరువురికి మైత్రి ఏర్పడింది. హనుమాన్ పుష్పములతీగను తీసుకొనిరాగా రాముడు దానిని సుగ్రీవుని మెడలోవేసి సుగ్రీవా! నీభార్యను, రాజ్యాన్ని నీకు ఇప్పిస్తాను. నీవుఅన్ని దిక్కులకు దూతలనుపంపి నాభార్యనువెదకించు అనిఅన్నాడు.

మాటఖరారైన తర్వాత శ్రీరాముడు వాలిని చంపి సుగ్రీవునకు రాజ్యాన్ని, భార్యను, వాలిభార్య అయిన తారను ఇప్పించాడు. రాముడుఎల్లప్పుడూ చెప్పేదాన్ని కంటె అధికంగా గూడాఇస్తూవుంటాడు. కాని ఈజీవుడు తనప్రతిజను మరచి పోతూ వుంటాడు. రాజ్యాన్నిపొంది సుగ్రీవుడు ఐహిక సుఖాలలో మునిగి మరచిపోయినాడు. నాలుగుమాసాలు గిరిగుహలో వుండి శ్రీరాముడు చాతుర్మాస్యవ్రతం చేశాడు. కానిసుగ్రీవుడు ఒక్కనాడైనా ఆయన క్షేమసమాచారాన్ని తెలుసుకొనడానికి వెళ్ళలేదు. ఆయన విషయలోలుడైనాడు. కానిహనుమాన్ జాగరూకుడై వున్నాడు. విషయవాసనలపట్ల ఎల్లప్పుడూ విరక్తుడే. విషయవాసనలకు దూరంగావుండువారే ప్రభువుని పొందగలుగుతారు. రాముడు వున్నచోట విషయ వాసనలుండవు. విషయవాసనలుండేచోట రాముడు వుండడు. హనుమాన్ సీతాన్వేషణగురించి ఆలోచిస్తూనేవుండేవాడు.

నాలుగుమాసాలు గడిచాక శ్రీరాముడు లక్ష్మణునితో–లక్ష్మణా! సుగ్రీవుడు తనమాటను నెరవేర్చలేదు. వాలి పయనించిన మార్గమూవున్నది. వాలిని చంపిన బాణమూ వున్నది, అని వెళ్ళి తెలియజేసిరమ్మనమన్నాడు.

లక్ష్మణుడు వెళ్ళి సుగ్రీవుని వెంటబెట్టకొని తీసుకొని వచ్చాడు. సుగ్రీవుడు తనతప్పును మన్నించమని శ్రీరాముణ్ణి వేడుకున్నాడు. హనుమాన్ తనవిధానాన్నంతా వినిపించాడు. శ్రీరాముడు హనుమంతుని జాగరూకతకు మిక్కిలి సంతసించి ఇతను సీతజాడ తెలుసుకొనిరాగలడని నిశ్చయించుకున్నాడు. ఇతరదిక్కులకు ఇతర వానరులను పంపగా దక్షిణదిక్కున ఎక్కడ సీతవుండి వుంటుంది, అని అనుమానం కలిగిందో ఆ వైపుకి చాలామంది వానరులవెంట హనుమంతుణ్ణి పంపాడు. ఆదళానికి నాయకునిగా వాలితనయుడైన అంగదుణ్ణి నియమించాడు, కాని నిజానికి ఆదళానికి నాయకుడు హనుమంతుడే. ఈకారణంగానే శ్రీరాముడు రహస్యంగా తన నామాంకితముద్రికను సీతకు విశ్వాసపాత్రుడు కాగలందులకు ఆయనకు ఇచ్చాడు. అంగదుడు, జాంబవంతుడు, హనుమాన్ మొదలగు వానరులంతా సీతాన్వేషణనిమిత్తం దక్షిణసముద్రపు ఒడ్డుకి చేరారు. ఎంతప్రయత్నించినా సీతజాడ తెలియలేదు. అందరూ మిక్కిలి దుఃఖించి ఇక్కడే నిరాహారవ్రతం చేసి ప్రాణాలను పరిత్యజించుదామని ఏమైనాసరే కిష్కింధకు తిరిగి వెళ్ళరాదని నిశ్చయించుకున్నారు. అందరూ తినుట,

తా్రిగుట మానేసి అక్కడే కాలం గడుపుతున్నారు. రోజులు గడిచినకొద్దీ దుర్బలులై పోతున్నారు అక్కడే ఒక చెట్టుపైన జటాయువుసోదరుడు, గ్రిద్దరాజు సంపాతి కూర్చొనివున్నాడు. అతను వీరందరిని తిని తన ఆకలిని తీర్చుకుందామని అనుకున్నాడు. అతన్నిచూచి ఒకవానరుడు అన్నాడు. సోదరా! చూడు, శ్రీరామునికార్యం నెరవేరనేలేదు. సీతజాడ తెలియనేలేదు. దుర్బలులమని భావించి ఆగద్ద మనలను తినడానికివస్తున్నది. జటాయువుగూడా గద్దేకదా. శ్రీరాముని కార్యనిమిత్తం తాను తన పా్రిణాలనే పరిత్యజించింది.

జటాయువు మరణవార్త విని వులిక్కిపడి సంపాతి- మీరుఎవరు? నాసోదరుడగు జటాయువుని స్మరించుతున్నారు. అయితే నాసోదరుడు మరణించాడా? మీరు శ్రీరాముని ఏకార్య నిమిత్తం ఇక్కడ కూర్చొనివున్నారు? అని అడిగాడు.

సమాచారాన్నంతా విని సంపాతి- నాదృష్టి చాలా తీవ్రమయింది. సీతనుతీసుకొని వెళుతున్న రావణునిచూశాను. ఇప్పుడుగూడా లంకలో ఒకవాటికలో సీత కూర్చొనివున్నట్లు చూస్తున్నాను. మీలో శతయోజన సముద్రాన్ని దాటివెళ్ళే సామర్థ్యంగల వ్యక్తి సీతజాడను తెలుసుకొనిరాగలడు, అని సమాధానమిచ్చాడు.

వానరులందరు తమతమ బలాన్ని గురించి చెప్ప సాగారు. కొందరు పదియోజనములు, కొందరు ఇరువది

యోజనములు, మరికొందరు ఏబదియోజనములు వెళ్ళగలమని అన్నారు. అంగదుడు- నేను నూరుయోజనములు వెళ్ళ గలను, కాని తిరిగి రాగలనని నమ్మకంలేదు. అనిఅన్నాడు.

ఈసంభాషణలనన్నింటినీ వింటూ హనుమాన్‌మౌనంగా తనకు ఏమీతెలియనట్లుగా కూర్చొనివున్నాడు. ఇతనికి తన బలపరాక్రమాన్ని గురించి తెలియజేయునంతవరకు తన బలాన్ని మరచివుంటాడని మహర్షులు శపించారుగదా. అందు కేఇతను సుగ్రీవునివెంట పిరికివానిలాగా తోకముడుచు కొని తిరుగుతూ వుంటాడు. ఈరహస్యం జాంబవంతుడికి తెలిసి హనుమాన్। నీవుమౌనంగా ఎందుకుకూర్చుండిపోయావు? సోదరా! నీవు వాయుపుత్రుడవు. గరుత్మంతునికంటె గూడా శక్తిశాలివి. ఈ శతయోజన సముద్రాన్ని గరుత్మంతుడు, నీతండ్రి వాయువు, నీవు మాత్రమే దాటగలరు. నీవు నీ పరాక్రమాన్ని విస్మరించి ఎందుకు కూర్చొనివున్నావు? హనుమా! నీశరీరం వజ్రశరీరం. నీవు చేయాలని అనుకుంటే దేన్నైనా చేయగలవు. నీవు రుద్రుని అవతారుడవు. నీవు అంజనాపాలను త్రాగావు. నీవు మహావీరుడవు. వజ్రధారివి. దేవతలతోసహా ముల్లోకాలను జయించేశక్తి నీకువుంది.

ఇంకేముంది హనుమంతునకు తనశక్తి జ్ఞాపకానికి వచ్చింది. తొడలుకొట్టి లేచి నిలబడి తనశక్తిని గొప్పగా చెప్పుకుంటూ- జాంబవాన్‌తాతా, మీరేమిటి అంటున్నది?

నాచేత ఏమిపని చేయించాలని అనుకుంటున్నారు? అన్నాడు. జాంబవంతుడు నిద్రిస్తున్న సింహం మేల్కొన్నది అని భావించి హనుమా। సీత జాడను నీవే తెలుసుకొనిరావాలి, లంకకి నీవే వెళ్ళాలి. అని అన్నాడు.

అయితే సరే, ఒక్కసారి గర్జించి నేను వెళ్ళుతాను, అని అన్నాడు.



## శ్రీ హనుమాన్ - స్తుతి

హనుమానంజనీ సూనుః వాయుపుత్రో మహాబలః
రామేష్టః ఫాల్గున సఖః పింగాక్షో మితవిక్రమః॥
ఉదధి క్రమణ శ్చైవ సీతాశోకవినాశకః।
లక్ష్మణ ప్రాణదాతాచ దశగ్రీవస్య దర్పహా॥
ఏతానిద్వాదశనామానికపీంద్రస్య మహాత్మనః।
స్వాపకాలేప్రబోధేచయాత్రాకాలేచయః పఠేత్॥
తస్యసర్వ భయంనాస్తి రణేచ విజయీభవేత్।
రాజద్వారే గహ్వరేచ భయంనాస్తి కదాచన॥

# బ్రహ్మచారి హనుమాన్

# 6

అంజనీ గర్భసంభూతో వాయుపుత్రో మహాబలః।
కుమారో బ్రహ్మచారీచ హనుమంతాయనమోనమః॥

ప్రపంచంలో బ్రహ్మచర్యానికి మించిన శక్తి మరొకటి లేదు. దీనివలన మానవుడు ఎంతటి గొప్పకార్యాన్నైనా సాధించగలడు. నిజమైన బ్రహ్మచారికి ఏవిషయం అసాధ్యం కాదు. మానవుని శక్తి ఇంద్రియసుఖాలలో వ్యయమయి నప్పుడు అతడు జగత్తుకి అతీతుడు కాజాలడు. హనుమాన్ బ్రహ్మచార్లల్లో అగ్రగణ్యుడు. ఆయన తన బ్రహ్మచర్యదీక్ష శమ, దమ, త్యాగ, తితిక్ష, ప్రజ్ఞ, విలక్షణబుద్ధికౌశలంచేత శ్రీరాముని వశపరచుకున్నాడు. సీతాన్వేషణ సమయంలో ఆయన చూపిన బుద్ధికుశలతకి శ్రీరాముడు మిక్కిలి ప్రభావితుడై సర్వకాలాలకి హనుమంతునకు అనుకూలుడై— హనుమా! నేను నీఋణాన్నుంచి ఎన్నటికీ విముక్తుడను కాజాలను. నేను నీకు ఎల్లప్పుడూ ఋణపడే వుంటాను అని అన్నాడు.

---

* అంజనీ గర్భాన్నుంచి జన్మించిన, వాయుదేవునకు ప్రియుడైన పుత్రుడు, మహాబలవంతుడు, బ్రహ్మచారి అగు హనుమంతునకు నమస్కరిస్తున్నాను,

సరే, ఋక్షరాజైన జాంబవంతుడు గుర్తుచేయగానే హనుమాన్ తనశక్తి సామర్థ్యాన్ని తెలుసుకొని- మీరు ఏమి చేయమంటే అదిచేస్తాను. ఈశతయోజన సముద్రం దాటి వెళ్ళడం గొప్పవిషయం ఏమీకాదు. నేను ఇలాంటి వందలాది సముద్రాలను దాటగలను, రావణునిమాట అలావుంచండి. అతని లంకను పెళ్ళగించి సముద్రంలో ముంచగలను. రావణుని పట్టుకొని దోమమాదిరి నలిపేస్తాను. మీరుతీసుకొని రమ్మంటే-లంకనే ఇక్కడకు తీసుకొనివస్తాను. మీరుగనుక "ఊ" అంటే లంకను, పుత్రపౌత్రులతో కలసివున్న రావణ కుటుంబాన్ని శ్రీరాముని పాదాలముందు వుంచుతాను.

హనుమాన్ అవసరాన్ని మించి ఉత్తేజితుడవుతున్నాడని భావించి జాంబవంతుడు అతనికి నచ్చచెబుతూ హనుమా! చూడు మనం శ్రీరాముని దూతలం. దూతలు ఎల్లప్పుడూ తమ పరిధిలోనే వుండాలి. దూతలకు యుద్ధం నిషేధించబడింది. దూత యుద్ధం చేయరాదు. దూతమాటను రాజులు పెద్దగాభావించరు. అతన్ని దండించనూగూడదు. ఎందుకంటె దూత తనస్వామి అభిప్రాయాన్ని మాత్రమే వెలిబుచ్చుతాడు. ఇందుచేత నీవు రావణుని చంపవద్దు. లంకను తీసుకొని రావద్దు. దేనినీ బద్దలుకొట్టవద్దు. అక్కడ ఏవిధమైన ఉపద్రవంచేయక సీతమ్మజాడ తెలుసుకుని రావలసినది. సీతమ్మజాడ తెలిశాక శ్రీరాములవారు స్వయంగా సైన్య సమేతుడై వెళ్ళి తన ప్రియురాలిని కలుసుకుంటారు. ఇలా

చేయడమే వారి కీర్తిప్రతిష్ఠలకు తగినట్లుగా వుంటుంది. నీవు ప్రస్తుతానికి శ్రీరామున్ని దూతగా మాత్రమే భావించుకొన వలసినది. నామాటను అర్థంచేసుకున్నావుగదా, అనిపలికాడు.

హనుమాన్— ఓ ముసలితాతా, మీమాటను అర్థంచేసు కున్నాను. నేను సీతమ్మజాడ తెలుసుకొని వెంటనే తిరిగి వస్తాను. అయితేనన్ను ఎవరైనాకొట్టితే ఆత్మరక్షణార్థంగూడా వారితో యుద్ధం చేయవద్దంటారా?

జాంబవంతుడునవ్వి— నాయనా హనుమా! ఆత్మరక్షణ తప్పనిసరిగా చేసుకొనవలసినదే కాని ఎవరితోనూ వ్యర్థంగా దెబ్బలాట పెట్టుకొనవద్దు, అని అన్నాడు.

హనుమాన్ – బాగుంది, చాలాబాగుంది. అయితే నాకు సెలవు, అని పెద్దవారికి నమస్కరించి, సమానవయస్సు వారిని కలుసుకుని, చిన్నవారి నమస్కారాలందుకొని ఒక్క దూకు దూకి ఒక పెద్దచెటుఎక్కి తనశరీరాన్ని పెంచసాగాడు. చూస్తూవుండగానే ఆయన పర్వతాకారుడైనాడు. ఆయన భారాన్ని సహించలేక ఆచెట్టుసముద్రంలో విరిగి పడిపో యింది. హనుమాన్ ఒక్కగెంతు గెంతి సముద్రంలోకి దూకాడు ఆయనతోపాటు వందలాది పూలకొమ్మలు సము ద్రంలో కొట్టుకుపోతున్నాయి. ఆకొమ్మలను తనగుండెతో చీల్చుకుంటూ కపిరాజు ముందుకు సాగిపోతున్నాడు. ఆయన సముద్రంలో ఈదుతున్నాడో లేక ఆకాశంలో ఎగురుతున్నాడో

ఏమీతెలియడంలేదు. ప్రజలంతా ఇలాంటి అద్భుత పౌరుషాన్నిచూసి ఆశ్చర్యచకితులై కన్నార్పకుండా ఆయన్ని చూస్తున్నారు. సముద్రంలోని జలజంతువులు భయభీతులై దాక్కున్నాయి. పక్షులుఆకాశంలో ఎగరడం మానేశాయి. హనుమాన్ విశ్రాంతిలేకుండా వాయువేగంతో సమానంగా సముద్రజలంపైన ఎగిరిపోతున్నాడు.

సముద్రంలో దాగివున్న హిమాలయ పుత్రుడైన మైనాకుడు– హనుమాన్, కొంచెం విశ్రమించి వెళ్లు, అన్నాడు.

హనుమాన్ అతనివైపు చూడకుండానేవెళ్తుతూ–మైనాక సోదరా! నీఅనుగ్రహానికి ధన్యవాదాలు. శ్రీరామునికార్యాన్ని సాధించనంతవరకు విశ్రమించను. త్వరగా అవతలి ఒడ్డుకు చేరాలి. సెలవు, అని అన్నాడు.

సర్పాలకుతల్లిఅయిన సురసను దేవతలు హనుమంతుని బుద్ధిని పరీక్షించమని పంపగా ఆమెవచ్చి– ఓయీ వానరుడా! ఆగు, ఆకలిగావుంది. దేవతలునిన్ను నాకు ఆహారంగా పంపారు, అని అన్నది.

అమ్మా! నేను చాలా తొందరలో వున్నాను. తిరిగి వచ్చాక నన్ను తిందువుగాని, అని హనుమాన్ అన్నాడు.

సురస – మాటలు కట్టిపెట్టు, నీవుచాలా ఆరోగ్యవంతుడవు. బ్రహ్మచారివి, బలవంతుడివి. నిన్నుభుజించి సంతసించుతాను, అని అన్నది.

హనుమాన్- అయితే నోరుతెరు-అని అన్నాడు. ఆమె నోరుతెరచింది. ఈయన దానికంటె రెండురెట్లు పెరిగాడు. ఈవిధంగా రెండేసిరెట్లు పెంచుకుంటూ తనముఖాన్ని ఆమె శతయోజనాల వెడల్పుగాచేయగా హనుమాన్ చిన్నరూపాన్ని ధరించి ఆమెముఖంలో ప్రవేశించాడు. ఆమెకు ఒకవిధంగా పుత్రుడైనాడు. ఆమెకు నమస్కరించి అమ్మా! నీగర్భంలోకి వెళ్ళాను. నాకు సెలవు, అని అన్నాడు.

సురస ఇతని బుద్ధికౌశలాన్నిచూసి మిక్కిలిసంతసించి ఎన్నోవిధాల ఆశీర్వదించి వెళ్ళిపోయింది. హనుమాన్ ముందుకుసాగి వెళ్ళాడు.

కొంతదూరంవెళ్ళేసరికి ఇంకొకఅంతరాయంఏర్పడింది. రాహువు తల్లి సింహిక సముద్రంలోవుండి ఆకాశంలో ఎగిరి వెళ్ళేవారి నీడనుచూసి వారిని ఆకర్షించి తింటూవుంటుంది. హనుమంతుని నీడను ఆకర్షించింది. ఆమె మోసాన్ని గుర్తించి హనుమాన్ గట్టిగా ఒక్కదెబ్బ కొట్టేసరికి ఆమె మరణించింది. సముద్రపు ఒడ్డుకి చేరి ఈ పర్వతాకార శరీరంతో లంకలో ప్రవేశించడం మంచిది కాదనుకొని అణిమాది సిద్ధులద్వారా చాలా చిన్న రూపాన్ని ధరించాడు హనుమాన్.

లంకకు అధిష్ఠాత్రిదేవిని, ఎల్లవేళలా లంకను రక్షించేది. ఏ అపరిచితవ్యక్తిని ప్రవేశించనివ్వనిది చాలాచిన్నరూపాన్ని ధరించిన హనుమానునిచూచి గర్జించి- ఎవరునీవు? దొంగ

మాదిరి నన్ను లెక్కచేయక లంకలో ప్రవేశిస్తున్నావు? ముందుకువెళ్ళకు, జాగ్రత్త. అడుగుపెట్టావా తినేస్తాను అని, గర్జించింది.

హనుమాన్ ఏమీ మాట్లాడక గట్టిగా ఒక్కదెబ్బ వేశేసరికి స్పృహకోల్పోయి ఆమె– ఓ కపిరాజా, నీవునిజంగా రామదూతవు. లంకకి వినాశనం దగ్గరకు వచ్చిందన్నమాట. బ్రహ్మగారు ముందుగానే కొతిదెబ్బకిస్పృహకోల్పోయినప్పుడు లంకకి వినాశం వచ్చినట్లు భావించమని చెప్పారు, నాయనా, నీవు నిశ్చింతగా లోనికివెళ్లు అనిఅన్నది.తదుపరి హనుమాన్ రాత్రివేళ లంకలోకి ప్రవేశించాడు.

రామ కార్యసాధక బ్రహ్మచారిని సాత్విక. రాజసిక, తామసికము అనెడి మూడు మాయలు ఆక్రమించుతాయి. అతనికి పలువిధాల దురాశలు ఎదురౌతాయి. వీనికి లోనైన వారు పతితులౌతారు. వీనిపై విజయాన్ని సాధించినవారు ముందుకి సాగిపోతారు. సాత్విక మాయకు నమస్కరించి మాతృభావనతో దాన్ని స్పర్శించి ముందుకు వెళ్ళాలి. తామస మాయ ఎదురైతే దాన్ని చంపి ముందుకు సాగిపో వాలి. రాజసమాయ ఎదురైనప్పుడు దాన్ని చంపక మూర్ఛనొందునట్లు చేసి ముందుకు వెళ్ళిపోవాలి. హనుమాన్ ఇదే చేశాడు.

హనుమాన్ మెల్లగా లంకలో సీతాన్వేషణ కార్య

క్రియాన్ని ప్రారంభించాడు. ముందుగా గురాల పావడిలో సీతాదేవిని చూశాడు, సీతమ్మ కానరాలేదు. తరువాత హస్తి శాల, గోశాల మొదలైనవి చూశాడు. ఆయన తనలో అనుకున్నాడు–ఎలాంటి పిచ్చివాడను నేను. స్త్రీని గోశాల లోనూ, గజశాలలోనూ, అశ్వశాలలోనూ వెదుకుతున్నాను. స్త్రీ స్త్రీలమధ్యనే వుంటుంది. రావణుని మహిషీశాలకు వెళ్లి చూస్తాను. అని రావణుని అంతఃపురానికి వెళ్ళి చూశాడు. బంగారంతో నిర్మించిన పాన్పుపైన ఆయన నిద్రిస్తున్నాడు. అతనికి సమీపంలో రంగు రంగుల తివాచీలపైన వేలకొలది స్త్రీలు నిద్రిస్తున్నారు. వారంతా ఎంతో అందంగా వున్నారు. కురూపులెవ్వరూలేరు. అందరూ మద్యాన్ని సేవించివున్నారు. నిద్రిస్తున్న సమయంలో కొందరి ముఖాలనుంచి చొంగ కారుతున్నది, కొందరి గుండెలమీదనుంచి వస్త్రంజారిపోయింది, కొందరు ఒగ్గరగా గురకలు పెడుతున్నారు, కొందరు వాగు తున్నారు, కొందరు స్వప్నాలుచూస్తున్నారు, ఒకతె తలగడను గట్టిగా కౌగలించుకొనివుంధి, ఇంకొకతె చేతులను వూపుతూ నృత్యం చేస్తున్నది, మరిఒకతె పాటపాడుతూ నిద్రపోయింది. ఆమె వక్షస్థలాన బాలుడు స్తన్యపానం చేస్తున్నట్లుగా వీణ పడివుంది, ఒకతె తాంబులాన్ని నములుతూ నిద్రపోతూంది, తాంబూలరసం ఆమె వస్త్రాలపైన కనిపిస్తున్నది. నిద్రిస్తున్న సమయంలో వారంతా అర్ధనగ్నంగా వున్నారు. వారి తల నీలాలు చిందర–వందరగా వున్నాయి. హనుమాన్ సీతమ్మను

ఇంతకుపూర్వం చూచివుండలేదు. ఇందుచేత ప్రతిఒక్క అందమైన స్త్రీనిచూచి ఆలోచించేవాడు. ఈమె సీతమ్మ కాదు గదా? తిరిగిఆమెకంటె అందమైనస్త్రీనిచూసి ఆమెను సీతమ్మగా భావించేవాడు. తరువాత వీరిలో సీతమ్మలేదు. సీతమ్మ రామునికిదూరమై ఇంతసుఖంగా నిద్రించనూలేదు, మద్యాన్ని సేవించనూలేదు, పాట పాడనూలేదు. అని నిశ్చయించు కున్నాడు. అక్కడ రావణుని ప్రక్కన మిక్కిలి అందంగానూ, గంభీరంగానూ వున్న ఒకస్త్రీనిచూచి అనుకున్నాడు – సీతమ్మ రాముని వియోగంలో ఇంత సంతోషంగానూ, ఇంతగా అలంకరించుకొని వుండలేదు. ఈమె రావణుని పతిభావంగా భావించి నిద్రపోతున్నది. బహుశ రావణునిభార్య కావచ్చు. అయితేసీతమ్మ ఏమైనట్లు? సంపాతి–నేను సీతమ్మను లంకలో కూర్చునివున్నట్లు చూస్తున్నానని చెప్పినమాట మిథ్యాకాదు గదా। చూడబోతే ఈలంక చాలా పెద్దదిగావుంది. అయినా తిరిగి వెదుకుతాను. అంతటా తిరిగి జాడతెలియక మరల రావణుని అంతఃపురానికి చేరాడు. ఈసారి అర్ధనగ్నంగా వున్న స్త్రీలను చూచేసరికి అసూయకలిగి– బ్రహ్మచారి స్త్రీల చిత్రాలనుగూడా చూడరాదుగదా, నేను అర్ధనగ్నంగావున్న స్త్రీలను చూశాను. తప్పు జరిగిపోయింది. దీనికి ఏంప్రాయ శ్చిత్తం చేసుకోను?

అయితే నేను స్త్రీలను చూడాలనే ఉద్దేశ్యంతో రాలేదు గదా, నేను సీతమ్మను వెదకడానికి వచ్చాను. సీతమ్మ స్త్రీల

మధ్య వుంటుందని భావించివచ్చాను. పురుషునకు తనఅంతఃకరణే సాక్షిగా వుంటుందంటారు. ఈస్త్రీలను చూచినా నా మనస్సుకి ఏవిధమైన వికారం కలుగలేదు. పాపపుణ్యాలకి భావనే ప్రధానంగావుంటుంది. నాభావన కలుషితంకానప్పుడు ప్రాయశ్చిత్తం చేసుకోవలసిన అవసరముందా? నేనుఇక్కడకు వచ్చినపని పూర్తికానేలేదు. సీతమ్మసమాచారం తెలియలేదు. నేను వెదకి తప్పక సీతమ్మజాడ తెలుసుకుంటాను. అని ఆలోచించి బాలబ్రహ్మచారి మారుతి అన్నిచోట్లా తిరిగి వెదకనారంభించాడు.



## సీతా రామనామ [illegible] ప్రియం హనుమాన్

సీతారామ పదాంబుజే మధుపవత్ యన్మానసం లీయతే
సీతారామ గుణావళీ నిశిదివా యజ్జిహ్వయాపీయతే।
సీతారామ విచిత్రరూపమనిశం యచ్చక్షుషోర్భూషణం
సీతారామ సునామ ధామనిరతం తంమారుతిం భజే।

# శ్రీ రా మ దూ త హ ను మా న్

## 7

మనోజవం మారుత తుల్యవేగమ్
జితేన్ద్రియం బుద్ధిమతాంవరిష్ఠమ్।
వాతాత్మజం వానరయూధ ముఖ్యం
శ్రీరామదూతం శిరసానమామి॥ *

సేవకుని ధర్మము మిక్కిలి కష్టసాధ్యమైనది. యోగి తన శరీరాన్ని స్థిరంగావుంచి మనస్సుపై విజయాన్ని సాధించ వలసి వుంటుంది. కాని సేవకుడైతే తన ఇంద్రియాలను, మనసుస్సుని,బుద్ధిని, స్వామి మనస్సుకి, బుద్ధికి, అనుకూలంగా చేయవలసి వుంటుంది. సేవకునకు తనదిఅంటూ ఏమీవుండదు. తనదిగా చేసుకొన డానికిగూడా ఏమీవుండదు. ఏకొంచెమున్నా అంతాస్వామిదే. అతనికి రాత్రింబవళ్లు స్వామిసుఖాన్ని గురించే చింతకలిగి వుంటుంది. ఇందు చేతునే సేవాధర్మాన్ని మిక్కిలి కష్టసాధ్యమని చెబుతారు.

ఇకపోతే, రావణుని అంతఃపురంలో హనుమంతునికి సీతకనుపించకపోయేసరికి మిక్కిలినిరాశచెందె ఆలోచించాడు.

---

* ఎవరి మనో వేగము వాయువుతో సమానమో, ఎవరు. జితేన్ద్రియులో, ఎవరు బుద్ధిమంతులలో శ్రేష్ఠులో, ఎవరు వాయుపుత్రులో వానరులలో అగ్రిగణ్యులో అట్టి శ్రీరామదూత అగు హనుమంతునికి నమస్కరిస్తాము.

"ఇంతగా కష్టపడి సముద్రాన్ని దాటి లంకకి వచ్చాను." ఏమీ సాధించలేకపోయాను. తిరిగి వెళ్ళనా. వెళ్ళినందున ప్రయోజనం ఏముంది? సుగ్రీవుడు ఇచ్చిన సమయంగడచి పోయింది. ఇపుడు వెళ్ళితే సుగ్రీవుడు చంపించేస్తాడు. సీతమ్మ కనుపించలేదని వింటే రాముడు ప్రాణాలను పరిత్యజిస్తాడు. రాముడు లేనప్పుడు లక్ష్మణుడుగూడా బ్రతికివుండడు. ఈవిషయాన్ని వినగానే భరత, శతృఘ్నులుగూడా ప్రాణాలను వదిలేస్తారు. తల్లులుగూడా అదేమార్గాన్ని అనుసరిస్తారు. ఈ అనర్థానకంతటికీ నేనే మూలకారణమవుతాను. గావున నేను తిరిగి వెళ్ళనేవెళ్ళను. ఇక్కడే అడవుల్లో వల్కలవస్త్రాన్ని ధరించి వానవ్రస్థుడనై కందమూల ఫలాదులను తింటూ జీవితాన్ని గడిపేస్తాను. అయితే రాక్షసులు నన్ను గుర్తించిన యెడల పట్టుకొనితీసుకుపోతారు. కాబట్టి అడవిలోవుండేవానర వేషాన్ని ధరిస్తాం. చెట్లపైన వానరులు వుంటూనే వుంటారు గదా, లేకపోతే జుట్టుని పెంచుకొని సాధువునౌతాను. ఒకవేళ ఎప్పుడైనా శ్రీరాముడు ఇక్కడకువచ్చి నన్ను కపటసాధు వునిగా చూచి- ఏమయ్యా, ఈకపటవేషం ఏమిటి? నాముద్రికను వుడాయించావా, అని అడిగితే ఏమనిచెప్పాలి. ఒకవేళ ఆయన నన్నుగూడా వాలి వెళ్ళినమార్గాన పంపితే ఎందుకూపనికిరానివాడనౌతాను.

ఈవిధంగా కొంతకాలం హనుమాన్ ఆలోచిస్తూ వుండి పోయాడు. అరే: నామనస్సులోకి ఏవిధమైనవికారాల్లురావడం

లేదుగదా? ఏదో పిచ్చివానిలాగా విచిత్రమైన వూహలని వూహిస్తున్నాను. జీవించి వున్నంతవరకు పురుషుడు తన పురుషార్థాన్ని విడువరాదు. ఈలంక చూడడానికి చాలా పెద్దదిగదా। ఇంతకీ నేనేమి వెదికాను. ఇంకా లంక ఎంతో వెదకడానికి మిగిలివుంది, నేను ఈవిధంగా నిరాశచెందరాదు. పురుషార్థాన్ని ఆశ్రయించాలి.

శ్వాస వున్నంతవరకు ఆశ వుంటుందిగదా. నేనుతిరిగి సీతమ్మను వెదుకుతాను. అని ఆలోచించి హనుమ లంకలోని వనాల్లోనూ, ఉపవనాల్లోనూ, సీతమ్మను వెదకడానికి ప్రయాణమైనాడు. అంతటా వెదుకుతూ ఆయన అశోకవాటిక సమీపానికి చేరాడు. అచటి సౌందర్యాన్నిచూసి మిక్కిలి సంతసించి ఆలోచించాడు. ఈవాటిక చూడముచ్చటగావుంది. దీనిసౌందర్యం అద్వితీయంగావుంది. పైగా నామనస్సుని ఆకర్షిస్తున్నది. సీతమ్మ ఇక్కడవున్నట్లు నాకనిపిస్తున్నది.

ఇలా ఆలోచించి ఒక చండ్రచెట్టు ఎక్కిచూడగా ఆయనకు ఒకచెట్టుక్రింద సీతమ్మ కనుపించింది. ఆమె శరీరం కృశించిపోయింది. సంస్కారం లేకపోవడంచేత తలనీలాలు జడలు అల్లుకొని వున్నాయి. ఆమె విచారంలోమునిగి చేతిని బుగ్గమీద వుంచుకొని ఏదో ఆలోచిస్తున్నది. సీతమ్మను చూడగనే హనుమంతుడు ఎగిరిపడ్డాడు. ప్రసన్నుడై ఆలోచించాడు– నేను మిక్కిలి భాగ్యశాలిని, సీతమ్మదర్శన మయింది. నిశ్చయంగానే ఈమె శ్రీరాముని ప్రియురాలు.

ఈమె వస్త్రం ఋష్యమూక పర్వతంమీద తన ఆభరణాలను కట్టి వదలిన వస్త్రంతో పోలివున్నది.

ఆహా? నేను కృతార్థుడనైనాను. శ్రీరామచంద్రుని సాహసాన్ని ప్రశంసిస్తాను. ఎందుకనగా ఇలాంటి ప్రియురాలి వియోగంలోకూడా ఆయన జీవిస్తున్నారు. సీతమ్మ చూడ ముచ్చటగా వుంది. ఈమె సౌందర్యం అనవద్యంగావుంది. జగజ్జనని జానకితో సమానమైన స్త్రీ ఈ ముల్లోకల్లో వుండి వుండదు.

ఇంతలో హనుమంతునకు కాగడాలు ప్రజ్వలిస్తూ కనుపించాయి. చాలామందిజనం కోలాహలంగా వస్తున్నారు. హనుమాన్- రాక్షసరాజు రావణుడు సీతమ్మదగ్గరకు వస్తున్నాడు. ఈచెట్టు ఆకులలో దాగివుండి రావణుని చూస్తాను. ఆనీచుడుసీతమ్మతో ఏమిమాట్లాడుతాడో వింటాను అని అనుకొని చెట్టుపైకివెళ్ళి కూర్చున్నాడు. రావణుడు అక్కడకువచ్చి అనేక విధాలుగా ఆమెకు నచ్చజెప్పాడు, భయపెట్టాడు, బెదరకొట్టాడు, నానారకాల దురాశలు చూపాడు. కాని సీతమ్మ అతనివైపు చూడనైనా చూడలేదు. మాట్లాడనూలేదు. మధ్యలో గడ్డిపోచవుంచి. ఆమె-ఓ తాక్ష సాధమా! నీవు నన్ను ఎంత కష్టపెట్టినానరే శ్రీరాముని తప్ప ఇంకొకపురుషుణ్ణి చూడను. మనస్సులో చింతించనుగూడాను, అని అన్నది.

అప్పుడు రావణుడు రాక్షసస్త్రీలకు ఏవో మాటలు చెప్పి వెళ్ళిపోయినాడు. ఆ రాక్షస స్త్రీలుగూడా వెళ్ళిపోయారు. హనుమాన్ ఇదే మంచి అవకాశంగాభావించి ఎంతో తెలివిగా తన పరిచయాన్ని కలుగజేసికొనడం ప్రారంభించాడు. -అయోధ్యానగరంలో రఘువంశములో దశరధమహారాజు వున్నాడు. ఆయనకి రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులనే నలుగురు కుమారులు కలిగారు. శ్రీరాముడు తనతమ్ముడు లక్ష్మణునితోనూ, ప్రియురాలు సీతతోనూ, తండ్రి ఆనతిన అడవికి వచ్చారు. పంచవటి దగ్గరవున్న పర్ణశాలనుంచి దుష్టరావణుడు సీతమ్మను అపహరించి తీసుకొనివచ్చాడు. శ్రీరాముడు మాయామృగ రూపంలోవున్న మారీచుని వెంటాడుతూ వెళ్ళాడు. లక్ష్మణుడుగూడా అక్కడలేడు. సీతమ్మను తీసుకుని వెళ్ళడం చూచి జటాయువు రావణుని వెంబడించింది. రావణుడు జటాయువుని చంపి సీతమ్మను తీసుకొని వెళ్ళాడు. సీతమ్మ మా కోతులను చూచి తన దగ్గర వున్న కొన్ని ఆభరణములను మూటకట్టి క్రిందికి వదిలింది. సీతమ్మను వెదుకుతూ రామలక్ష్మణులు ఋష్యమూక పర్వతందగ్గరకు వచ్చినపుడు ఆ ఆభరణాల మూటను వారికి ఇచ్చాము. వారు వాటిని హృదయం దగ్గర వుంచుకొని సీతమ్మను రావణుడు అపహరించి తీసుకొని వెళ్ళాడని తెలుసుకొని మిక్కిలి విలపించాడు. తరువాత సుగ్రీవునితో స్నేహం చేసుకున్నాడు. అతని అన్న వాలిని చంపి సుగ్రీవుని కిష్కిం

ధకు రాజునిగా చేశాడు. సుగ్రీవుడు సీతమ్మను వెదకడానికి అన్ని దిక్కులకు వానరులను పంపాడు. నన్ను దక్షిణ దిక్కుకు పంపాడు. నేను వాయుపుత్రుడను. నా తల్లి అంజనీ. సుగ్రీవుని మంత్రిని. శతయోజన సముద్రాన్ని దాటి లంకకు వచ్చాను. నేను మిక్కిలి భాగ్యశాలిని. సీతమ్మను వెదికి తెలుసుకున్నాను. కేశరీనందునుడైన హనుమ సీతమ్మ పాదపద్మాలకి నమస్కరిస్తున్నాడు, అని రామకథను విని పించి మౌనం వహించాడు మారుతి.

సీతమ్మ పైకి చూచింది. కాని ఆమెకు ఎవరూ కనుపించలేదు. ఆమె అప్పుడు. నా చెవులకి ఇంతటి మధుర మైన రామకథను వినిపిస్తున్నవారు నా ఎదుటకు ఎందుకు రావడంలేదు? అని అన్నది.

వెంటనే హనుమాన్ చెట్టుదిగి చేతులు జోడించి సీతమ్మ ఎదుటికి వచ్చి నిలబడ్డాడు–తన ఎదుట ఒక కోతిని చూచి సీతమ్మ ముందుభయపడింది, కాని సోదరా? నీవు ఎవరివి? అని మెల్లగా అడిగింది.

హనుమాన్ – అమ్మా! నేను శ్రీ రాముని దూతను. అని వినమ్రతతో సమాధాన మిచ్చాడు.

జానకి – సోదరా? శ్రీరాముడు వానరులతో ఎలా కలుసుకున్నాడు? సవిస్తరంగా చెప్పు అని అడిగింది.

హనుమాన్ ఆదినుంచి తుదిదాకా తిరిగికథ వినిపించాడు. సీతమ్మకు పూర్తిగా నమ్మకం కల్గిన తరువాత శ్రీరామునిని ముదిరికను ఇచ్చాడు. ముదిరికను చూచి ధైర్యాన్ని కోల్పోయి ఎక్కి - ఎక్కి ఏడవసాగింది. ఆమెను చూచి హనుమ కూడా ఏడవసాగాడు. సీతమ్మ వ్యాకులతచెంది భూమిపై పడి, దీర్ఘమైన నిట్టూర్పులను విడుస్తూ హా రామా? హారఘునందనా? అంటూ విలపిస్తూ స్పృహ కోల్పోయింది.

తెలివి వచ్చాక ఏడుస్తూ హనుమాన్‌తో - నాయనా? నీవు నాకు ఎంతగానో ఉపకారం చేశావు. ఇందుకు నేను ఏమి ఋవ్వను? నీ ఈ ఉపకార ఋణాన్ని నేను తీర్చుకోలేను. ఈ ముదిరికను చూచేసరికి నా పాిణనాధుడే నా దగ్గరకు వచ్చినట్లు సుఖం కలిగింది. సోదరా? అనుజుడైన లక్ష్మణునితో పిభువు సుఖంగా వున్నారా? వారు నన్ను ఎప్పుడైనా స్మరిస్తున్నారా అని అడిగింది.

కన్నీరు తుడుచుకుంటూ హనుమ అమ్మా మీరు చక్కని పిశ్న అడిగారు. ఏమని చెప్పను. శ్రీరామ ప్రభువు 24 గంటలు మీ గురించే చింతిస్తున్నారు. రాతులందు నిదిరించుటలేదు. శరీరంపైన ఈగలు, దోమలు వాలినా తోలరు. వారికి శరీరంపట్ల స్పృహగూడా లేదు. వారు ఎల్లప్పుడూ హా జానకి ? హా సీత, అని అంటూవుంటారు, అని అన్నాడు.

జానకి ఏడుస్తూ—నా మరిదిలక్ష్మణుడు ఎలా వున్నాడు? శ్రీరామునకు అతను ధైర్యం చెప్పడంలేదా? అనిఅన్నది.

హనుమాన్ —అమ్మా? ధైర్యాన్ని చెబుతూనేవున్నాడు. ఎవరి మాటనైనా వింటేగదా? రాత్రింబవళ్ళు వారి నేత్రాలు కన్నీటితో నిండివుంటున్నాయి. మౌనంగా వుంటున్నారు. ఆహారాన్ని తీసుకొనక పోవడంచేత శరీరం మిక్కిలి కృశించిపోయింది. నిరంతరమూ ఏడుస్తూ వుండడంచేత వారి బుగ్గలపైన మచ్చలు పడ్డాయి, అని అన్నాడు.

జానకి – నాయనా హనుమా? శ్రీరామ ప్రభువునన్ను తీసుకొని పోవుటకు ఇక్కడికి వస్తారా? సుగ్రీవుడు నాపైన కనికరిస్తాడా? నన్ను నాప్రాణ నాధునితో ఎవరైనా కలుపుతారా? శ్రీరామచంద్రమూర్తిని నేను ఈజీవితంలో దర్శించగలనా?

హనుమాన్— అమ్మా! శ్రీరామునకు సమాచారాన్ని అందజేయగనే సైన్యసమేతులై సముద్రాన్ని దాటివచ్చి సకుటుంబముగా రావణునిచంపి మిమ్ములను క్షేమంగా ఇక్కడనుంచి తీసుకొనివెళ్లుతారు. సుగ్రీవుడు తనశక్తినంతా వినియోగించి మిమ్ములను వెదకిస్తున్నారు. ఆయన శ్రీరామునకు సేవకుడు, దాసుడు అనుచరుడు గూడాను.

సీతమ్మ— శ్రీరామచంద్రమూర్తి చంద్రవదనాన్ని ఏశుభదినాన చూస్తాను? నేను వారి వియోగంలో ఎప్పుడో

చనిపోయి వుండేదాన్ని కాని నాకు వారి ముఖ కమలాన్ని చూడాలని కోరిక వుండడంచేత జీవిస్తున్నాను.

విశేషంగా దుఃఖిస్తున్న సీతమ్మను చూచి హనుమాన్- అమ్మా? మీరు దుఃఖించకండి. మీరు కోరినయెడల ఈరోజే మీకు శ్రీరామచంద్రుని చూపించుతాను. నావీవుపైన కూర్చుంటే శ్రీరామచందు్రిని దగ్గరకు మిమ్ములనుచేర్చు తాను, అని పలికాడు.

ఈమాట వినేసరికి సీతమ్మకు ఇంత దుఃఖంలోగూడా నవ్వువచ్చింది. ఆమె– హనుమా! ఈవిషయంలో నీవు నీసహజ చాపల్యాన్ని వ్యక్తంచేశావు. చూడబోతే నీశరీరం ఇంత చిన్నది. మరి నన్ను తీసుకొని ఈవిశాల సముదా్రిన్ని ఎలా దాటగలవు? అని అన్నది.

హనుమకు తన పరాక్రిమాన్ని చూపడానికి మంచి అవకాశం లభించింది. వెంటనే ఆయన ఒక్క ఎగురు ఎగిరి ఒక పర్వత శిఖరంపైన కూర్చొని, అమ్మా! నా నిజరూపాన్ని చూడండి. అని హనుమ తనశరీరాన్ని పెంచసాగాడు. సుమేరు పర్వతంతో సమానంగా పెరిగి రెండవ సుమేరు పర్వతంలాగా కనుపించాడు. పర్వతాకార రూపాన్ని చూచి జానకి భయ భీతురాలై కళ్లుమూసుకొని– "హనుమా? నీవు. నిజానికి, వాయుపుత్రిడవే." ఈవిశాలసముద్రాన్ని నీవు,గరుత్మంతుడు నీతండ్రి వాయుదేవుడు మువ్వురే దాటగలరు. ఇప్పుడు నాకు

పూర్తిగా విశ్వాసం కలిగింది. నీవు సర్వసమర్థుడవు, కాని నాయనా! నీవీష మీద కూర్చొని శ్రీరాముని దగ్గరకు రావడం సమంజసంగాలేదు. ఒకటి- ఏమంటే నీవు వేగంగావెళ్లుతావు. నేను నీవేగాన్ని తట్టుకోలేను. మూర్ఛనొంది సముద్రంలో పడిపోతాను. రెండవది- ఏమంటే నన్ను తీసుకొని వెళ్ళిపోవడం చూచి రాక్షసులు నీతో యుద్ధం చేస్తారు. నీవువారితో యుద్ధమేచేస్తావా లేక నన్నుకాపాడుతావా? మూడవది- ఏమంటే సర్వసమర్థుడైన రామునిభార్యనై వుండి దొంగతనంగా వెళ్ళడం నాకుగాని శ్రీరాముని మర్యాదకు గాని తగినట్టుగావుండదు. వారు వచ్చి తమబలపరాక్రమంతో రావణునిచంపి నన్ను తీసుకొని వెళ్లుతారు. నాయనా అసలు విషయం ఏమిటంటే నేను పతివ్రతను. స్వేచ్ఛగా పర పురుషుని స్పర్శించజాలను. రావణుడు బలవంతంగాతీసుకొని వచ్చినప్పుడు వివశురాలనై వున్నాను. నీబలాన్ని, రూపాన్ని చూచేసరికి నాకు నమ్మకం కలిగింది. హనుమా? ఒకవిషయం చెప్పునాయనా? వానరరాజు సుగ్రీవునిదగ్గర నీలాంటి బలవంతులు ఇంకావున్నారా?

హనుమాన్- అమ్మా, మీరు ఇలా అడుగుతున్నా రెందులకు? నేను వానరులందరిలోనూ చిన్నవాడిని. నన్ను దూతగా పంపారు. దీన్నిబట్టి మీరే వూహించుకోండి. దౌత్య కార్యం చాలా చిన్నపని. సామాన్యంగా సర్వసామాన్యుడినే

దూతగా పంపుతారు. తల్లీ! నాకు పెద్దపొట్టవుంది. ఆకలి తీవ్రంగా వేస్తున్నది. నేను వానరుణ్ణిగదా. ఈతోటలో మంచి ఫలములున్నాయి. మీరు అనుమతిస్తే పొట్టనిండా తింటాను.

సీతమ్మ— నాయనా! ఈఫలములరక్షణకు చాలామంది రాక్షసులను నియమించారు. ఫలములను తింటూ నిన్ను చూస్తే వారు కొడతారు. నీవు వారిని అడిగి ఫలములను తిన వలసినది.

హనుమాన్— అమ్మా ఆరాక్షసుల విషయం నేను చూచు కుంటాను. వానరులు ఎక్కడావీదీ, అడిగి తీసుకొనరు. పురుషార్థంతోటే సంపాదించుకొని తింటారు.

సీతమ్మ— నాయనా! తిను. కానీ ఏమీ గొడవతలపెట్ట వద్దు.

అంతే, ఇంకేముంది. హనుమ ఫలములను తిననారం భించాడు. కొన్నిటిని తినేవాడు, కొన్నిటిని కొరికేవాడు. పచ్చిపండ్లనుకోసి కొరికేస్తున్నాడు, కొమ్మలనువిరుస్తున్నాడు. పూలకొమ్మలను వూపుతున్నాడు. ఒకచెట్టుమీదనుండి మరిఒక చెట్టుమీదకి దూకుతున్నాడు. టక్ టక్ అని శబ్దంచేస్తున్నాడు. చెట్లమీదకి ఎక్కుతూ దిగుతూవున్నాడు. తన వానర చాపల్యాన్ని పూర్తిగా ప్రదర్శిస్తున్నాడు. రక్షక రాక్షసులు హనుమను ఫలములను తింటూ చూచి అస్త్రశస్త్రాలతో

పూర్తిగా విశ్వాసం కలిగింది, నీవు సర్వ సమర్థుడవు, కాని నాయనా? నీ వీపుమీద కూర్చొని శ్రీరాముని దగ్గరకు రావడం సమంజసంగా లేదు. ఒకటి— ఏమంటే నీవు వేగంగా వెళ్తుతావు. నేను నీ వేగాన్ని తట్టుకో లేను. మూర్ఛనొంది సముద్రంలో పడిపోతాను. రెండవది – ఏమంటే నన్ను తీసుకొని వెళ్ళిపోవడం చూచి రాక్షసులు నీతో యుద్ధం చేస్తారు, నీవు వారితో యుద్ధమేచేస్తావా లేక నన్ను కాపాడుతావా? మూడవది –ఏమంటే సర్వసమర్థుడైన రాముని భార్యనై వుండి దొంగతనంగా వెళ్ళడం నాకగాని శ్రీరాముని మర్యాదకు గాని తగినట్లుగా వుండదు. వారు వచ్చి తమ బలపరాక్రమంతో రావణుని చంపి నన్ను తీసుకొని వెళ్ళు తారు. నాయనా? అసలు విషయమేమంటే నేను పతివ్రతను. స్వేచ్ఛగా పరపురుషుని స్పర్శించజాలను. రావణుడు బల వంతంగా తీసుకొనివచ్చునప్పుడు వివశురాలనై వున్నాను నీబలాన్ని. రూపాన్ని చూచేసరికి నాకు నమ్మకం కలిగింది. హనుమా? ఒక విషయం చెప్పునాయనా? వానరరాజు సుగ్రీవునిదగ్గర నీలాంటి బలవంతులు ఇంకావున్నారా?

హనుమాన్ – "అమ్మా? మీరు ఇలా అడుగుతున్నా రెందులకు? నేను వానరులందరిలోనూ చిన్నవాడిని, నన్ను దూతగా పంపారు. దీన్నిబట్టి మీరేవూహించుకోండి, దౌత్య కార్యం చాలా చిన్నపని. సామాన్యంగా సర్వసామాన్యుడినే దూతగా పంపుతారు. తల్లీ? నాకు పెద్దపొట్టవుంది. అకలి

తీవ్రింగావేస్తున్నది. నేను వానరుణ్ణిగదా. ఈతోటలో మంచి ఫలములున్నాయి. మీరు అనుమతిస్తే పోట్టనిండా తింటాను.

సీతమ్మ - నాయనా? ఈఫలముల రక్షణకు చాలా మంది రాక్షసులను నియమించారు. ఫలములను తింటూ నిన్ను చూస్తేవారు కొడతారు. నీవు వారిని అడిగి ఫలములను తినవలసినది,

హనుమాన్ - అమ్మా? ఆరాక్షసుల విషయం నేను చూసుకుంటాను. వానరులు ఎక్కడా ఏదీ అడిగి తీసుకొనరు. పురుషార్థంతోటే సంపాదించుకుని తింటారు.

సీతమ్మ - నాయనా? తిను, కాని ఏమీ గొడవ తలపెట్టవద్దు.

అంతే, ఇంకేముంది. హనుమ ఫలములను తిననారంభించాడు. కొన్నిటిని తినేవాడు. కొన్నిటిని కొరికేవాడు, పచ్చిపండ్లను కోసి కోరికేస్తున్నాడు. కొమ్మలనువిరుస్తున్నాడు "టక్ టక్" అని శబ్దం చేస్తున్నాడు. చెట్లమీదకి ఎక్కుతూ దిగుతూవున్నాడు. తన వానర చాపల్యాన్ని పూర్తిగ ప్రదర్శిస్తున్నాడు. రక్షక రాక్షసులు హనుమను ఫలములను తింటూ చూచి అస్త్రశస్త్రాలతో కొట్టడానికి వచ్చారు. హనుమాన్ ఒక్కొకక్క దెబ్బ గట్టిగా అందరికీ తగిలించాడు. ఆయన దెబ్బకి కొందరు అక్కడే చనిపోయారు, కొందురు స్పృహ కోల్పోయారు, కొందరు భయపడ్డారు, కొందరు పారిపోయారు.

కొందరు సమాచారాన్ని అందజేయడానికి రావణుని శిబిరానికి చేరారు.

సమాచారాన్ని తెలుసుకొని రావణుడు సైన్యాన్ని పంపాడు. హనుమాన్ వారినిగూడా కొట్టి తరిమాడు. అప్పుడు రావణుడు తన తనయుడైన అక్షయ కుమారుణ్ణి పంపాడు. అతన్ని గూడా హనుమాన్ చంపేశాడు. తరువాత ఆయన తన పెద్దకుమారుడైన ఇంద్రజిత్తును పంపాడు. ఆతను హనుమంతునితో కొంతకాలం యుద్ధంచేసిచివరకు నాగపాశంతో కట్టేశాడు. అస్త్రాన్ని గౌరవించుటకుగాను హనుమ తనకుతానే బంధింపబడ్డాడు. ఇంద్రజిత్తు హనుమను బంధించి రావణుని దర్బారులోకి తీసుకొని వెళ్ళాడు.

## ప్ర ద క్షి ణ శ్లో క ము

శ్లో॥ ఆంజనేయం మహావీరం బ్రహ్మ విష్ణు శివాత్మకమ్।
తరుణార్క ప్రభం శాంతం రామదూతం నమామ్యహమ్

ఈశ్లోకమును చదువుచు హనుమద్విగ్రహమునకు గాని, యంత్రమునకు గాని ప్రదక్షిణ మొనర్చిన సకలారిష్టములు నివారణ మగును. సకల వాంఛలు నెరవేరును.

# లంకాదాహక హనుమాన్

# 8

ఉల్లంఘ్యసింధోః సలిలం సలీలం
యశ్శోకవహ్నింజనకాత్మజాయాః॥
ఆదాయతేనైవ దదాహ లంకాం
నమామి తం ప్రాంజలిరాంజనేయం॥ ☼

హనుమాన్ శ్రీరామునికి నిజమైన భక్తుడు. ఆయన పవన కుమారుడు, రుద్రుని అవతారుడు, విఘ్నవినాశకుడు. శోకాన్ని నశింపజేయువాడు. దీనులకు రక్షకుడు, ప్రతిపాలకుడు, అధ్యాపకుడు. ఆయన పనులన్నీ శ్రీరాముని అనుగ్రహం కొరకే జరుగుతాయి. శ్రీరామ కార్యాన్ని చేయడానికి ఈయన అన్నివేళలా సంసిద్ధుడై వుంటాడు. జగత్తులో ఉపకారం చేయడంలో ఈయనకు ఈయనే సాటి. భయపడడంగాని, వ్యాకులత చెందడంగాని ఈయనకు తెలియనే తెలియదు.

హనుమాన్ జానకితో మాట్లాడుతూ వుండగా "రావణునకు విభీషణుడు అనే సోదరుడున్నాడు. ఆతను మిక్కిలి

---

☼ ఏ హనుమంతుడు సముద్రజలాన్ని అవలీలగా దాటి, జనకనందిని జానకిలోవున్న శోకాగ్నిని తీసుకొని లంకను భస్మం చేశాడో అట్టి ఆంజనేయుని చేతులు జోడించి నమస్కరిస్తాము.

సాధుస్వభావం గలవాడు. ఆయన భార్య తరచువచ్చినాకు ధైర్యం చెబుతుంది - అని అన్నది. హనుమంతుని మనస్సులో విభీషణున్ని దర్శించాలని కోరిక కల్గింది. ఇంద్రజిత్తు నాగపాశంచేత బంధించి అతన్ని తీసుకొని వెళ్తున్నప్పుడు ఏమీ అడ్డుచెప్పకుండా మౌనంగా రాజదర్బారులోకి వెళ్లాడు. రావణుని సర్వసైన్యరహస్యాన్ని. అతని మంత్రుల బలపరాక్రమాలను, లంకలోని ప్రతి ఇంటిగుట్టును తెలుసుకోవాలని ఆయన అనుకొని రావణుని రాజసభలోకి ఖైదీగా చేరాడు.

రావణుడు - నాసైన్యాన్ని, నాప్రియపుత్రుణ్ణి చంపేటంతటి సాహసమా ఒక కోతికి అని హనుమంతునిపట్ల కుపితుడై ఎర్రని కళ్ళతో "ఏమిరా కోతీ? నీవు ఏవడవు? అనిఅన్నాడు

"నేను సుగ్రీవుని మంత్రిని, శ్రీరాముని దూతను. అని హనుమాన్ జవాబిచ్చాడు.

"నీ తండ్రి పేరేమిటి? నీపేరేమిటి? అని రావణుడు అడిగాడు.

"నేను పవనతనయుడను, కేశరీ నందనుడను, నా పేరు హనుమాన్ అని అంటారు,

-నీవు లంకలోకి ఎందుకు వచ్చావు? అని రావణుడు అన్నాడు.

—జనకనందినీ జానకీదేవి సమాచారాన్ని తెలుసు కొనడానికి వచ్చాను — అని హనుమాన్ అన్నాడు.

రావణుడు — నీవు శతయోజన సముద్రంమధ్యలో వున్న లంకలోకి ఎలా ప్రవేశించావు? అని అన్నాడు.

హనుమాన్ — నేను నా బాహుబలంచేత, శ్రీరాముని అనుగ్రహం చేత సముద్రాన్ని దాటి వచ్చాను. నా రాక సార్థకమయింది. జగజ్జననీ భగవతీ జానకి జాడ తెలుసు కున్నాను.—నీవు దొంగ మాదిరిగా నా లంకలో ప్రవేశించావు. నీవు శిక్షకు అర్హుడవు, అని రావణుడు అన్నాడు.

—హనుమాన్ — వానరులు ప్రవేశించడానికి చీటి తీసుకొని నగరంలో గాని గ్రామంలో గాని ప్రవేశించరు, వృక్షాలు వున్నచోటనే వానరులకు నివాసము. అశోక వాటిక లోవున్న వృక్షాలలోనే కూర్చొని వున్నాను.

—అయితే నీవు పండ్లను ఎందుకు తిన్నావు. చెట్లను ఎందుకు విరిచావు, అని రావణుడు అడిగాడు.

ఆకలి వేసింది గనుక పండ్లను తిన్నాను. వానరస్వభావం చేత, చెట్లను విరగగొట్టాను. ఆనందం కలిగినప్పుడు వానరులు చెట్లను విరుస్తారు. సీతమ్మను చూచేసరికి నాకు మిక్కిలి సంతోషం కల్గింది. ఆ సంతోషంలో చెట్లను పడగొట్టాను అని జవాబిచ్చాడు హనుమాన్.

రావణుడు — "నీవు రాముని దూతగా చెప్పుకుంటు న్నావు. అయితే దూతను యుద్ధంచేయమని ఏ శాస్త్రంలో వ్రాసివుంది? నీవు ఎందుకు యుద్ధం చేశావు?

హనుమాన్ — అయ్యా. నేను ముందుగా యుద్ధం, చేయలేదే. మీ సైనికులువచ్చి నన్ను కొడుతుంటే ఆత్మ రక్షణార్థం నేనూ కొట్టాను, అంతే.

రావణుడు పళ్ళను పట పట కొరుకుతూ — "ఓయి వానరా? నీవు చాలా మొండివానివిగా వున్నావు. నీవు నా అక్షయ కుమారుణ్ణి ఎందుకు చంపావు?" అని అన్నాడు.

హనుమాన్ — "అతను వచ్చి నన్ను కొడుతూవుంటే నేను గూడా మెల్లగా కొట్టాను. నా చిన్ని దెబ్బలను తట్టుకో లేకచనిపోయాడు. మీ కుమారుడు ఇంత దుర్బలుడని నాకేం తెలుసు?

ఇది వినేసరికి రావణుని రోమ రోమానికి క్రోధం వ్యాపించింది. తన సైనికులతో — ఈ వానరుణ్ణి తీసుకొనివెళ్ళి చంపేయండి, అని గర్జించాడు.

రాక్షసులు హనుమంతుణ్ణి చంపడానికి తీసుకొని వెళ్ళు తుంటే విభీషణుడు అన్నాడు! మీరు శాస్త్రాలలో పండితులు ఏశాస్త్రాలలో కూడా దూతను వధించమని చెప్పలేదే. దూత అవధ్యుడని చెబుతారు. ఎందుకనగా అతను చెప్పే విషయం

స్వామిదికదా. మీకు సామర్థ్యంవుంటే ఇతని స్వామిని దండించండి.

రావణుడు — దూత అవధ్యుడని నాకు తెలుసు. కాని ఇతను దౌత్య ధర్మానికి విరుద్ధంగా వ్యవహరించాడు. ప్రాణ ప్రియుడైన నా అక్షయ కుమారుని చంపేశాడు. ఇందుచేత ఇతన్ని దండించి తీరాలి. దూత స్వయంగా యుద్ధంచేయ నారంభించినప్పుడు అతను శిక్షకు అర్హుడౌతాడు. అని అన్నాడు.

విభీషణుడు — ఒకవేళ మీరు ఇతన్ని శిక్షకు పాత్రుడని భావిస్తే అవయువాలను విరుగగొట్టి పంపండి, కాని ప్రాణ దండన విధించరాదు.

రావణుడు — సరే, ఇతనికి ప్రాణదండన ఇవ్వవద్దు. కోతులకు తోక యిష్టమని అంటారు గాన ఇతని తోకను కాల్చి వేయండి. తోక లేకుండా వెళ్ళినప్పుడు ఇతని స్వామి ఏమంటాడో?

ఇలా అని రావణుడు పత్తి. పాతగుడ్డలు, నార, తైలం, కొవ్వు, నెయ్యి మొదలగు వస్తువులను తెప్పించి హనుమంతుని తోకకు చుట్టమని ఆదేశించాడు. రాక్షసులు నూనెలోనూ నేతిలోనూగుడ్డలను తడుపుతూ హనుమంతుని తోకకి చుట్టుతూ నారతో దాన్ని బిగించారు. హనుమాన్

ఏమీమాట్లాడలేదు. రాక్షసులు తోకకు గుడ్డలు చుట్టుతున్న కొద్దీ హనుమాన్ తనతోకను పెంచాడు. ఆతోకచివరికి వాసుకి సర్పంతోసమానమైంది. లంకలోనినెయ్యి, నూనె, పాతగుడ్డలు, ప్రత్తిఅన్నీసమాప్తమైనాయి. రాక్షసులు తోకకి నిప్పుపెటారు. రావణుడు — ఈ వానరాన్ని పట్టణమంతా త్రిప్పి సముద్రపు ఒడ్డున వదిలిరండి — అని అన్నాడు.

రాక్షసులు హనుమంతుణ్ణి బంధించి తీసుకొని వెళ్తున్నారు. ఈయన ఏమీ అడ్డుచెప్పక పెంపుడుకోతిలాగ వారి వెంట వెళ్తున్నాడు. రాక్షసులు ఈయనను చూచి నవ్వుతున్నారు. పిల్లలు హర్ష ధ్వానాలు చేస్తున్నారు. కొందరు వేళాకోళం చేస్తున్నారు. మరికొందరు దుమ్ము విసురుతున్నారు. ఈయనమాత్రం ఎవరినీ ఏమీ అనడంలేదు రాక్షసులు ఈయన్ని లంకలోని వీధులన్నిటిలో త్రిప్పుతున్నప్పుడు ఒక రాక్షసి వెళ్ళి సీతమ్మతో — సీతమ్మా! నీవు మాట్లాడిన కోతి తోకకి నిప్పు అంటించి రాక్షసులు అన్ని సందులలో త్రిప్పుతున్నారు. పాపం ఆ అమాయకుడు వాళ్ళ వెంట తిరుగుతున్నాడు, అని అన్నది.

ఈ విషయం వినేసరికి సీతమ్మకు మిక్కిలి దుఃఖం కలిగింది, ఎంతగానో విచారించి ఆమెచేతులను జోడించి అగ్ని దేవుణ్ణిప్రార్థించిండి. నేనే గనుక నిజంగా పతివ్రతనైతే, శ్రీరామచంద్రుని తప్ప స్వప్నంలోనైనా పరపురుషుని

తలచకుండా వుంటే అగ్నిదేవుడు హనుమంతునకు చల్లన అవాలి. అతనికి ఏవిధంగానూ అరిష్టం కలుగరాదు. జగజ్జనని ప్రార్థనకి అగ్నిమారుతి కోసరం చల్లనైనాడు. హనుమాన్ తనలో తాను అనుకొంటున్నాడు - ఇంతగా అగ్నిజ్వాలలు వేస్తున్నా నాకు చలివేస్తున్నదేమిటి? ఈ అగ్ని నాకు హిమశీతలంగా ఎందుకు అనిపిస్తున్నది?

హనుమాన్ లంకలో వీధులన్నిటితో పరిచయం కలుగగానే తనతోకను త్రిప్పి రాక్షసుల మూతిన కొట్ట సాగాడు. రాక్షసుల గడ్డాలు, మీసాలు, వెంట్రుకలు తగుల బడిపోతున్నాయి. వారు అమ్మో, అయ్యో, కుయ్యో, మొర్రో అని కేకలు పెడుతూ హనుమంతుణ్ణి వదిలి పారిపోయారు. హనుమాన్ స్వతంత్రుడై ఒక్క ఎగురు ఎగిరి ఒక ఎత్తైన మేడమీదికి ఎక్కి తన తోకతో లంకానగరమంతా భస్మంచేయ నారంభించాడు. లంక అంతటా హాహాకారం చెలరేగింది, రాక్షస స్త్రీలు పారిపోతున్నారు, పిల్లలు ఏడుస్తున్నారు, అరుస్తున్నారు. ఎవరికి ఎటు దారి దొరికితే అటే పారి పోతున్నారు. అందరి ప్రాణాలు పోతున్నాయి. లంక బంగా రంతో నిర్మించబడింది, అందులోవున్న వస్త్రాలు, నెయ్యి, నూనె, అన్నీ ధూ - ధూ అంటూ మండిపోతున్నాయి. పచ్చని చెట్లు తగులబడిపోతున్నాయి. తోటలన్నీ పాడుపడి పోతున్నాయి. ఏనుగులు, గుర్రాలు తాళ్ళను తెంచుకుని

సముద్రంవైపు పరుగిడుతున్నాయి. హనుమాన్ అంతటా తిరుగుతూ నగరాన్ని భస్మంచేస్తూ నవ్వుతున్నాడు. ఇటు అటు దూకుతున్నాడు. ఆయనకి తటాలున జ్ఞాపకం వచ్చింది. అరెరె, అశోకవాటికలో కూర్చొనివున్న సీతమ్మ తగులబడలేదు గదా అని అనుకొని సముద్రంలోకి దూకి మంటను చల్లార్చు కొని ఒక్క పరుగున అశోక వాటికలోనికి చేరి చెట్టుక్రింద చేతులను జోడించి చింతామగ్నురాలైన భగవతి జానకిని చూశాడు. సీతమ్మను కుశలంగాచూసి హనుమంతునికి మిక్కిలి సంతోషం కల్గింది. ఆయన వెళ్ళి సీతమ్మ పాదపద్మాలకు సాష్టాంగ నమస్కారం చేశాడు. సంతోషాన్ని వెలిబుచ్చుతూ సీతమ్మ — నాయనా హనుమా? నీవు కుశలంగా వచ్చావా? నీకు కష్టం కలుగలేదుగదా? అని అన్నది.

హనుమాన్ - అమ్మా, మీ ఆశీస్సు వుండగా నాకు కష్టంఎలా కలుగుతుంది, జననీ? నేనువచ్చినపని నెరవేరింది, శతయోజనసముద్రాన్ని దాటి వచ్చిన పని సానుకూల మయింది. లంకలోని రహస్యాల నన్నిటినీ తెలుసుకున్నాను. రాక్షసుల బలాబలాలను గుర్తించాను. ఇందరితో పరిచయాన్ని చేసుకున్నాను. మీ దర్శనభాగ్యం లభించింది. ఇక నాకు సెలవు యిప్పించండి.

కన్నీటితో జానకి - నాయనా, నీవు వుండడంచేత చాలా ఆసరాగా వుంది. నీవుగూడా ఇక వెళ్ళిపోతున్నావు.

నాకు తిరిగి ఆకష్టపురోజులు వస్తాయి. ఒకవేళ నీవు అలసిపోతే ఈరాత్రి ఇక్కడ విశ్రమించి రేపు వెళ్ళు అని అన్నది.

హనుమాన్ – అమ్మా! శ్రీరాముని కార్యం నెరవేరనిదే విశ్రమించను. మీ ఆశీర్వాదబలం వుంది. వేగంగా వచ్చినట్లుగా వెళ్ళిపోతాను. సకలవానర సైన్యాన్ని సమకూర్చుకొని సుగ్రీవ రామలక్ష్మణులతోకలిసి త్వరగావస్తాను. శ్రీరాముడు రావణుని చంపి త్వరలో మిమ్ములను ఉద్ధరిస్తాడు. మీ యిరువురిని ఒకే సింహాసనంమీద కూర్చొనివుండడం చూసి మావానరులంతా మిక్కిలి సంతోషిస్తారు.

సీతమ్మ – నాయనా? నీవు త్వరగారా. మిక్కిలి దుఃఖంతో వుండికూడా ఈఆశతోటే జీవించివుంటాను. నామరది లక్ష్మణునకు ఆశీస్సులుచెప్పు. నేను ఆయనకి ఎంతగానో అన్యాయంచేశాను. నా అపరాధాలను మరచిపొమ్మనమని చెప్పవలసినది. వానరరాజు అగు సుగ్రీవునకు జ్ఞాపకంచేసి నన్ను ఉద్ధరించమని చెప్పవలసినది. ముఖ్యులైన వానరులందరికి క్షేమసమాచారాన్ని అడిగి తెలుసుకున్నట్లు చెప్పు. నాయనా? నీవుమాత్రం నన్ను మరచిపోవద్దు, అనిచెప్పి జానకి చీరపయిటతో ముఖాన్ని కప్పివుచ్చుకొని దుఃఖించ సాగింది.

హనుమాన్ దుఃఖిస్తూ గద్గదస్వరంతో– అమ్మా మీరు విచారించకండి. శ్రీరాములవారు వెంటనే వచ్చేస్తారు. ఇక

నాకు సెలవు. శ్రీరాములవారు నాకు తనఉంగరాన్ని గుర్తుగా ఇచ్చినట్లు ఏదైనా గుర్తు మీరు గూడా శ్రీరామునికి యివ్వడానికి ఇవ్వండి — అని అన్నాడు.

వెంటనే శ్రీజానకి తన శిరస్సులోని చూడామణిని తీసి ఇస్తూ హనుమా, శ్రీరామునకు ఈగుర్తునిచ్చి వెంటనేరావలసి నదిగా చెప్పు. అని అన్నది.

నతమస్తకుడై చేతులనుచాచి హనుమాన్ ఆచూడామణిని తీసుకున్నాడు. అప్పుడు సీతమ్మ - నాయనా హనుమా? ఇంతటి సముద్రాన్ని గరుత్మంతుడు, మీ తండ్రి వాయువు నీవు, తప్ప మరి నాల్గవవారెవ్వరూ దాటలేరుగదా? వానరు లందరూ ఇక్కడికి ఎలా వస్తారు? అందరూ నీతో సమానమైన బలవంతులు కాదుకదా? అని పలికింది.

హనుమాన్ — అమ్మా, మీరు ఈ విషయాన్ని గురించి విచారించకండి. మామార్గాన్ని అడ్డుపరచడానికి సము ద్రానికి శక్తి ఎక్కడవుంది? అమ్మా, అవసరమైతే మేము సముద్రాన్ని ఎండబెట్టగలము. త్వరలో లంకలో అంతటా వానరులను మీరు చూస్తారు. ఇంక ఆశీర్వదించి నాకు సెలవు ఇవ్వండి, అని అన్నాడు.

జానకి — నాయనా? నీకు సదా యుద్ధంలో విజయం చేకూరుగాక, అజరామరుడవు అవుగాక. నీ సంపూర్ణ శరీరం వజ్రంతో సమానంగా వుండుగాక, నిన్ను ఎప్పుడూ ఎవరూ

పరాజితుణ్ణి చేయజాలరు. నీవు శ్రీరామునకు ప్రాణ ప్రియుడవు అవుగాక. జగత్తంతా నీకీర్తి వ్యాపించుగాక, సూర్య చంద్రులున్నంతవరకు నీసుకీర్తి సుస్థిరంగా వుండుగాక. వెంటనే తిరిగి వస్తావనేఆశతో వెళ్ళమని అనుమతి ఇస్తున్నాను అని అన్నది.

సీతమ్మ దగ్గర సెలవుతీసుకొని హనుమ ఆమె పాదాలకు మాటి మాటికి నమస్కరించి, శ్రీరామునిచెంతకు చేరడానికి ప్రయాణమైనాడు.

## హనుమంతుని గుణగానము

రామపూజారీ పరఉపకారీ మహావీర బజరంగబలీ।
సద్ధర్మచారీ, సద్బ్రహ్మచారీ, ....
జ్ఞానగుణసాగర, రూపఉజాగర, ....
శంకర సువనా, సంకటమోచన, ....
కేసరినందన, కలిమలభంజన। ....
రాఘవదూతా, జయహనుమంతా, ....
అంజనినందన, అసురనికందన, ....
మంగల మారుతి, మారుతినందన, ....
జయరణధీరా, జయరణరోరా, ....
జయబలభీమా, జయబలధామా, ....

# రామభక్త హనుమాన్

# 9

భృత్యకార్యం హనుమతాకృతం సర్వమశేషతః ।
సుగ్రీవస్యే దృశోలోకే నభూతో నభవిష్యతి ॥
అహంచ రఘువంశశ్చ లక్ష్మణశ్చ కపీశ్వరః ।
జానక్యా దర్శనేనాద్య రక్షతః స్మో హనుమతా ॥ *

జగత్తునందు సేవకులు మూడురకాలుగా వుంటారు. స్వామి అప్పగించిన కార్యంతోపాటు మిగతా కార్యములను. గూడా కౌశలంగా నెరవేర్చువారు ఉత్తమసేవకులు. స్వామి అప్పగించిన పనిని పూర్తిచేసుకొని వచ్చువారు మధ్యములు శక్తిసామర్థ్యాలు కలిగివుండిగూడా స్వామికార్యాన్ని చక్కగా చేయక బొత్తిగా వెట్టిచాకిరి అనిభావించి త్రోసిపుచ్చుతారో అట్టివారు అధములు. మన హనుమ శ్రీరామునకు ఉత్తమోత్తమ సేవకుడు. అందుకే శ్రీరాముడు అతనిపట్ల కృతజ్ఞత తెలుపుతూ — హనుమా? నేను నీ ఉపకారాలనుంచి జన్మ జన్మాంతరాలకి విముక్తుడను కాజాలను, అని అన్నాడు.

---

* శ్రీరాముడు అంటున్నాడు – హనుమాన్ సుగ్రీవుని సేవాకార్యాన్ని పూర్తిగా నెరవేర్చాడు. జగత్తులో ఇలాంటి సేవకుడు అద్యావధి జన్మించ లేదు. జన్మించడు గూడాను. జానకినిచూచి ఆమెజాడ తెలుసుకొని నన్నూ నా వంశాన్ని. లక్ష్మణుని, సుగ్రీవుని, అందర్ని హనుమ రక్షించాడు,

శ్రీహనుమ లంకనుకాల్చి, అచటి రహస్యములనన్నిటినీ తెలుసుకొని, జానకిదగ్గర గుర్తుగా చూడామణిని తీసుకొని, ఆశీర్వాదాన్ని పొంది సముద్రాన్ని దాటి తిరిగి వస్తున్నాడు. సముద్రపు ఒడ్డున కూర్చొనివున్న జాంబవంతుడు మిగతా వానరులు హనుమను సంతోషంగా రావడంచూచారు. ఆయన ముఖాకృతిని చూచి కృతార్థుడై సీతమ్మను చూచి వస్తున్నట్లు భావించారు. అందరూ ఆయనకి హృదయపూర్వకంగా అభినందనలు అందజేశారు. ఆయన పెద్దవారికి నమస్కరించాడు. తోటివారని కౌగిలించుకున్నాడు, చిన్నవారిని ఆశీర్వదించాడు. ఎంతో ఉల్లాసంగా "నేను సీతమ్మను చూచి వచ్చాను. సీతమ్మ దర్శనంచేత నాజీవితంసార్థకమయిందని సీతమ్మనుదర్శించనివారిజీవితం జీవితమేగాదు," అని మొదటి నుంచి చివరిదాకా తన వృత్తాంతాన్నంతా వినిపించాడు. వానరులందరూ విని మిక్కిలి సంతసించి ప్రసన్నవదనాలతో శ్రీరాముని దగ్గరకు చేరడానికి ప్రయాణమైనారు. మార్గ మధ్యంలో సుగ్రీవుని తోటను చెల్లాచెదరుగాచేసి శ్రీరాముని దగ్గరకు చేరి నమస్కరించి, నేను "సీతమ్మను లంకలోచూచి వచ్చాను" అని అన్నాడు.

ఈమాటవినేసరికి శ్రీరామునినోట మాటవెలువడలేదు. నేత్రాలనుంచి ప్రేమాశ్రువులు ప్రవహించాయి. వాక్కునకు గద్గదం ఏర్పడింది. శరీరమంతా పులకితమైంది. ఎంతో కష్టం మీద హనుమా! నిజంగానే సీతమ్మను చూచావా? ఆమెఎలా

వుంది? ఎక్కడ వుంటున్నది? కృశించిపోలేదుగదా? ఆమెకు రోజులు ఎలా గడుస్తున్నాయి? రాక్షసుల మధ్య ఎలా జీవిస్తున్నది? రాక్షసులు ఆమెను కష్టపెట్టుటలేదుగదా? నన్ను స్మరించుతున్నదా? నాగురించి నిన్ను ఏమి-ఏమి అడిగింది పవనతనయా? నా ప్రియురాలి సమాచారాన్ని సవిస్తారంగా వినిపించు" అని అన్నాడు.

హనుమాన్ సీతమ్మను దర్శించినప్పటినుంచి ఆమెకు అమితమైన భక్తుడైనాడు. శ్రీరాముని ప్రశ్నలను విని ముందుగా సీతమ్మ నివసిస్తున్న దిక్కునకు నమస్కరించి-ప్రభో, నేను సీతమ్మను లంకలో శింశుపా వృక్షంక్రింద మలిన వస్త్రమును ధరించివుండగా చూచాను. నిరంతరమూ ఏడుస్తూ వుండడంచేత ఆమె కమలములవంటిరెండు నేత్రాలు ఎండిపోయాయి. ఆమె అందమైన ఉంగరములు తిరిగిన నల్లని తలనీలాలు దువ్వుకొనకపోవడంచేత మలినంగానూ చిక్కుబడి జడలుమాదిరిగా వున్నాయి. ఆమె నిరంతరమూ మీనామాన్ని స్మరిస్తున్నది. హృదయంలో మీమనోహర మూర్తిని ధ్యానిస్తూవున్నది. ఆమె తపస్సుకి, కరుణకు సజీవ మూర్తిలాగా కనుపిస్తున్నది. విరహానికి ప్రతిరూపంగావుంది. ఆమె అవయవాలన్ని మిక్కిలి కృశించిపోయాయి. ఆమె ప్రతిశ్వాసకు రామనామాన్ని జపిస్తున్నది. జగజ్జనని దర్శనం చేత కృతార్థుడనైనాను. సీతమ్మముందుగా నన్ను నమ్మలేదు. రామకథ వినిపించి, శపథంచేసి మీ ఉంగరాన్ని చూపించగా

అప్పుడునమ్మింది. ఆమె ఏడుస్తూ తనకథను వినిపించింది. ప్రభో? నేను సీతమ్మ ఆజ్ఞను తీసుకొని ఫలాలను తిన్నాను. అశోకవాటికను చిందరవందరగా చేశాను. నన్ను చంపడానికి రావణుని సైన్యం వచ్చింది. వారితో యుద్ధం చేశాను. రావణుని కుమారుడైన అక్షయుని యుద్ధంలో చంపాను. ఇంద్రజిత్తు వచ్చి నాగపాశంచేత బంధించి రావణుని రాజసభలోకి నన్ను తీసుకొని వెళ్లాడు. రావణుడు నన్ను చంపివేయుమని ఆజ్ఞాపించాడు. కాని అతని చిన్నతమ్ముడు విభీషణుడు గొప్ప మహాత్ముడు, ధర్మాత్ముడు, మీపట్ల భక్తిభావం కలిగినవాడు. అతనిలో రాక్షసలక్షణం ఎక్కడాలేదు. అతను దూత అవధ్యుడని చెప్పగా రావణుడు నాతోకకు నిప్పు అంటించి వదిలివేశారు. నేనులంకను తగులబెట్టి సీతమ్మ పాదాలకి నమస్కరించి సెలవు తీసుకున్నాను. నా గమనాన్ని విని ఏడుస్తూ మీపాదాలకి నమస్కరించి వెంటనేవచ్చి తనను రక్షించమని కోరారు. ఈచూడామణిని గుర్తుగా ఇచ్చారు, అని చూడామణిని రామునిచేతిలో వుంచాడు. శ్రీరాముడు ఆచూడామణిని హృదయానికి హత్తుకొని ఘోరు, ఘోరున విలపిస్తూ పలుమారులు నేత్రస్పర్శగావించి కన్నీటితో సుగ్రీవునితో అన్నాడు—కపి రాజ్! ఈరోజున ఈచూడామణిని పొందడంచేత సాక్షాత్తు సీతమ్మను పొందినట్లుగా నాకు ప్రసన్నత కలుగుతున్నది. సుగ్రీవా! ఈరత్నం సముద్రాన్నుంచి వెలువడింది. దేవతలు దీన్ని విదేహరాజుకు

ఇచ్చారు. ఈ చూడామణి సీతమ్మకు శిరోభూషణంగా వున్నప్పుడు ఎన్నోసార్లు స్పర్శించాను. కాని ఈరోజు దీన్ని సీతనుండి వేరుగా స్పర్శించవలసివచ్చింది. అని అంటూ మూర్ఛితుడైనాడు. సుగ్రీవుడు— రాఘవా! సీతమ్మజాడ తెలియక ఇంతవరకు చింతించాము. కాని ఇప్పుడు సీతమ్మ జాడ తెలిసింది. మేము అసంఖ్యాకంగా వానరులం వున్నాం గదా. మేమంతావెళ్ళి లంకనుచుట్టుముట్టి సీతమ్మను తీసుకొని వస్తాము, అని ఓదార్చి ధైర్యంచెప్పాడు.

ఇదివిని శ్రీరాముడు విలపిస్తూ — ఈ దుష్కరమైన కార్యాన్ని హనుమ చేశాడు. హనుమ తప్ప దేవతలు, యక్షులు, గంధర్వులు మొదలగువారెవ్వరూ ఈకార్యాన్ని సాధించలేరు. శతయోజన సముద్రాన్ని దాటేశక్తి గరుత్మంతునికి, హనుమకు, వాయుదేవునకు మాత్రమేవుంది. సీతజాడ తెలుసుకుని వచ్చాక హనుమ నన్ను కొనేశాడు. ఋణగ్రస్తునిగా చేశాడు. అతనికి నేను ఎన్నటికీ ఋణపడే వుంటాను. ఉపకారం చేసినవానికి ఎప్పుడైనా ముప్పువస్తే ప్రత్యుపకారం చేయవలసిన అవసరంఏర్పడుతుంది. హనుమకు ఏదైనా ముప్పురావాలని నేనుకోరడంలేదు. అతనిఉపకారాలు నాపైన ఎప్పుడూ వుండుగాక. అతని ఋణాన్నుంచి నేను ఎన్నటికీ ఋణరహితుణ్ణి కాజాలను, అని అన్నాడు.

భగవంతుని మాటలను బద్ధహస్తుడై, తలవంచుకొని మిక్కిలి సంకుచితుడై కన్నీటితో హనుమ వింటూవున్నాడు.

భగవాన్– హనుమ నిజంగా సీతమ్మజాడ తెలుసుకొని నా ప్రాణాలను కాపాడాడు. అతను నన్నేకాదు, మా లక్ష్మణ, భరత, శతృఘ్నులను, మా తల్లులను అందర్నీ రక్షించాడు. అతను చేసిన ఉపకారానికి ఏమి బహుమానమిచ్చినా సరిపోదు. అయినా ఇవ్వడానికి నాదగ్గరఏముంది? ప్రస్తుతం నా దగ్గర ఒక కౌగలింతమాత్రమేవుంది. నేను ఇతనికి నా ప్రగాఢమైన కౌగలింత నిస్తాను అని శ్రీరాముడు హనుమను గట్టిగాతనగుండెకు హత్తుకున్నాడు. శ్రీరామునిసుఖప్రదమైన, త్రితాపములను హరించు ఆలింగనమును పొంది హనుమ తనకు సర్వమూ లభించినట్లుగా మురిసిపోయినాడు.

తరువాత సైన్యసన్నాహాలు జరిగాయి. సైనికులంతా సముద్రపు ఒడ్డుకి చేరారు. ఈ సైన్యమంతా సముద్రాన్ని దాటిఎలా వెళ్ళడం అని దిగులు కలిగింది. ఆదేసమయంలో విభీషణుడు వచ్చి భగవానుని ఆశ్రయించాడు. విభీషణుడు చెప్పగా భగవాన్ సముద్రుణ్ణి ప్రార్థించాడు. సముద్రుడు సేతువుని నిర్మించమని సలహా ఇచ్చాడు. వానరులు సముద్రం పైన సేతువుని నిర్మించ నారంభించారు. నల-నీలులకు వారు చేతులతో వేసిన రాళ్లు మునగవు, అని మహర్షులశాపంవుంది. సముద్రుని ద్వారా ఈవిషయం తెలుసుకొని భగవాన్ నల - నీలులను వంతెనకట్టమని ఆదేశించాడు. హనుమ అందరికి మేటిగావుండి పనులు చేయిస్తున్నాడు. వానరులందరూ మిక్కిలి ఉత్సాహంతో పర్వతాలనూ చెట్లనూ తీసుకొనివచ్చి

సముద్రంలో వస్తున్నారు. పని చేయునపుడు వినోదంగా వుంటే పని చురుకుగా సాగుతుంది. వానరులు తమచాంచల్యాన్ని చూపేవారు. రాళ్ళను తెచ్చి ఎత్తుమీదినుంచి సముద్రంలోకి విసిరే వారు. సముద్రంలోని నీరు చిందేది, చాలామంది వానరులు తడిసిపోయే వారు. ఇతరులు వారిని చూచి నవ్వుతుండేవారు. అప్పుడు హనుమవారిని మందలించి సోదరులారా? మీరు మీస్వభావగత చాపల్యాన్ని చూపకండి. మెల్లగా రాళ్ళను తీసి కొని వచ్చి వుంచండి. పనిచేయునప్పుడు ఎక్కువగా వేళాకోళం పనికి రాదు. వంతెన నిర్మాణ కార్యక్రమాన్ని ముందు కొనసాగనివ్వండి. తరువాత మీరు ఇష్టం వచ్చినట్లు ఆడుకొందురు గాక అనేవాడు.

ఈవిధంగా హనుమ పర్యవేక్షణలో సేతునిర్మాణ కార్యక్రమం సాగసాగింది.



# 10

ధర్మం భజస్వసతతం ప్రాణిహింసాంపరిత్యజ।
సేవస్వ సాధుపురుషాన్ జహి సర్వేంద్రియాణిచ॥
పరిత్యజస్వ సతత మన్యేషాం దోషకీర్తనం।
శివ విష్ణ్వాది దేవానాం సేవాంకురు సదాకపే॥ *

భగవంతుడు ఎల్లప్పుడూ భక్తులకు హితము చేయుటకు తత్పరుడై వుంటాడు. ఆయన భక్తులలో ఏవిధమైనదోషాన్ని ఉండనీయడు, ఆయన తన భక్తుల కొన్ని కోరికలను పూర్తి చేసి, కొన్నిటిని నచ్చజెప్పి, కొన్నిటిని చూపించి, పూర్తిగ నశింపజేస్తాడు. ఇందుకే ఆయనను భక్తానుగ్రహకాతరుడు అని అంటారు.

సముద్రపు ఒడ్డుకి వానరసైన్యం చేరింది. విభీషణుడు శ్రీరాముని చరణములను ఆశ్రయించాడు. విభీషణుని సలహా ననుసరించి శ్రీరాముడు సముద్రుని ప్రార్థించాడు. కాని ఆయన రాలేదు. శ్రీరాముడు బాణాన్ని సంధించేసరికి

---

* శ్రీరాముడు హనుమకు - ఒకదేవతాన్ని ఆచరించు, ప్రాణులను హింసించకు, సాధువులను సేవించు, ఇంద్రియము లనన్నింటినీ వశం చేసుకో. ఇతరుల దోషాలను కీర్తించుట మానుము. శివ విష్ణువు మొదలగు దేవతలను పూజించుము, అని ఉపదేశించాడు.

సముద్రుడు భయభీతుడై ప్రభువుని శరణు వేడుకున్నాడు. ఆయన సలహాపైన నల–నీల వానరులద్వారా సముద్రం పైన సేతునిర్మాణకార్యక్రమం కొనసాగుతున్న. వానరులు మిక్కిలి ఉత్సాహంతో వున్నాడు. తమలో తాము పందెములు వేసుకుంటూ ఒకరికంటే ఒకరు ముందుకు వెళ్ళడానికి ప్రయత్నిస్తున్నారు. తొలిరోజున 14 యోజనాల వంతెన నిర్మించారు. హనుమ – సోదరులారా? ఇలా అయితే ఎలా? ఇంకా శ్రమచేయాలి, వానరులు ఇంకా ఉత్సాహాన్ని చూపారు. రెండవరోజున 20 యోజనముల వంతెన నిర్మించారు. హనుమ – సోదరులారా? శ్రమచేశారు కాని కొద్దిగా మిగిలి పోయింది. ఇంకా కొంచెం సాహసాన్ని చూపండి. ఇందుకు వానరులు ఉదయమేలేచి మూడవరోజున 21 యోజనాల వంతెన నిర్మించారు. హనుమ – సోదరులారా! ఇంకొంచెం కష్టపడండి, అని అన్నాడు. అప్పుడు నాల్గవరోజున 22 యోజనాల వంతెన నిర్మించారు. ఐదవరోజున హనుమ – ఏమైనాసరే, ఈరోజు వంతెన పూర్తికావాలి, అని పలుకగా వానరులు తమ పూర్తిబలాన్ని చూపి 23 యోజనాల వంతెన నిర్మించారు. ఈవిధంగా సేతు నిర్మాణ కార్యక్రమం నెరవేరింది.

సముద్రంపైన సేతువునిచూచి శ్రీరాముడు ప్రసన్నుడై అందరితో అన్నాడు – శతయోజనాల పొడవు, పది యోజనాల వెడల్పుగల సముద్రంపైన సేతువుని నిర్మించ

దాన్ని చూచి నేనుమిక్కిలి సంతసించుచున్నాను. ఈవంతెనను ప్రారంభించడానికి ముందుగా భగవాన్ శంకరుని స్థాపించాలని నాఅభిప్రాయం. మీరందరూ ఏమంటారు?

అందరూ ఒక్కుమ్మడిగా - ప్రభో! శివుని ప్రతిష్ట చాలా పవిత్రమైనది. శివుని ప్రతిష్ఠవలన జగత్తునకు ఎంతో ఉపకారం కలుగుతుంది. శివునిదర్శించి ప్రజలు ఈభవ సాగరాన్నుంచి తరిస్తారు. ఆలస్యం చేయరాదు, అని. అన్నారు.

అందరి సలహాపైన శ్రీరాముడు చాలామంది మహర్షులను పిలిపించి ప్రార్థించాడు – మహర్షుల్లారా ఇక్కడ ఒక శివలింగాన్ని ప్రతిష్టించాలని నాకోరిక. మీలో కర్మకాండలోనిష్ణాతులైనవారు ఈకార్యక్రమాన్ని నెరవేర్చండి.

**మహర్షులు** – భగవన్! కర్మకాండలో చాలామంది పండితులున్నారుకాని ఈప్రతిష్ఠా కార్యక్రమాన్ని లంకేశ్వరుడైన రావణునిచేత చేయించితే బాగుంటుంది, అని అన్నారు

శ్రీరాముడు - మునులారా! రావణునకు నాకు బద్ధవైరమున్నదిగదా? ఆయన నా ఈ కార్యక్రమానికి ఎందుకు వస్తాడు?

మునులు - వైరంవేరు, ప్రతిష్ఠా కార్యక్రమంవేరు. శత్రువైనా, మిత్రుడైనా, ఉన్నత కుటుంబీకుడైనా, నిమ్న

కుటుంబీకుడైనా, రోగి చూడమనివస్తే చూడడం వైద్యుని ధర్మంకదా. ఏవిధమైన భేదభావం లేకుండా వారి ఇంటికి వెళ్లాలి. ఈవిధంగానే ప్రతిష్ఠకొరకు కర్మకాండ చేయించేవ్యక్తి ఖాళీగావుంటే వస్తాడు, శివుని ప్రతిష్ఠ చాలా పవిత్రమైనది. రావణుడు శివభక్తుడు. మీరు కబురు చేయగానే వస్తాడు.

శ్రీరాముడు విభీషణు' సలహాతో ఒకవ్యక్తిని రావణుని దగ్గరకు పంపాడు, శివుని ప్రతిష్ఠవిని రావణుడు తన

---

## సూచన

పేజీల సంఖ్యలో పొరపాటులున్నవి. వాటిని దృష్టిలో పెట్టుకొనకుండ అధ్యాయములు వరుసగ చదువుకొన ప్రార్థన.

---

శివుని ప్రతిష్ఠ జరగాలి. శ్రీరాముడు - ఓ ఆచార్యప్రవరా! హనుమ కాశీనుంచి శివలింగాన్ని తీసుకొనిరాలేదు ఇప్పుడు ఏం చేయాలి?

ఆచార్యుడు - ప్రతిష్ఠ ఈ సమయంలో జరిగిపోవాలి. అయితే ఒకపని చేయండి. సీతమ్మను స్వయంగా సైకత శివలింగాన్ని చేయమనండి. దాన్ని ప్రతిష్ఠించుదాం.

ఆచార్యుని ఆదేశాన్ననుసరించి శ్రీరాముడు అలాగే చేశాడు. సీతమ్మ సైకతలింగాన్ని చేసింది. శ్రీరాముడు యథావిధిగా ప్రతిష్ఠ చేశాడు.

ఇంతలో కాశీనుంచి హనుమాన్ శివలింగాన్ని తీసుకొని వచ్చాడు. శివునిప్రతిష్ఠ జరిగిపోయింది. తనుతీసుకొనివచ్చిన శివలింగం వ్యర్థమయిందని, తనకు కీర్తి లభించలేదని దుఃఖితుడై శ్రీరామునితో రామా? నేను నా సంపూర్ణజీవితాన్ని మీ సేవకి అర్పించాను. మీకు సేవచేయటమే నాలక్ష్యము. ప్రస్తుతం మీకు నాసేవ అంగీకారంగా లేవనిపిస్తున్నది. సేవకుని సేవను స్వీకరించనప్పుడు అతని జీవితం వ్యర్థమవుతుంది. నేను జీవించుటవలన ఏమీ లాభంలేదు. గనుక ప్రాణాలను వదులుతాను, అని అన్నాడు.

శ్రీరాముడు - నాయనా? సేవకుని పని స్వామి ఆదేశాన్ని పాటించటమే, దానికి ప్రయోజనమేమైనావున్నదా లేదా అనే విషయాన్ని స్వామి నిర్ణయిస్తాడు.

హనుమ — మహారాజ్? అయినా అందరికీ తాముచేసిన పనికి ఫలితం లభించాలని కోరిక వుంటుందిగదా? కార్య సఫలత దాని సద్వినియోగంపైన ఆధారపడివుంటుంది.

భగవాన్ — చూడు నాయనా? మనంచేసిన పనికి మనకు గొప్పకీర్తి లభించాలి అనే భావనగూడా దేహాభిమానానికి సూక్ష్మరూపమే. అయితే ఒకపనిచెయ్యి. నీవు మహాబలవంతుడివిగదా. అన్ని శాస్త్రాలలో పండితుడివి, ఈ శివలింగాన్ని తీసి నీవు తీసుకొనివచ్చిన శివలింగాన్ని ప్రతిష్ఠించు. నాకు ఏవిధమైన అభ్యంతరమూలేదు.

అప్పుడు హనుమ తనతోకకి శివలింగాన్ని చుట్టి తీయడానికి ప్రయత్నించాడు. కాని లింగం కొంచెంగూడా కదలలేదు. హనుమ ఎంతగానో దుఃఖించాడు, శ్రీరాముడు మెల్లగా ఇలా నచ్చచెప్పాడు. హనుమా? నాకు మూడుకాలాల విషయాలు తెలుసు. ఈజీవుడు కర్మలకి అధీనుడై జన్మిస్తూ మరణిస్తూ వుంటాడు. ప్రారబ్ధానికి బద్ధుడై స్వర్గ నరకాలకు. వెళ్తుతాడు. ఈప్రాపంచిక పేరు ప్రతిష్ఠలు అసత్యములైనవి. అశాశ్వతములైనవి. నీవు మాన మర్యాదలకు లోనుగాకు సచ్చిదానంద స్వరూపమైన స్వయంప్రకాశమైన ఆత్మయందు రమించు.

హనుమ-అయితే ప్రభో? మాకర్తవ్యమేమిటి? మేము ఏమిచేయాలి? ఏమి చేయకూడదు?

అప్పుడుభగవాన్—నీవుఈకార్యములను చేయువచ్చును.

1 – ధర్మమే అన్నిటిని ధరించివుంది. ధర్మాన్ని రక్షించినవారిని ఆరక్షిత ధర్మము రక్షిస్తుందికూడాను. ఇందు చేత ఎన్నడూ స్వధర్మాన్ని విడువరాదు, నిరంతరమూ ధర్మాన్నే ఆచరించాలి, అనుష్ఠించాలి.

2 – ఇతరులను హింసించడమే మహాపాపం. దేహాదులందు మమకారమున్నవారే హింసిస్తారు. గాన దేహాదులందు మమకారాన్ని పెంచుకొనరాదు. ఏప్రాణిని ఎట్టిస్థితిలోనూ కష్టపెట్టరాదు.

3 – సాంసారిక పురుషులతో సహవాసంచేయడంచేత సంసారబంధం ప్రబలమవుతుంది. సాధువులదగ్గర ఎల్లప్పుడూ భాగవత కథలు వినబడుతాయి. గాన వాటివలన సాంసారిక బంధనములు ఛిన్నాభిన్నమైపోతాయి. ఇందుకుగాను ఎల్ల వేళలా సాధుసజ్జన పురుషులను సేవించాలి.

4 – ఈ ఇంద్రియాలే మనలను చెడుమార్గంవైపు తీసుకొనివెళ్లుతాయి. సాంసారికవిషయాలవైపుకి ఆకర్షిస్తాయి గనుక ఇంద్రియములను వశపరచుకోవాలి.

5 – తెల్లనివస్త్రంపైన ఎలాంటి రంగువేస్తే అలాగే కనిపిస్తుంది. నీవు ఇతరుల దోషాలను తలుస్తూవుంటే వాటి ప్రభావం నీమనస్సుపైన గూడా పడుతుంది. గాన ఇతరుల దోషచింతనకు దూరముగావుండు.

6 - మానవుడు ఎవరిని సేవిస్తాడో, పూజిస్తాడో వారి గుణాలు అతనికి అబ్బుతాయి. శ్రద్ధకలిగినవాడికే జ్ఞానం కలుగుతుంది, గాన శ్రద్ధగా భక్తితో శివునిగాని. విష్ణువునిగాని నిత్యమూ నియమంగా పూజించు.

7 - అసత్యమే మనలను అధర్మంవైపు తీసుకొని వెళుతుంది, సత్యమును మించిన ధర్మమేలేదు, గాన నిరంతరమూ సత్యమునే పలుకుము.

8 - మానవుడు ప్రాపంచిక విషయాలకి లోనై నాకు ఇది లభించలేదు, అదిలభించలేదు, అని దుఃఖిస్తాడు. విషయములను ధ్యానిస్తూవుండడంచేత మనస్సు విషయాలకు వశమవుతుంది. విషయములను చింతించుట చేత అశాంతి కలుగుతుంది. గాన విషయచింతన వదలి నిరంతరమూ జీవాత్మ పరమాత్మల కలయికగురించి ఆలోచించు.

అప్పుడు హనుమాన్ - ప్రభో? మాకు మా ఎదుట ప్రత్యక్షంగా కనబడుతున్న ఈ ప్రపంచమే సత్యంగా భాసిస్తున్నది, అని అన్నాడు.

భగవాన్– నిజానికి ఈ జగత్తు నీకు భాసిస్తున్నట్లుగా లేదు. ఇదంతా భ్రమ. భ్రమచేత సర్పం కాక పోయినప్పటికీ రజ్జువు నందు సర్పభ్రమ కలుగుతుంది. వెండి కాక పోయినా ముత్యపు చిప్పలో వెండి ఉన్నట్లు భ్రమకలుగుతుంది. ఈ భ్రమ మోహం చేత కలుగుతుంది.

హనుమాన్ – ప్రభో! ఈ జీవుడు నానా యోనులందు ఎందుకు సంచరించుతాడు?

భగవాన్–నాయనా? ఇందుకు మూలకారణం భ్రమే. భ్రాంత పురుషునకు వివిధ విషయములందు అనురాగ మేర్పడుతుంది. ఒకరిపట్ల ద్వేషమేర్పడడం సహజమేగదా. ద్వంద్వమంటేనే సంసారముగదా. ఈ రాగద్వేషాలకువశీభూతుడై ధర్మాధర్మాల సుడిగుండంలోచిక్కుకొనిపోతూ వుంటాడు. ఇందువలన ధర్మానికి ఉన్నతయోని అధర్మానికి నిమ్న యోని లభిస్తుంది. జీవుడు ఒకప్పుడు స్వర్గంలోకివెళతాడు.

హనుమాన్ – ప్రభో! జీవుడు ఈ శరీరంతో సుఖాన్ని ఎలా పొందగలడు?

భగవాన్–నాయనా? అల్పంలోలేదు.సుఖంలేనేలేదు సుఖంపూర్ణంలోనేవుంది. అనిత్యంలో సుఖంలేదు. నిత్యంలోనే సుఖంవుంది. ఈ దేహం అనిత్యమైనది. నీవే ఆలోచించు, ఈశరీరం దుఃఖాలయము, అశాశ్వతమైనది. దోషభూయిష్ఠమైనది. ఈ శరీరానికి చందన, అగరు, పన్నీరు, కస్తూరి మొదలగు సుగంధిత వస్తువులను ఉపయోగించుతాముకాని, శరీర సంపర్కం కలిగినవెంటనే అవిగూడా దుర్గంధంగా మారిపోతాయి. కమలా ఫలాలు, ద్రాక్ష ఎంతో సుగంధంగా వుంటాయి, కాని శరీరస్పర్శ కలుగగానే దుర్గంధపూరితమైన విష్ఠగా మారిపోతాయి. వట్టివేళ్లు, మొగలి, గులాబీజలం

ఎంతో సువాసనగా వుంటుంది కాని శరీరస్పర్శకి దుర్గంధిత మైన మూత్రంగా మారిపోతుంది. అత్తరు, పన్నీరు చల్లిన, తెల్లగావున్న వస్త్రాలైనా శరీరంలోని చెమటకి దుర్వాసన చెందుతాయి. నాయనా? నీవే ఆలోచించు. ఏశరీర సంపర్కంచేత మంచివస్తువులు గూడా చెడ్డగా మారిపోతాయో సుగంధిత పదార్థాలుగూడా దుర్గంధితంగా మారిపోతాయో, స్వచ్ఛవస్తువులు గూడా మలినమవుతాయో, అట్టి శరీరం వలన సుఖం కలుగుతుందని ఎలా వూహించ గలవు? దేహధ్యాసయే బంధనానికిమూలకారణము. శరీరంలో సుఖంలేదు. శరీరంతో బాలకుడు గాను, యువకుడుగాను, వృద్ధుడుగాను, చివరికి మృత్యువునిపొంది తిరిగి జన్మించడం ఇవన్నీ శరీర ధర్మాలు. మనం అజ్ఞానంచేత ఇతరులను శత్రుమిత్రులుగా భావిస్తాము. ఆత్మ ఒక్కటే అయినా బహు రూపాలు కలిగివున్నది. ఒకప్పుడు స్త్రీగానూ, మరిఒకప్పుడు యాత్రికుడుగానూ, ఇంకొకప్పుడు రాజ్యాధికారిగానూ వుంటుంది. దాని యథార్థ స్వరూపాన్ని గుర్తించనివారు భ్రమకి లోనౌతారు. ఒకేవ్యక్తి నానారూపాలను ధరించి మానవులను భ్రమింపచేస్తున్నారన్న రహస్యాన్ని గుర్తించిన వారు భ్రమకి లోనుగారు. అట్టివారు దానిని ఒకేరూపంలోచూస్తారు. విభిన్న రూపాలలో చేసిన వారి విభిన్నమైన పనులు ఒకేవిధంగా కనుపిస్తాయి. ఇందుకుగాను ఓకపీశ్వరా? నీవు ద్వైధీభావాన్ని వదలి అంతా ఆత్మవిస్తారమే అని భావించు. ఈ శివలింగాన్ని నేనుతీసుకొని వచ్చాను. ఈ ప్రతిష్ఠ జరుగలేదని దుఃఖించవద్దు.

హనుమ – ప్రభో! నాకు కల్గిన భ్రమ తొలగిపోయింది. అయితే తమరు ఆదేశించినట్లు చేస్తాను, ఈశివలింగాన్ని ఏమి చేయమంటారు?

భగవాన్ –మేము ప్రతిష్ఠించిన శివలింగం ప్రక్కనే ఈ లింగాన్ని ప్రతిష్ఠించు. ఇది హనుమతేశ్వరుని పేరున ప్రసిద్ధి చెందుతుంది. రామేశ్వరుని తీర్థయాత్రకు వచ్చినవారు హనుమతేశ్వరునిగూడా దర్శించి యాత్రాఫలితాన్ని పొందుతారు.

భగవంతుని ఆదేశాన్ని అనుసరించి హనుమాన్ ఆ శివలింగ ప్రతిష్ఠ జేశాడు. ఆ శివలింగం ఇప్పుడు గూడా రామేశ్వర మందిరంలో శ్రీ రామేశ్వరునితో సమానంగా వుంది. యాత్రికులు ఆ లింగాన్ని దర్శించి శ్రీరామునకు మిక్కిలి ప్రియుడైన హనుమంతుని అనుగ్రహానికి పాత్రులవుతారు.

ఈ విధంగా శ్రీ హనుమాన్ హనుమతేశ్వరుని ప్రతిష్ఠ, శ్రీరాముడు రామేశ్వరుని ప్రతిష్ఠ జరిపారు. తరువాత శివుని పూజించి వానరసైన్యమంతా లంకకి చేరింది.

శ్రీరామ జయరామ జయ జయ రామ

# సంజీవనీ ఆహర్తా హనుమాన్

# 11

కృతం హనుమతా కార్యం సుమహద్భువిదుర్లభమ్
మనసాపి యదన్యేనస్మర్తుంశక్యం నభూతలే ॥ *

స్వామికార్యాన్ని చేయడం నిజమైన సేవకులు తమ సౌభాగ్యంగా భావిస్తారు. స్వామిసేవ చేయడంలో పరమానందానుభూతి కలుగని సేవకులు సేవకులుకారు. జీతంతీసుకునే దాసులుమాత్రమే. సేవకునకు దాసునకు కొంతతేడావుంటుంది. దాసుడు స్వార్థబుద్ధితో సేవచేస్తాడు, కాని సేవకునకు సేవ చేయడానికి అవకాశంలభిస్తేచాలు. అట్టివానికి సేవచేయడంలో ఒక అపూర్వమైన ఆనందానుభూతి కలుగుతుంది.

సేతువుద్వారా వానర సైన్యం లంకలోకి ప్రవేశించింది. ముందు అంగదుణ్ణి సంధిదూతగా పంపారు. కాని రావణుడు అంగీకరించలేదు. యుద్ధం ప్రారంభమయింది. ప్రధాన సేనాపతులందరు తమకు సరియగు వారితో యుద్ధం చేస్తున్నారు. రావణపుత్రుడైన ఇంద్రజిత్తును అంగదుడు ఎదుర్కొన్నాడు. వారిరువురిమధ్య భయంకర యుద్ధం సాగింది.

---

* శ్రీరాముడు అన్నాడు - హనుమ చాలా గొప్ప పని చేశాడు. భూమిపైన ఇంత గొప్పపనిచేయడం చాలా కష్టమైనది. భూమండలంలో ఇతరులెవ్వరూ మనస్సుతో కూడా ఇంతటి కార్యాన్ని వూహించలేరు.

ఇంద్రజిత్తు ఆలోచించాడు — ఈ అల్ప వీర్యులగు వానరులతో యుద్ధంచేయడందేనికి? రామలక్ష్మణులను చంపిన యెడల యుద్ధమే సమాప్తమవుతుందిగదా, అని అనుకొని ప్రత్యక్ష యుద్ధాన్ని విరమించుకొని రాక్షసమాయను ఆశ్రయించి ఆకాశంలో దాగివుండి బాణవర్షం కురిపించాడు. అతనిబాణాలు వీరులకు తగులుతున్నాయి కాని అతడుమాత్రం కనుపించడంలేదు. రామ లక్ష్మణులను దృష్టిలో పెట్టుకొని బాణాలవర్షం కురిపించాడు. అవయవాలన్నీ బాణాలతో నిండి పోయాయి. బాణాలు తగలనిచోటుఅంటూ ఎక్కడాలేదు. ఇన్ని బాణాలు తగలడంచేత శ్రీరాముడు మూర్ఛనునటించాడు. లక్ష్మణుడుకూడా మూర్ఛితుడైనాడు. ఇంద్రజిత్తు వారిని నాగపాశంచేత బంధించి బిగ్గరగా గర్జిస్తూ తండ్రిగారిదగ్గరకు వెళ్ళి — నాన్నగారూ, నేను మీశత్రువులను చంపి వచ్చాను, అనిఅన్నాడు. రావణుడు మిక్కిలిసంతసించి అతనిని ఎన్నో విధాల ఆశీర్వదించాడు.

శ్రీరామ లక్ష్మణులను మూర్ఛితులవడంచూచి హనుమ, నల, నీల మయేన్ద్ర, ద్వివిదాది ముఖ్యవానరులు వారిచుట్టూ చేరి కూర్చున్నారు. సుగ్రీవుడు శోకవిహ్వలుడైనాడు. అతనిని చూచి మిగతా వానరులుకూడా దుఃఖితులైనారు.

ఇంతలో విభీషణుడువచ్చి అందరికి ధైర్యం చెప్పాడు. శ్రీరామ లక్ష్మణులు జీవించేవున్నారు. వారు నరరూపంలో నటన చేస్తున్నారు.



ఇదంతా రాక్షసమాయ, నాకుఈమాయతెలుసు కొద్ది క్షణాలలో వీరు మేల్కొంటారు. ముందుగా శ్రీరామునికి తెలివివచ్చింది.

లక్ష్మణునికి తెలివిరాలేదు. శ్రీరాముడు కరుణస్వరంతో విలపించసాగాడు. ఆయననుచూచి వానరులందరూ విలపించ సాగారు. ఈవిధంగా అందర్ని విలపిస్తూచూచి సుషేణుడు అనే వానరుడన్నాడు – శ్రీరామా? మీరు దుఃఖించకండి. రెండు ఓషధులున్నాయి, వాటిని తీసుకొనివచ్చినయెడల లక్ష్మణుని మూర్ఛ వెంటనే తొలగిపోతుంది, దేవాసుర సంగ్రామంలో దేవతల గురువు బృహస్పతిని చూచాను. దేవతలు మూర్ఛితు లైనప్పుడు ఆయన విశల్యకరిణీ అనే ఓషధివేసి చికిత్స చేసెడివారు. మృతినొందినవారికి సంజీవనీ మూలికను వాసన చూపించి బ్రితికించేవారు. ఈరెండు ఓషధులను సూర్యో

దయానికి పూర్వమే తెప్పించిన లక్ష్మణుడు వెంటనే మేల్కొంటాడు. ఈఓషధులు మందరాచలంపైననేవున్నాయి. ఎవరైనావెళ్ళి తీసు కొనివస్తే బాగుంటుంది,

సుగ్రీవుడు — పవనతనయుడొక్కడే ఈ పనిని చేయ గలడు. అతనికి బలము, ధైర్యము, సాహసము, ఉత్సాహము అన్ని గుణాలున్నాయి. శ్రీరామునిపట్ల అవిచలభక్తి, శ్రద్ధ అనురాగము కలదు. ఇతను ఈకార్యాన్నిచేసి మన అందరి దుఃఖాన్ని పోగొట్టుతాడు, అని అన్నాడు.

హనుమ—నాకు అసాధ్యమంటూ ఏదీలేదు. శ్రీరాముని అనుగ్రహమంటూవుంటే అన్నిటినీ చేసేస్తాను. అయితే ఒక ఇబ్బందివుంది,

సుషేనుడు—ఏమిటి ఆఇబ్బంది?

హనుమ—ఈరెండు ఓషధులు నాకు తెలియవు. పొరపాటున ఒకదానికిబదులు ఇంకొకటి తీసుకొనివస్తే ఇబ్బంది కలుగుతుందిగదా?

సుషేనుడు—ఇందులో గుర్తించడానికి ఏముందయ్యా? నీవు మందరాచలంపైకివెళ్లు, అక్కడఈఓషధులు అగ్నిజ్వాలలు మాదిరి వెలుగుతూ వుంటాయి. వాటిని తీసుకొనిరా.

హనుమ—అయితే, ఈ ఓషధులు ఎప్పుడూ వెలుగుతూ వుంటాయా?

సుషేణుడు - అవును, వెలుగుతూనేవుంటాయి. దురాచారులకు, పాపాత్ములకు, కలియుగ పురుషులకు అవి కనుపించవు. నీవు సదాచార సంపన్నుడవు, శ్రీరాముని సేవకుడవు, శాంతుడవు, తపస్సంపన్నుడవు గనుక అవి నిన్ను చూచి మిక్కిలి మురిసిపోతాయి, మెరిసిపోతాయి.

హనుమ – అయితే, ఇప్పుడే వెళతాను.

సుషేణుడు – నాయనా? సూర్యోదయానికి పూర్వమే రావాలి.

హనుమ – నేను ఇప్పుడే తిరిగివస్తాను, అని ఎగిరి ఒక్క క్షణంలో మందరాచలానికిచేరి చూశాడు. ఓషధులువెలుగుతూ వున్నాయి. కొన్ని బంగారంతో సమానంగా, కొన్ని వెండితో సమానంగా, మరికొన్ని అగ్నిజ్వాలల మాదిరిగా మెరుస్తూ వున్నాయి. ఆదివ్య ఓషధులను చూచి వీనిలో "విశల్యకరణి" ఏదో "సంజీవని" ఏదో నిర్ణయించుకోలేకపోయినాడు. ఒక వేళ తీసుకొనివెళతాను. సుషేణుడు కాదంటాడు. తిరిగివస్తాను, రెండవసారిగూడా సరియైనది దొరకకపోవచ్చు. నిజానికినేను పొరపాటు చేశాను. వైద్యరాజుని వెంట తీసుకొనివచ్చివుంటే. ఈఇబ్బంది వుండేదికాదు. ఆలోచించడానికికూడా వ్యవధిలేదు. సూర్యోదయం కానున్నది, గాన ఈపర్వతాన్నే తీసుకొని వెళతాను. సుషేణుడు స్వయంగా తనకుకావలసిన ఓషధులను

ఉపయోగించుకుంటాడు - అని ఆ పర్వతాన్ని తీసుకొని అయోధ్యామీదుగా వస్తూవున్నాడు.

శ్రీరాముని వియోగంలో భరతునికి నిద్రపట్టక రాత్రిలందు జాగరణచేస్తూ గడుపుతున్నాడు. రాత్రి 12 గంటలకు మేల్కొని నిత్యకర్మచేసుకొని శ్రీరాముని పాదుకలసేవలో నిమగ్నతజెందేవాడు. రావణుడు సీతను అపహరించి తీసుకొనివెళ్ళాడు. శ్రీరాముడు వానరసైన్యంతో లంకకివెళ్ళి, రాక్షసులతో యుద్ధంచేస్తున్నాడు అనివిన్నాడు. భరతునికిగూడా సైన్యసమేతుడై యుద్ధానికివెళ్లాలని కోరిక వుండేది. కాని శ్రీరాముని ఆజ్ఞలభించలేదు. సేవకునిధర్మం మిక్కిలి కఠినమైనది. అడుగు-అడుగునా స్వామిఆదేశానికై వేచివుండవలసివుంటుంది. భరతుడు అర్ధరాత్రివేళలేచి నిత్య కర్మ చేసుకోవడానికి వెళుతూవున్నాడు. అదేసమయంలో ఆకాశంలో ఎవరో పర్వతాన్ని తీసుకొని వెళ్ళడంచూచి అనుకున్నాడు- వీడు ఎవడో రాక్షసుడు వానరసైన్యంపైన పర్వతాన్ని వేయడానికి వెళ్లుతున్నాడు, అని పదునులేని ఒక బాణాన్నివేశాడు. బాణంతగులగానే హనుమ పర్వతంతోపాటు భూమిమీదపడ్డాడు. పర్వతాన్ని పడిపోకుండా జాగ్రత్తగా పట్టుకున్నాడు, బిగ్గరగా శ్రీసీతారాం అని నామోచ్చారణ చేస్తున్నాడు.

శ్రీరాముని పావననామ సంకీర్తనముచే ప్రతిరోమము పులకితమయినది. ఆయన తనలో అనుకున్నాడు - అరెరె,

పెద్ద పొరపాటై పోయింది. ఇతడు చూడగా రామభక్తుడుగా వున్నాడు, అని అతనిదగ్గరకువెళ్లి – సోదరా! నీవుఎవరివి?

హనుమ — సోదరా? నేను పవనకుమారుడిని, నాపేరు హనుమాన్. శ్రీరాముని సేవకుడను, ప్రస్తుతం నేనుఎక్కడ వున్నాను. నన్నుపడగొట్టినవారెవరు?

సోదరా! నీవు అయోధ్యానగరంలో వున్నావు, అని అన్నాడు.

అయోధ్య పేరువినగానే హనుమ వులిక్కిపడి అయితే నేను నాస్వామిపురికి చేరానన్నమాట. తపస్వివేషంలోవున్న మీరు ఎవరండీ? నాస్వామి మాదిరిగా వున్నారు. నాస్వామి అనుజులైన భరతులవారు కాదుగదా?

తనపేరువినగానె భరతుడు హనుమకి నమస్కరించ బోయాడు. హనుమ ఆయనను కౌగలించుకొని – ఇదేమిటి మీరుచేస్తున్నది. నన్ను ఆశీర్వదించండి. తమపరిచయం!

ఏడుస్తూ భరతుడు – ఓ కపిరాజా?

ఆమందభాగ్యుడను నేనే, శ్రీరామునకు ఏవిధంగానూ సహాయం చేయడంలేదు. నావల్లనే వారు అడవికివెళ్ళారు. వారు అడవికి వెళ్ళకుండావుంటే సీతాపహరణ జరిగేదికాదు. యుద్ధమూ జరిగేదికాదు. యుద్ధంలో సహాయంచేయకపోగా శ్రీరాముని కార్యానికి అంతరాయాన్ని కలుగచేస్తున్నాను.

నాయనా! నీవు ధన్యుడవు. అన్నివిధాల శ్రీరామునకు ఉపకరిస్తున్నావు. అయితే నాపేరు ఎలాతెలుసు? శ్రీరాముడు ఎప్పుడైనా నన్ను స్మరించుతున్నాడా?

హనుమ, దుఃఖంతో - మీరుధన్యులు. మీశీలసంకోచిత గాధను గురించి విన్నదానికంటే వందరెట్లు ఎక్కువగా కనుపిస్తున్నారు. అయ్యా? ఏమనిచెప్పను? శేషనాగుని మాదిరి రెండు నాలుకలున్నా మీపట్లగల శ్రీరాముని ప్రేమనువర్ణించ లేను. మీరు స్మరిస్తున్నారా? అని అంటున్నారు. వారు అహర్నిశలు మీగురించి అనుకొంటూవుంటావుంటారు. ఆయనకి వనవాస దుఃఖమూలేదు, సీతాహరణ చింతకూడాలేదు. ఎల్లప్పుడూ మిమ్ములను తలచుకొని ఆయన నాసోదరుడు భరతుడు నాగురించి ఎంతో తపస్సు చేస్తున్నాడు. మీ గుణాలను వింటున్నప్పుడు మిమ్ములను చూడాలని కోరికవుండేది. శ్రీరాముడు నా ఈ కోరికను నేడు ఈవిధంగా నెరవేర్చాడు. నేడు నా జీవితం సఫలమయింది. నా రామభక్తి సార్ధక్యమ యిందిప్రభో? నాస్వామికి అనుజులవడంచేత నాకూస్వాములే,

భరతుడు - నాయనా? యుద్ధాన్ని గురించి వినిపించు శ్రీరాముడు, లక్ష్మణుడు కుశలమేనా? యుద్ధంలో ఎవరి పక్షం పై చేయిగావుంది. యుద్ధంలో శ్రీరాముని ఎవరూ ఓడించలేరని నాకు నమ్మకంవుండనే వుంది.

హనుమ-అందరూక్షేమమే. రావణపుత్రుడు ఇంద్రజిత్తు

తన మాయచేత లక్ష్మణకుమారునికి స్పృహలేకుండా చేశాడు. ఆయనకొరకే సంజీవనీమూలికను తీసుకొనిరమ్మనమన్నారు. మూలిక తెలియక పర్వతాన్నే తీసుకొనిపోతున్నాను.

భరతుడు — పవనకుమారా? పొరపాటైపోయింది. నిన్ను శ్రీరాముని సేవకునిగా భావించలేదు. పరిచయం లభించాక ఏదో దుఃఖిస్తూ, ఏదో సందేహము కలుగుతున్నది.

హనుమ — ఏమిటి సందేహం?

భరతుడు — హనుమా? చూడు, రాముని సేవకునకు ఎన్నటికీ పరాజయమంటూ వుండదుగదా. మరినీవు వధును లేని బాణానికి ఎలా పడిపోయావు?

హనుమ —ప్రభూ? మీరు యథార్థమే పలుకుతున్నారు. శ్రీరాముని సేవకుణి శ్రీరాముడు తప్ప మరెవ్వరూ పడగొట్టలేరు. కాని భగవాన్ తన భక్తులను ఎల్లప్పుడూ పవిత్రంగా వుంచాలని అనుకుంటాడు. భక్తునిమనస్సులో అభిమానం కలుగగానే సేవకధర్మాన్నుంచి భ్రష్టుడైపోతాడు. అభిమానమే భగవంతునికి ఆహారము. ఆయన ఇతరుల అభిమానాన్ని పొందించి నాశనంచేస్తారు. కాని సేవకుని మనస్సులో కలిగిన అభిమానాన్ని ఏదోఒకనెపంతో వెంటనేపోగొట్టుతాడు. ఇది తనసేవకునిపట్లప్పుడు భగవదనుగ్రహం. అతని మనస్సులో తన గొప్పతనంపట్ల, గుణములపట్ల, మంచి కార్యములపట్ల అభిమానంకలుగగానే భగవాన్ అతనిగర్వాన్ని

పూర్తిగా పోగొట్టుతాడు. భగవాన్ నాగర్వాన్ని అణచివేయ డానికే నన్ను ఇక్కడకు పంపాడన్నమాట. మీద్వారా నాకు గర్వభంగం గావించాడు. నామనస్సులోవున్న మాలిన్యాన్ని పోగొట్టి నిర్మలంగాజేశాడు. నాకు బలంపట్ల గర్వమేర్పడింది.

భరతుడు — అదిఎలా? రాముని సేవకునకు గర్వం కలుగదుకదా? అతను గడ్డిపోచకంటే హీనంగానూ, అందరికీ గౌరవాన్నిచ్చి అమానిగా వుంటాడుగదా? అందునా నీవు భక్తాగ్రిణ్యుడవుగదా?

హనుమ — ఇదే ఆదీనబాంధవుని మహత్కృప. యుద్ధ సమయంలో మేము పోరాడుతుంటే రాక్షసులు అస్త్రశస్త్రాల వర్షం కురిపిస్తుంటే శ్రీరాముడు అంటూ వుంటాడు. నాతమ్ముడు భరతుడువుండివుంటే అందర్ని హతమార్చేవాడు. భరతునిఎదుట వీళ్ళంతా గడ్డిపోచలాంటివాళ్లు.

నిరంతరమూ భరతున్ని ప్రశంసవిని మాచెవులు నిండి పోతుంటే ఆలోచించాము మనం ఇంతగా కష్టపడి పోరాడు తున్నాం. అయినా శ్రీరాముడు మనలను పొగడకుండా భరతుని పొగుడుతున్నాడు, కాని ఈకల్మషాన్ని పోగొట్ట టానికే భగవంతుడు నాకు మీదర్శనభాగ్యాన్ని కలుగజేశాడు. నామనస్సు ఇప్పుడు పవిత్రమయింది. భగవాన్ మీగురించి పొగిడినదానికంటే ఎన్నోరెట్లు మీరు ఎక్కువగా కనుపించారు. నాభ్రమ తొలగిపోయింది.

భరతుడు - హనుమా! అయితే నీవుత్వరగా నా సోదరునికొరకు ఓషధిని తీసుకొనివెళ్లు.

ఇంతలో సమాచారాన్నివిని మాతా కౌసల్య, సుమిత్ర అక్కడకువచ్చారు? హనుమ వారికి నమస్కరించాడు. కౌసల్య కోపంతో-హనుమా? లక్ష్మణునకు మూర్ఛవచ్చిందనివిన్నాను. నీవు రామునితోచెప్పు. ఒకవేళ లక్ష్మణునికి ఏమైనాఅయితే అతను నాకు ముఖం చూపించనవసరములేదని, లక్ష్మణుడులేని రాముని చూడగోరడంలేదని, ఇరువురు సోదరులు వెళ్ళినట్లుగా రావాలని, అయోధ్యకు ఒంటరిగా రాముని అవసరంలేదని. చెప్పు.

సుమిత్రి అన్నది-హనుమా? మాఅక్కగారిసందేశాన్ని పొరపాటునగూడా రామునితో చెప్పవద్దు. ఆమె తన పుత్రి వాత్సల్యంచేత అలాఅన్నది, రాముడురాజుగదా. లక్ష్మణుడు ఆయనకు సేవకుడు. చిన్నసైనికుడు, యుద్ధంలో అనేకమంది సైనికులు చనిపోతారు. సేవకునికొరకు స్వామి తనప్రాణాలని వదిలేస్తే ఈపప్రపంచం ఒక్కరోజుకూడాకొనసాగదు. రాముడు యుగ యుగాలదాకా జీవించియుండుగాక. లక్ష్మణునిలాంటి సేవకులంటావా ఆయనకు కోకొల్లలు?

ఇదివిని గద్గద కంఠంతో హనుమ అన్నాడు. అమ్మా ఈమాటలు లక్ష్మణునితల్లికి తగినట్లుగానేవున్నాయి, ఆమాటలు శ్రీరాముని తల్లికి తగినట్లుగా నే వున్నాయి. మీరు ఏమాతృం

విచారించకండి. మీ పుత్రులు క్షేమంగా తిరిగివచ్చి మీపాదా లను స్పర్శిస్తారు. నాకుఆలస్యమవుతున్నది. అక్కడనాకొరకు అందరూ ఎదురుచూస్తూంటారు, నాకు సెలవుఇప్పించండి.

భరతుడు-హనుమా? ఒకవేళనీకుఆలస్యమవుతుందేమో. నాబాణంపైనకూర్చుంటే ఒక్కక్షణంలో లంకకుచేర్చుతాను.

హనుమ - ప్రభూ, ఆశీర్వదించండి. మీఅనుగ్రహం వుంటే మీబాణంతో సమానంగా వెళ్ళిపోతాను, అని అందరికి నమస్కరించి ముందుకుసాగాడు, దారిలో గరుత్మంతుడు హనుమనుచూచి ఆలోచించాడు— నాతోసమానవేగంగా ఈపక్షి ఏదో ఎగిరిపోతున్నది. నాకు ఆకలిగూడా వేస్తున్నది, పట్టుకొని తింటాను - అని పట్టుకొనడానికి పరుగుతీయగానే హనుమ గరుత్మంతుని గుర్తించి "శ్రీరామ జయరామ జయ జయ రామ" అని అన్నాడు. భగవన్నామాన్ని వినగానే హనుమను గుర్తించి గరుత్మంతుడు - హనుమా, పర్వతంతో ఎవరిని చంపడానికి వెళ్లుతున్నావు?

హనుమ-రామ రావణయుద్ధంలో లక్ష్మణుడు మూర్ఛ నొందాడు. ఆయనకొరకు ఈ ఓషధిని తీసుకొని వెళ్ళ తున్నాను. ఓషధిని గుర్తించలేకపోవడంచేత పర్వతాన్నే తీసుకొని పోతున్నాను, ఇంద్రజిత్తు నాగాపాశంచేత వారిరు వురిని బంధించాడు.

గరుత్మంతుడు - నాగములకు ఇంత సాహసమా? అయితే పద, నేనుగూడావస్తాను.

ఇరువురూ ఆకాశమార్గాన ఎగిరి లక్ష్మణుడు మూర్ఛితుడై వున్నచోటుకి చేరారు. గరుత్మంతుని చూడగనే సర్పములన్నీ పారిపోయాయి. సుషేణుడు రెండు ఓషధులను తీసుకొని విశల్యకరణిచేత ఇరువురిని శల్యరహితులనుగా జేశాడు. సంజీవనీ మూలికను వాసన చూపించగానే లక్ష్మణుని మూర్ఛ తొలగిపోయింది. నిద్రపోయిన వానిమాదిరిగా లేచినిలబడ్డాడు.



లక్ష్మణునికి తెలివి రాగానే వానర సైన్యానికి సంతోషం కలిగింది. వానరులు నవ్వుతున్నారు, పాటలు పాడుతున్నారు, ఎగురుతున్నారు, దూకుతున్నారు, ఒకడు హనుమకు జోహార్లు చెబుతున్నాడు, ఇంకొకడు పొగడుతున్నాడు, మరిఒకడు రామలక్ష్మణులకు, హనుమకు జయము, జయము, అని అంటున్నాడు. ఒకడు హనుమకు ఫలాన్ని ఇస్తున్నాడు, ఇంకొకడు ఆయనకాళ్లు పట్టుతున్నాడు, మరిఒకడు తోకను నిమురుతున్నాడు, వేరొకడు పేలు తీస్తున్నాడు. ఈవిధంగా హనుమంతుని బలపరాక్రమాన్ని గొప్పగా అందరూ కొనియాడారు.



## సుందర హనుమాన్

సుందరే సుందరో రామః సుందరే సుందరకథా
సుందరే సుందరీస్సీతా సుందరే సుందరంవనం
సుందరే సుందరం కావ్యం సుందరే సుందరః కపిః
సుందరే సుందరం మంత్రం సుందరే కిం న సుందరమ్.

శ్రీరామ జయరామ జయజయ రామ

## రామ రక్షక హనుమాన్

# 12

యోహిభృత్యో నియుక్తః సన్ భర్త్రా కర్మణి దుష్కరే !
కుర్యాత్ తదనురాగేణ తమాహుః పురుషోత్తమమ్* ॥

స్వామి సేవకుని గౌరవించి అతని మహిమను పెంపొందించుతాడు. అతనిద్వారా దుష్కర కార్యములను చేయించి, అతని కీర్తిని విస్తరింపచేస్తాడు, అతని గుణాలను స్తుతించి అతనిపట్ల తన కృతజ్ఞతను చూపుతాడు. ఒకవేళ అతని హృదయంలో అభిమానం అంకురించినయెడల పూర్తిగానశింప జేస్తాడు, స్వామి ఎల్లప్పుడు సుయోగ్యుడు. హితైషి అయిన చికిత్సకునిమాదిరి సహకారాన్ని అందజేస్తాడు, చికిత్సకుడు రసాయనాది ఓషధులనిచ్చి ఆరోగ్యవంతునిగా చేస్తాడు, గాని శరీరంలో ఎక్కడైనా ఏదైనాభాగం కుళ్ళిపోతుంటే దాన్ని కోసి తీసివేస్తాడు. శరీరంలోని మాంసాన్ని కోయడంలోకూడా ఆయన అనంతదయ దాగివుంటుంది. స్వామి తన సేవకుని చేత దుష్కరమైన పనులనుగూడా చేయించుకుంటాడు. అతనికి కర్తృత్వాభిమానం కలుగనివ్వడు. ఇది ఎంతగానో విలక్షణమైన విషయం.

---

* హనుమను పొగుడుతూ శ్రీరాముడు అంటున్నాడు – ఏ సేవకుడు ఏకాగ్రంకొరకు స్వామిద్వారా నియమించబడుతాడో దానితోబాటు మిగతా దుష్కరకార్యములను గూడాచేయువానిని పురుషోత్తము డనిఅంటారు.

లక్ష్మణుని చేతిలో ఇంద్రజిత్తు చనిపోయినాడు. రావణునకు మిక్కిలి దుఃఖం కలిగింది. అదేసమయంలో శుక్రాచార్యుడువచ్చి లంకేశ్వరా? ఎందుకు దుఃఖిస్తున్నావు, అన్నాడు.

రావణుడు – అయ్యా? చూస్తూవుండగనే నానగరానికి వచ్చి ఈ స్వల్ప పరాక్రమంకల్గిన కోతులు నాశనంచేస్తుంటే దుఃఖించకుండా ఎలా వుండగలను? నాకు ఆహారమైన ఈ ఇరువురు మానవులు మా వీరులనెందరినో పరలోకానికి పంపారు. నాకు నాపుత్రుడైన మేఘనాధునిపట్ల ఎంతగానో అభిమానముండేది. ఇంద్రునితోసహా ముల్లోకాలను తనవశం చేసుకున్నాడు గాన ఇతన్ని ఎవరూ చంపలేరు, అని అనుకునేవాడిని. శ్రీరామునిపైన విజయాన్ని సాధిస్తాడనే ఆశవుండేది కాని నాఆశ నిరాశగా మారిపోయింది. లక్ష్మణుడు నాపుత్రుణ్ణి చంపాడు. ఇక ఏమి జరుగనున్నదో? శ్రీరాముని జయించలేననిపిస్తున్నది. ఇంద్రజిత్తు లేడుగదా॥ శ్రీరాముని జయించగల్గినవారు మాదగ్గర ఎవరూలేరే?

శుక్రాచార్యుడు – లంకేశ్వరా? నీకు తెలియదు. చాలామంది నీపుత్రులు సముద్రంలో కొట్టుకొనిపోయారు. వారిలో ఒకడుచెలు త్రారలోవుండి పాతాళానికి రాజైనాడు. అతనిపేరు అహిరావణుడు. కాళికాదేవి భక్తుడు. అతడు తలుచుకుంటే ఈ రామలక్ష్మణులను చంపగలడు.

రావణుడు – అయితే అతను రావడంఎలా?

శుక్రాచార్యుడు – నీవు దేవునిమందిరంలో కూర్చొని స్మరించగానే వచ్చేస్తాడు. రావణుడు స్మరించాడు, అహి రావణుడువచ్చి నమస్కరించి నాన్నగారూ మీరు ఎందుకు స్మరించారు? నన్ను ఏంచేయమంటారు?

రావణుడు – నాయనా? ఈ ఇరువురు రాజకుమారులు నాకు దుఃఖం కలుగజేశారు, వానరసైన్యంతో వచ్చి మన వీరులను చంపారు. నీ సోదరుడగు ఇంద్రజిత్తును కూడా చంపారు.

అహిరావణుడు–అయితే వారికి ఏమి అపకారంచేశావు?

రావణుడు – నేను శ్రీరామునిభార్యను అపహరించి తీసుకొనివచ్చాను.

అహిరావనుడు – మీరు చేసిన ఈపని ఏమీ బాగుగా లేదు. ఒకరి భార్యను అపహరించడం అన్యాయంకదా, అందునా శ్రీరాముడు సాక్షాత్తు నారాయనుడే.

రావనుడు–నాయనా? జరగవలసినది జరిగిపోయింది. నీవు ఏమైనా చేయకూడదూ?

అహిరావణుడు – మీరు ఏమి చేయమంటే అదే చేస్తాను.

రావణుడు - వీరిని తీసుకొనివెళ్లి కాళియెదుట బలి ఇమ్ము.

అహిరావణుడు - సరే, నాన్నగారూ. నేను అలాగే చేస్తాను. అనిఅతను వానరసైన్య శిబిరంలోకి అర్ధరాత్రివేళ ప్రవేశించాడు. అక్కడ శ్రీరాముని చుట్టూచేరి వానరులు హాయిగా నిద్రిస్తున్నారు. గుమ్మందగ్గర వీరాసనం వేసుకొని మహావీర హనుమ కాపలాకాస్తున్నాడు. అహిరావణుడు విభీషణునివేషంలో శిబిరంలో అడుగుపెడుతున్నాడు. హనుమ ఎవరు నీవు? ఎక్కడికి వెళ్లుతున్నావు? అని అన్నాడు.

విభీషణుని వేషంలోవున్న అహిరావణుడు - నేను విభీషనుడను. సంధ్యావందనం చేసుకొనడానికి సముద్రపు ఒడ్డుకి వెళ్లాను. ఒక ముఖ్యమైన పనివల్ల రావడంలో ఆలస్యమయింది. హనుమ ఏమీ అనలేదు. అహిరావనుడు లోనికివెళ్ళి చూచాడు. అక్కడ లక్ష్మణుడు, సుగ్రీవుడు, అంగదుడు, విభీషణుడు, మయింద, ద్వివిద; నల, నీల, జాంబవాన్ శ్రీరామునిచుట్టూచేరి శయనిస్తున్నారు. లక్ష్మణుడు ఇంకా నిద్రపోవడంలేదు. నిద్రావస్థలో కళ్లుమూసుకొని వున్నాడు. శ్రీరాముని ముఖసౌందర్యాన్నితిలకించి తన్ను తానే మరచిపోయినాడు. తరువాత తెలివివచ్చింది. నేను వచ్చినపనిఏమిటి? అని అనుకొని రామలక్ష్మణులను తీసుకొని ఆకాశంలోకి వెళ్ళాడు. గుమ్మంగుండావెళ్ళిన హనుమతో గొడవ జరుగవచ్చునని భావించి ఆకాశమారాన పాతాళానికి

చేరి రామలక్ష్మణులను ఒకచోటనుంచి నాలుగువైపులా సైన్యాన్ని కాపలావుంచాడు. ఇదంతా భగవానునిలీల. తన భక్తుడైన హనుమ మహిమను పెంపొందించాలని ఏమీ ఘాట్లాడక ప్రాకృతపురుషులమాదిరి మౌనంగావుండిపోయారు. అహిరావణుడు మకరధ్వజ వానరుణ్ణి ఎవరినీ లోనికి రానీయ వలదని చెప్పి గుమ్మంవద్దగర వుంచాడు. ఇక తాను దేవికి బలి యివ్వడానికి పూరీలు, అరిసెలు, లడ్లు, పాయసం మొదలగు పదార్థాలు పెద్దఎత్తున చేయించాడు. ధూప, దీప పుష్పాలను తెప్పించాడు. బలి యివ్వడానికి అన్ని ఏర్పాట్లు జరుగుతున్నాయి.

ఇకపోతే శ్రీరాముని శిబిరంలో ప్రాతఃకాలం రామ లక్ష్మణులు కనుపించలేదు. హనుమ కాపలాలో ఇరువురు సోదరులను ఎవరో తీసుకొనివెళ్ళారు, అని అందరికి ఆశ్చర్యం కలిగింది.

జాంబవాన్ హనుమను అడిగాడు - రాత్రి లోనికి ఎవరూ రాలేదుకదా?

హనుమ - నేను రాత్రంతా మేల్కొనేవున్నాను. అపరిచితులెవ్వరూ రాలేదు. అర్ధరాత్రివేళ విభీషణుడుమాత్రం వచ్చాడు.

విభీషణుడు - నేను ఎప్పుడు వచ్చానయ్యా? సాయం కాలంనుంచి శ్రీరామునిదగ్గరే వున్నాను గదా?

హనుమ-అతను విభీషణుడు కాదని నాకూఅనిపించింది. కాని నేను పట్టించుకోలేదు. అయితే విభీషణుని వేషంలో ఎవరో వచ్చివుండాలి. అతనే రామలక్ష్మణులను తీసుకొనివెళ్ళి వుంటాడు.

విభీషణుడు ఆలోచించి - నావేషంలో వచ్చివుంటే అతను అహిరావణుడై వుంటాడు. అతడు బలవంతుడు, పాతాళానికి రాజు. అతను రామలక్ష్మణులను ఎక్కడో దాచి వుంటాడు. మనకి పెద్దచిక్కు వచ్చిందన్నమాటే, అనిఅన్నాడు.

హనుమ - మీరు నిశ్చింతగా వుండండి. నేను పాతాళానికి వెళ్ళి రామలక్ష్మణులను వెదికి తీసుకొనివస్తాను. అని హనుమ పాతాళలోకానికి నాగలోకంవైపు వెళుతూ ఒక చోట కూర్చొని ఎటువెళ్ళనా అని ఆలోచించుతున్నాడు. ఒక చెట్టుపైన రెండుగ్రద్దలు కూర్చుని మాట్లాడుకుంటున్నాయి. ఆడుగద్ద నేను గర్భిణిని. మానవమాంసం తినాలని వుంది, ఎక్కడనుండైనా మానవమాంసం తీసుకొని రావలసినది, అని అన్నది.

మగగద్ద - తప్పక తీసుకొనివస్తాను. కొద్ది క్షణాలలో అహిరావణుడు శ్రీరామ లక్ష్మణులను దేవికి బలియిస్తాడు. వెంటనే వారిమాంసాన్ని తీసుకొనివస్తాను, అని అన్నది.

ఈమాట వినగానే హనుమకు సంతోషం కలిగింది, సూక్ష్మరూపాన్ని ధరించి పాతాళలోకంలో ప్రవేశించాడు.

గుమ్మందగ్గర మకరధ్వజ వానరాన్ని ద్వారాన్ని రక్షిస్తూ వుండడం చూచాడు, లోనికివెళుతుంటే హనుమను ఆపుచేసి నీవు ఎవరివి? దొంగతనంగా లోనికి వెళుతున్నావు? నాపేరు మకరధ్వజుడు. నేను హనుమంతుని పుత్రుడను. ఎవరూ లోపలికి వెళ్ళడానికి వీలులేదు, అని అన్నాడు.

హనుమంతునకు ఆశ్చర్యముకలిగింది. తననిజరూపాన్ని చూపి – నాయనా? నేనే హనుమంతుడను. వివాహం నేను చేసుకొనలేదే, మరి నీవునాకు ఎలా పుత్రుడవైనావు?

అతను హనుమకు నమస్కరించి – భగవాన్? మీరు లంకనుకాల్చి సముద్రంలో స్నానంచేయడానికి వెళుతున్నప్పుడు శరీరంనుంచి ఎంతో చెమట వెలువడింది. చెమటను ఒక చేప తాగగా ఆమె గర్భాన్నుంచి జన్మించాను.

హనుమ – బాగుంది, సరే; అహిరావణుడు రామ లక్ష్మణులను ఇక్కడకు తీసుకొనిరాలేదా?

– నాకు పేర్లుతెలియవు. ఇద్దరు రాజకుమారులను నా స్వామి తీసుకొనివచ్చాడు. దేవియెదుట వారిరువురిని కొద్ది క్షణాలలో బలి ఇవ్వనున్నాడు.

హనుమ – అయితే, కొంచెంనన్ను లోపలికివెళ్ళనివ్వు నాయనా?

– ఏమండోయి, అలావీలులేదు. మీరు తండ్రి గారని పక్షపాతం చూపితే ధర్మభ్రష్టుడనౌతాను. విశ్వాస

ఘాతకపాపం చుట్టుకుంటుంది. గాన యుద్ధంతో ఓడించి లోనికివెళ్ళండి.

హనుమకి తొందరగావుంది. ఒక్కగుద్దు గట్టిగావేశాడు. గొప్పతండ్రి బిడ్డగదా, అతను ఏమీ తీసిపోలేదు. ఇరువురి మధ్య కొంతకాలం యుద్ధం జరుగుతూవున్నది. మరి తండ్రి తండ్రే – కుమారుడు కుమారుడేగదా, చివరకు హనుమ అతనిని తోకతో గుమ్మానికి బంధించి లోనికివెళ్ళాడు.

అక్కడ దేవిని కాలుతో అణగతొక్కి తానే స్వయంగా దేవి రూపంలో ముఖాన్ని తెరిచి నిలబడ్డాడు. దేవి ఈరోజు సాక్షాత్తు ప్రత్యక్షమయిందనే రాక్షసులు భావించారు. దేవికి బదులుగా దైవమే ప్రత్యక్షమైనట్లు వారు గుర్తించలేదు. అందరూ విధిగా దేవికి పూజచేశారు. ఈరోజు నివేదనగా సమర్పించిన హల్వా. అరిశెలు, పాయసం, మొదలగు పదార్థముల నన్నిటినీ దేవి తినేసింది. రామలక్ష్మణులు దేవి ఎదుటకు తీసుకురాబడ్డారు. వారు ఏమీతెలియని బాలురు మాదిరి హాజరైనారు.

అహిరావణుడు – మీరు మీ రక్షకులను స్మరించు కొనండి. మిమ్ములను బలి ఇస్తున్నాను, అని అన్నాడు.

రాముడు – లక్ష్మణా? ఆపద వచ్చినప్పుడు అందరూ నన్ను స్మరించుతారు. మనకు ఆపదవచ్చినప్పుడు హనుమను స్మరించుతాం.

లక్ష్మణుడు - అయితే ఇక్కడ హనుమ ఎక్కడ వున్నాడు?

రాముడు - హనుమ అంతటావున్నాడు. దేవిరూపంలో నాకు హనుమంతుడే కనుపించుతున్నాడు.

వెంటనే హనుమ రౌద్రరూపంలో ప్రత్యక్షమై శ్రీరామ లక్ష్మణులను తన భుజాలపైన కూర్చొబెట్టుకొని అహిరావణుని హతమార్చి వెళ్లుతున్నాడు.

గుమ్మందగ్గర బంధించబడిన వానరాన్నిచూచి రాముడు హనుమా! ఈ వానరాన్ని ఎవరో బంధించారు, చూడు నాయనా?

హనుమ - ఇతను ద్వార రక్షకుడు. హనుమంతుని పుత్రుడు అని అంటున్నాడు. నన్ను లోనికి రానివ్వలేదు. అందుకు బంధించివచ్చాను.

భగవాన్ - అయితే, వుండు. ఈపిల్లవానిని ముద్దు పెట్టుకుంటాను. అని అతణ్ణి బంధవిముక్తుణ్ణిచేసి పాతాళానికి రాజుగా చేశాడు, హనుమ రామలక్ష్మణులను తీసుకొని ముందుకుసాగాడు.

మార్గమధ్యంలో హనుమ మనస్సులో అభిమానంకలిగి నేను చేరడంలో కొద్ది ఆలస్యం అయివుంటే రామలక్ష్మణులను

బలియిచ్చి వుండేవారు, నేను సమయానికి చేరుకొని రామ లక్ష్మణులను రక్షించాను, అని అనుకున్నాడు.

భగవాన్ తన భక్తుని హృదయంలో అభిమానాన్ని వుండనివ్వడు. ఇదే ఆయన భక్తవత్సలత. భక్తుడు ఇలా ఆలోచిస్తూ వెళ్లుతున్నాడు.

భక్తుని హృదయంలో కొంచెం అహంభావం కలిగినా తిరిగి పెద్ద విశాల వృక్షమవుతుంది. అనర్థాన్ని కలుగచేస్తుంది. దాన్నిపూర్తిగా తీసివేయడానికి భగవాన్‌నిశ్చయించుకున్నాడు.

అదే రోజున ఒకరింట్లో శిశువు జన్మించాడు. తల్లి ఆశిశువుని అంటున్నది- వీడు పరమ దౌర్భాగ్యుడు. వీడు జన్మించాడు. ఈ దేశపురాజుని ఒక వానరుడు చంపేశాడు.

ఆ శిశువు – ఆ వానరుడెక్కడా? అని అన్నాడు.

అతని తల్లి – అదుగో చూడు, ఎగిరిపోతున్నాడు.

రాక్షసులపిల్లలు కామరూపులు. పుట్టగానేఎగురుతారు, అతను ఎగిరి హనుమకాళ్లు పట్టుకొని దభీమనికొట్టి పారిపోయి నాడు. హనుమకు కనుపించలేదు. మరల వెనుకగావచ్చి కొట్టాడు. శ్రీరాముడు నవ్వి – హనుమా! నీబలమేమైంది? ఒక్క పిల్లవాడిని పట్టుకొనలేకపోతున్నావు. ఈసారివచ్చి నప్పుడు దుమ్ముగొట్టు, గుడ్డివాడై పోతాడు.

హనుమ అలాగేచేశాడు.



ఆ పిల్లవానిని చంపి ముందుకుసాగి వెళ్ళాడు. ఈవిధంగా అతనికి కల్గిన అభిమానం కాస్తా కరిగినీరై పోయింది.

ఏమి జరిగినా అది శ్రీరాముని అనుగ్రహం వలనే జరుగుతుందని హనుమ తెలుసుకున్నాడు. కోరినవారికి కీర్తి నిచ్చినా అపకీర్తి నిచ్చినా అన్నీ ఆయనే. ఆయన ఎప్పుడు ఎలా చేయదలచుకుంటే దానికి తగినట్లుగానే సాధనములు సమకూరుతాయి. ఎల్లప్పుడూ అన్నిపనులలో భగవదేచ్ఛనే అపేక్షించాలి. మిగతావన్నీ నిమిత్తమాత్రమే.

శ్రీరామలక్ష్మణులు తిరిగి వచ్చేసరికి వానరులకు మిక్కిలి సంతోషం కలిగింది. అందరూ హనుమంతుని బల పరాక్రమ, సాహసాన్ని కొనియాడారు.

# వివిధ రూపాలలో హనుమాన్

## 13

భృత్యకార్యం హనుమతాకృతం సర్వమశేషతః
సుగ్రీవస్యే దృశోలోకే నభూతో నభవిష్యతి ॥ *

స్వామికార్యం నెరవేరినప్పుడు స్వామికంటే సేవకునకే మిక్కిలి సంతోషం కలుగుతుంది. సేవకునికి ఏదో ఒకేరూపమంటూ వుండదు. స్వామికి ఎలావుంటే సుఖం కలుగుతుందో, ఏరూపాన్ని ధరిస్తే స్వామికార్యం సిద్ధిస్తుందో అదేరూపాన్ని సేవకుడు ధరిస్తూ వుంటాడు. భగవాన్ విష్ణువుదగ్గర గరుత్మంతుడు దాసుడుగానూ, స్నేహితుడుగానూ, వాహనముగానూ, ఆసనముగానూ, పతాకముగానూ, చామరముగానూ, ఎప్పుడు ఎలాంటి అవసరమేర్పడితే అలామారుతూ వుంటాడు. ఇదే విషయం హనుమకి గూడా వర్తిస్తుంది. ఆయన దౌత్యకార్యం చేస్తాడు, యుద్ధం చేస్తాడు, అవసరమైతే వాహనంగా వుంటాడు. నిజానికి ఇలాంటి సేవకుడు స్వామికంటే ఎక్కువగా గౌరవాన్ని పొందుతాడు.

---

* భగవాన్ శ్రీరాముడు అన్నాడు - సేవకుడు చేయవలసిన కార్యములన్నిటినీ హనుమాన్ సంపూర్ణంగా చేశాడు. సుగ్రీవ, హనుమలాంటివాళ్లు ఈలోకంలో అద్యావధి జన్మించలేదు. ఇక ముందు జన్మించరుగూడాను.

సంజీవనివలన లక్ష్మణునకు తెలివివచ్చింది. తిరిగి యుద్ధం ప్రారంభమయింది. ఈసారి రావణుడు తనమంత్రి సేనాపతి అయిన ధూమ్రాక్షుణ్ణి పంపాడు. ధూమ్రాక్షుడువచ్చి వానరులతో - నేను సామాన్యవానరులతో యుద్ధంచేయను. రామలక్ష్మణులను, సుగ్రీవ విభీషణులను చంపడానికివచ్చాను. నేను లంకలో మహావీరునిగా ప్రసిద్ధిగాంచాను. గనుక మీరు వెళ్ళిపోండి, అని అన్నాడు.

హనుమ - మంత్రిగారూ! లంకలో మిమ్మల్ని మహావీరుడని అంటారన్నారు. మావానరులు నన్నుగూడా మహావీరుడని పిలుస్తుంటారు. ముందుగా నాతో రెండుపట్లు పట్టండి, తరువాత ముందుకి వెళదురుగాని.

ఇది వినగానే ధూమ్రాక్షుడు హనుమపైన ఎన్నో బాణాలు వేశాడు. హనుమ వెంటనే ఒక పర్వత శిఖరాన్ని తీసుకొని కొట్టాడు. ధూమ్రాక్షుడు తప్పించుకున్నాడు కాని అతని రథము ముక్కలయింది. ధూమ్రాక్షుడు తిరిగి హనుమ తలపైన గదతో ఒక్కదెబ్బకొట్టాడు. హనుమ మరిఒక పర్వత శిఖరాన్ని తీసుకొని కొట్టేసరికి అతను "హుచ్_హుచ్" అంటూ చనిపోయాడు. అందరూ హనుమను మిక్కిలికొనియాడారు.

యుద్ధంలో రావణుని సేనాపతులందరూ చనిపోయారు రావణుడు స్వయంగా శ్రీరామునితో యుద్ధానికి వచ్చాడు. ఎదురుగా లక్ష్మణుడు కనుపించాడు. ఇరువురిమధ్య భయంకర

యుద్ధం జరిగింది. లక్ష్మణుని పరాక్రమాన్ని చూచేసరికి రావణునకు విస్మయంకలిగింది, అతను ఒక అమోఘమైన బాణాన్ని ప్రయోగించి లక్ష్మణునకు మూర్ఛ కలుగునట్లు చేశాడు. వెంటనే హనుమ అతనిని శ్రీరాముని దగ్గరకు తీసుకొనివెళ్ళాడు, శ్రీరాముడు అతని తనఒడిలో పరుండ బెట్టుకొని దుఃఖించాడు. కొద్దికాలమునకు లక్ష్మణునకు తెలివి వచ్చింది, శ్రీరామునకు రావణుని పైన కోపంవచ్చింది. హనుమా! ఆ దుష్టరావణుని దగ్గరకు నన్ను తీసుకొనివెళ్లు, అతని బలాన్ని చూస్తాను. చాలాకాలంగా అతనిని చూడాలని వుంది.

హనుమ – ప్రభూ? రావణుడు రథారూఢుడైవున్నాడు. మీరు నా భుజాలపైన కూర్చుని యుద్ధంచేయండి, అని అన్నాడు. శ్రీరాముడు అంగీకరించాడు. రావణుడు హనుమ భుజాలపైన శ్రీరాముని చూచి నేను చాలారోజులుగా వెదుకుతున్నాను. శ్రీరామునిచంపి రాక్షసులభయాన్ని పోగొట్టుతాను, అని అన్నాడు.

శ్రీరాముడు – ఓయీ రాక్షసాధమా? శూరవీరులు వ్యర్థప్రలాపన చేయరు. యుద్ధంలో తమ పరాక్రమాన్ని చూపుతారు.

భయంకరయుద్ధం జరుగుతున్నది. హనుమ అతని దెబ్బలనుండి శ్రీరాముని రక్షిస్తున్నాడు, హనుమపైనమిక్కిలి

కోపంవచ్చి రావణుడు తనలో అనుకున్నాడు.- ఈవానరుడే అంతటికీ మూలకారణం. ఎక్కడచూచినా ఇతను ముందు వుంటాడు. ఇతనికి సిగ్గు, బిడియం బొత్తిగాలేదు. దూతగా సముద్రాన్ని దాటాడు, లంకను కాల్చాడు, నా అక్షయ కుమారునిచంపాడు, మంత్రి ధూమ్రాక్షుణ్ణి చంపాడు, సంజీవనీ తీసుకొనివచ్చి లక్ష్మణుని బ్రతికించాడు, యుద్ధంలో నన్ను ఇతనే గాయపరిచాడు. ఇప్పుడేమో రామునికివాహనమైనాడు. కనుక ఇతన్ని ముందుగా చంపేస్తాను. ఇతను చనిపోతే రాముడు దుర్బలుడౌతాడు, అని ఊహించుకొని హనుమను కొట్టాడు. హనుమ గాయపడ్డాడు, రామునకు మిక్కిలి కోపం వచ్చింది. రావణునితో యుద్ధంచేయసాగాడు, యుద్ధంలో రావణుడు అలసిపోయినాడు.

రాముడు-రాక్షసరాజా? అలసిపోయినట్లున్నావు, అధర్మ యుద్ధం చేయరాదు గనుక రేపు రావలసినది-అని అన్నాడు.

రావణుడు నిజంగా అలసిపోవడంచేత తిరిగి వెళ్ళిపోయినాడు. రెండవరోజున యుద్ధంలో శ్రీరాముడు రావణుని చంపాడు. శ్రీరామునికి విజయం లభించింది. శ్రీరాముని అనుమతితో లక్ష్మణుడు విభీషణుని లంకకురాజుగా అభిషిక్తుణ్ణి చేశాడు. విభీషణుడు రావణునకు దహనసంస్కారం చేశాడు, ఈ శుభసమాచారాన్ని హనుమ సీతమ్మకు తెలియజేశాడు. సీతమ్మకి మిక్కిలి సంతోషంకలిగింది. హనుమ ఉపకారాల్లకి కృతజ్ఞతాభారంచేత కుంగిపోయి - హనుమా!

నీవుచేసిన సాహసకృత్యములను, ఉపకారాలను వర్ణించలేను. నీకు ఎప్పుడూ ఋణపడేఉంటాను, అని అన్నది.

హనుమ - అమ్మా! ఇదేమిటి మీరు అంటున్నది. పుత్రుడు ఎప్పుడూ ఋణపడేఉంటాడు. నాకు ఒకే ఒక కోరిక వుంది. మీరు అనుమతిస్తే ఆకోరికను నెరవేర్చుకుంటాను.

సీతమ్మ....నాయనా? నీ కోరిక ఏమిటి?

హనుమ....అమ్మా! రావణుడు ఒకరోజున మీదగ్గరకు వచ్చాడుగదా? రాక్షసస్త్రీలను మిమ్ములను కష్టపెట్టమని ఆదేశించగా వారు ఎన్నోవిధాల కష్టపెట్టారుగదా, మీరు ఒప్పుకుంటే వీరిని కొద్దిగా మరమ్మత్తు చేస్తాను.

సీతమ్మ - నాయనా? అలా చేయవద్దు. నీకు తెలియదు. అప్పుడు వీరు పరవశులు. రావణు ఆదేశాన్ని పాటించారు, మానవుడు తనపరిస్థితికి వివశుడై చేయరాని కార్యాలని కూడా చేస్తాడు. పరిస్థితులు అతనిని అలాచేయునటు చేస్తాయి. నిజానికి వీరు నిరపరాధులు, వీరినికొడితే ఏమివస్తుంది? వీరిని దండించినయెడల నాకు మిక్కిలిదుఃఖం కలుగుతుంది. ఎవరికీ దుఃఖాన్ని కలగజేయరాదు. కాలము బలీయమైనది, బలవంతులు దుర్బలులను ఎప్పుడూ కనికరించాలి. నీవు రెండుదెబ్బలు కొడతానంటావు. వీరు నీ ఒక్కదెబ్బకే నేల కూలుతారు. రావణుడు చెప్పినట్లు చేశారు. ఇప్పుడురావణుడు

చనిపోయినాడు, వీరంతా నీ అనుగ్రహాన్ని కోరుతున్నారు. వీరికి తగిన బహుమానములిమ్ము.

హనుమ మిక్కిలి ప్రసన్నుడై - అమ్మా? ఈమాటలు శ్రీరాముని ప్రియురాలికి తగినట్లుగానే వున్నాయి.

తరువాత శ్రీ సీతారాములు కలుసుకున్నారు. పుష్పక విమానంపైన శ్రీరాముడు సీతాలక్ష్మణులతో ముఖ్యవానరులను తీసుకొని అయోధ్యకుప్రయాణమైనాడు. కిష్కింధలో కొన్ని క్షణాలువిశ్రమించి ముందుకుసాగారు.హనుమ—ప్రభూ! ఇక్కడ పర్వతంపైన మా అమ్మగారు వుంటున్నారు. ఒక్కసారి వెళ్ళి చూచివస్తాను- అని అన్నాడు. శ్రీరాముడు హనుమా? మేముగూడా వస్తాం. అంజనాదేవి, నీకు ఒక్కడికే తల్లా? ఆమె మాకుమాత్రం తల్లికాదా? ఆమె జగన్మాత. నీలాంటి వీరునిగన్న తల్లిని దర్శించితే జీవితం సార్థకమౌతుంది. ఇది వినగానే హనుమంతునకు సిగ్గు కలిగింది. క్షణంలో విమానం అంజనాదేవి దగ్గర దిగెంది.

ముందుగా హనుమ తల్లికి నమస్కరించాడు. అంజనా హనుమను లేవనెత్తి ముద్దుపెట్టుకున్నది. ఇంతలో అక్కడికి శ్రీరాముడు, లక్ష్మణుడు, సీతమ్మ వానరులు చేరారు. హనుమ - అమ్మా? వీరు శ్రీరామచంద్రులు. ఈయన ఆయన చిన్నసోదరుడగు లక్ష్మణుడు, ఈమె సీతమ్మ, ఈమెను రాక్షసరాజు రావణుడు అపహరించి తీసుకొని

వెళ్ళాడు. మేమంతా సేతువు నిర్మించి లంకకువెళ్లి రావణుని చంపి సీతమ్మనుతీసుకొని అయోధ్యకువెళ్లుతున్నాం.

ఈ మాటలు వినేసరికి అంజనాదేవికి మిక్కిలి కోపం వచ్చి - హనుమా, నీవు నాపాలను అవమానపరిచావు. ఇంత చిన్నపనికి శ్రీరాముడు కష్టపడవలసివచ్చిందా? నీవు ఒంటరిగావెళ్ళి ఆ రాక్షసుణ్ణి పట్టుకొని తీసుకురాకపోయావా? నిజంగా నీవు నా పాలను అవమానపరిచావు, అని ఆమె తన ఒడిలోనుంచి క్రిందకు నెట్టింది! అప్పుడు శ్రీరాముడు అంజనకు నమస్కరించి—— అమ్మా? నీకుమారుడు సర్వసమర్థుడు. అతను ఒంటరిగానే రావణాసురుని చంపగలడు, లంకను సముద్రంలో ముంచగలడు. అప్పుడు అతనిపేరే నిలిచిపోతుంది. మరి లోకపావనమైన రామ చరిత్ర ఎలా వ్రాయబడుతుంది. జగత్తులో నాలీలను విస్తరింపజేయడానికే ఇలా చేశాను. మీరు హనుమను కనికరించండి. అతను నా ఆదేశాన్ననుసరించి చేశాడు. వెనుకటిమాదిరిగానే అతనిని ప్రేమించండి.

శ్రీరాముని మాటలువిని ఆమె ప్రసన్నురాలై శ్రీరామునిపూజించి. హనుమను ఎన్నోవిధాల ఆశీర్వదించింది.

లక్ష్మణునికి సందేహం కలిగింది. ఈ ముసలామె మాటిమాటికి తనపాలను పొగుడుతున్నది. ఈమె పాలలో అలాంటివిశేష మేముంది? అంజన లక్ష్మణుని భావాన్ని

తెలుసుకొని—చిన్న రాకుమారునకు నా పాలనుగురించి సందేహం కలుగుతున్నట్లున్నది. నేను ఇప్పుడే నాపాలమహిమను చూపుతాను, అని అంజనా తనస్తనాన్ని నొక్కి ఒక పాల ధారను పర్వతంపైన వదిలింది. ఆ పాలధారకి పర్వతం బ్రద్దలైంది. ఇదిచూచి అందరూ విస్మితులైనారు.

తరువాత అంజనాదేవి దగ్గర సెలవు తీసుకొని అందరూ విమానంపైన ప్రయాణమై తీర్థరాజమైన ప్రయాగలో అడుగుపెట్టారు.

### సర్వదా జాగరూకుడైన హనుమాన్

ఐహికేషు చకార్యేషు మహాపత్సుచ సర్వదా
నైవయోజ్యో రామమంత్రః కేవలం మోక్షసాధకః॥
ఐహికే సమనుప్రాప్తే మాం స్మరే ద్రామసేవకం।
యోరామం సంస్మరే న్నిత్యం భక్తో మమ పరాయణః
తస్యాహ మిష్టదం సిద్ధ్యై దీక్షితోస్మి మునీశ్వరాః
వాంఛితార్థం ప్రదాస్యామి భక్తానాం రాఘవస్యతు
సర్వదా జాగరూకోస్మి రామకార్య ధురంధరః॥

—రామరహస్యోపనిషత్తు

ఐహికకార్యములను సాధించుటలోగాని, ఆపత్సమయము లందుగాని, కేవలము మోక్షసాధనమగు శ్రీరామ మంత్రమును వినియోగింపరాదు: అట్టి ఐహికములందు శ్రీరామ సేవకుడను నన్నుస్మరింపవలసినది. ఎవరు నిరతము రామునిస్మరింతురో యట్టివారి కోరికలను నెరవేర్చుటకు నేను కంకణబద్ధుడనై యున్నాను. నేను రామకార్య దురంధరుడగుటచే సర్వదా జాగరూకుడై యున్నాను.

శ్రీరామ జయరామ జయ జయ రామ

# రామపరివారంలో హనుమాన్

## 14

రామం రామానుజం సీతాం భరతం భరతానుజమ్‌
సుగ్రీవం వాయుసూనుంచ ప్రణమామి పునః పునః *

స్వామి కృతార్థుడై కుశలంగా తన ప్రియపరివారం లోకి వచ్చి చేరినప్పుడు సేవకునకు విశేషంగా సుఖంకలుగు తుంది. ప్రభువునుంచి పరివారం వేరుకారాదు. అదిస్వామికి అభిన్నమైన అంగమే. పరివారంయొక్క పరిపూర్ణత్వమే ప్రేమకు పరాకాష్ఠ అని అంటారు.

తీర్థరాజ ప్రయాగచేరి త్రివేణిలో స్నానంచేసి భరద్వాజ మహర్షి ఆశ్రమానికి చేరారు. శ్రీరాముడు మహర్షికి పాదాభివందనంచేశాడు. మహర్షిఅందర్నీ ఎంతగానో ఆదరించారు.

భగవాన్ హనుమను పిలచి - నాయనా? నీవుబుద్ధిమంతుడవు, నీకుదేశ, కాలముల-జ్ఞానము కలదు. నావనవాసానికి ఈరోజు చివరిరోజు. నేను రేపు సూర్యోదయానికి ముందుగా అయోధ్యకు చేరాలి. లేకపోతే నా సోదరుడు భరతుడు ప్రాణా

* శ్రీరామ, లక్ష్మణ, సీత, భరత, శత్రుఘ్న, సుగ్రీవ, హనుమలకు నేను మాటి మాటికి నమస్కరిస్తాను.

లను వదిలేస్తాడు. నీవు వెంటనేవెళ్ళి అతనికి నారాక తెలియ జేయవలసినది, దీనివలన అతనికి కొంతధైర్యంకలుగుతుంది. పవనతనయా? ఇంకొక విషయాన్నిగూడా గమనించవలసి వున్నది. రాజ్యం చేస్తూ వుండడంచేత అతనికి రాజ్యం చేయాలనే అభిప్రాయం వున్నదేమో జాగ్రత్తగా తెలుసు కొనుము. అతనికే రాజ్యకాంక్షవుంటే నేను జీవితమంతా వనంలోనే వుండిపోతాను. కాని నా సోదరుని మనస్సులో రాజ్యంపట్ల కోరికవుండదు.

శ్రీరాముని ఆనతిన హనుమ ఎగిరి అయోధ్యకు వెళ్ళాడు, భరతుడు అత్యంత వ్యాకులతతో ఒక్కొక్కరోజు లెక్కపెట్టుతున్నాడు. ఈ 14 సంవత్సరాలు భరతుడు ఎలా గడిపాడో అతనికేతెలుసు. ఒక్కొక్కక్షణం ఒక యుగంలాగా అనిపిస్తున్నది. నేడు రాముని వనవాసానికి చివరిరోజు. భర తుడు పదే-పదే దక్షిణదిక్కువైపు చూస్తున్నాడు. చాలామంది అశ్వారోహ సైనికులను శృంగవేరపురంనుంచి అయోధ్యవరకు శ్రీరాముడు గంగ ఒడ్డుకి చేరగనే తెలియజేయమని నియమించాడు.

ఆకులఅలజడికి ఉలిక్కిపడి భరతుడు దక్షిణదిక్కువైపు చూచేవాడు. ఎప్పుడైనా గుర్రపుగిట్టల ధ్వనివినిపిస్తే లేచి నిలబడి చూస్తూ వుండేవాడు. ఎవరూ కనుపించకపోతే నిరాశ చెంది ఆలోచించేవాడు-శృంగవేరపురం వరకు రాకపోతే రేపు సూర్యోదయానికి ఎలా రాగలరు? శ్రీరాముడు నన్ను

పాపాత్మునిగా భావించి పరిత్యజించలేదుగదా? నిజానికి నేను అపరాధినే. నావలననేగదా వారికి ఇన్నికష్టాలు వచ్చాయి. నేను అపరాధాలపుట్టను. మరి శ్రీరాముడు కరుణాసముద్రుడు గదా. వారి అనుగ్రహంవల్లనే నేను ఇంతకాలం జీవించి వున్నాను. రేపు సూర్యోదయానికి ముందుగా వారు రాక పోతే ప్రజ్వలిత అగ్నిలో భస్మమవుతాను,

భరతుడు ఇలాఅనుకుంటూవున్నాడు. ఇంతలోహనుమ బ్రాహ్మణవేషంలో వచ్చి జయసీతారాం, అని అన్నాడు. తన స్వామిశ్రుతి మధుర ప్రియనామాన్ని వినేసరికి పులకితుడై భరతుడు – దయచేయండి విప్రోత్తమా, మీకు స్వాగతము, ఏమి సేవచేయను. అని అన్నాడు.

హనుమ – మీరు నిరంతరము స్మరించుతున్న శ్రీరాముడు రావణునిచంపి లక్ష్మణ వైదేహీలతో వచ్చాడు.

– "నా రాముడు వచ్చాడా" ఎక్కడ, నారాముడు? అని నలువైపులా వెర్రివాడులాగా భరతుడు చూచాడు. "రాముడు వచ్చాడు, రాముడు వచ్చాడు" అనెడి శబ్దాలు భరతునిచెవుల్లో ఎవరో అమృతం పోసినటుగా వినిపించాయి,

–విప్రోత్తమా? ఇక్కడికి ఎంతదూరంలో వున్నాడు నారాముడు? మహానుభావా? నీవు నీకళ్ళతో చూచావుటయ్యా? కాలి నడకన వస్తున్నాడా లేక వాహనంమీదనా? ఇప్పుడేవెళ్ళి

స్వాగతం చెబుతాను. ఇలాంటి శుభసమాచారాన్ని వినిపించి మహోపకారం చేశావు. ఇందుకు నీకు ఏమి ప్రత్యుపకారం చేయనయ్యా? నీ పరిచయాన్ని కలుగజేయవయ్యా!

హనుమ భరతుని ఉద్వేగాన్ని చూచి వరుసగా ఇన్ని ప్రశ్నలను విని ఉలిక్కిపడి మిక్కిలి వినమ్రతతో - ప్రభూ! నేను బ్రాహ్మణుడను కాను. నేను వాయుపుత్రుడను. శ్రీరాముడు పంపగా వచ్చాను, అని అన్నాడు.

భరతుడు - అయితే నీవు హనుమంతుడివన్నమాట! నీవేగదా ఆరోజున సంజీవనీ ఔషధి తీసుకొనివెళ్ళింది?

హనుమ - ప్రభూ? అవును. నేనే.

భరతుడు- నాయనా? ఆరోజున నీకు తోకవున్నదిగదా!

హనుమ - అది నా నిజరూపం. ఇది కృత్రిమరూపం.

భరతుడు - కృత్రిమవేషంలో మిథ్యావచనములు వలకడంలేదుకదా?

హనుమ - కపటవేషమేకాని విషయం నిజమే చెబుతున్నాను. శ్రీరాముడు వచ్చాడు.

భరతుడు-మరి నాకు ఎందుకు కనిపించడంలేదు ఆయన ఎక్కడ?

ప్రస్తుతం తీర్థరాజప్రయాగలో వున్నారు.

ప్రియాగలో వున్నారా? ప్రయాగ ఇక్కడికి చాలా దూరంలో వుందిగదా, రేపు ఉదయానికి ఎలారాగలరు? లంకనుంచి ఎలావచ్చారు? అని భరతుడు అడిగాడు:

హనుమ - వారు సపరివారంగా పుష్పకవిమానంపైన వచ్చారు. దానివేగం వనోవేగంతో సమానంగా వుంటుంది. రేపు మీకు శ్రీరాముని దర్శనమవుతుంది. నేనుగూడా వారి వెంట ఉండి ఇప్పుడు ఇచటకి వచ్చాను.

భరతుడు-అయితే, శ్రీరాముడు రావణుని చంపాడన్న మాట. తప్పక తనపరివారంతో కలిసి రేపువస్తాడా? నాకు వారి దర్శనభాగ్యం కలుగుతుందా?

హనుమ — తప్పక కలుగుతుంది. మరినాకు సెలవు.

భరతుడు - హనుమా! నీవు నాకు చాలా ప్రియుడవు. ఇంతకంటే సుఖప్రదమైన మరో సమాచారముండదు. రేపు సూర్యోదయానికి పూర్వము రాకపోతే ప్రజ్వలిత అగ్నిలో ప్రవేశించుతానన్ని శ్రీరామునికి చెప్పు.

హనుమ - మీరు నామాట నమ్మండి. రేపు ఉదయం తప్పకవస్తారు. శ్రీరాముడు నాకొరకు ఎదురుచూస్తూవుంటాడు.

ఈవిధంగాచెప్పి భరతునకు నమస్కరించి హనుమ ఆకాశంలోకి ఎగిరి ప్రయాగలోవున్న భరద్వాజుని ఆశ్రమానికి చేరి భరతుని సమాచారాన్ని భగవంతునకు అందజేశాడు.

భగవంతుడు దుఃఖించి రతుని గుణాలను కొనియాడాడు.

భరతుడు శ్రీరాముని రాకను తెలుసుకొని మిక్కిలి సంతసించాడు. రాత్రంతా నిద్రపట్టలేదు.

శ్రీరాముని స్వాగతసన్నాహాల విషయంలో సంలగ్నుడైనాడు. శ్రీరాముడు రానున్నవైపు సమస్తసైన్యాన్ని, ప్రజలను నిలబెట్టాడు, స్వయంగా శ్రీరాముని పాదుకలను శిరస్సుపైన వుంచుకొని విలపిస్తూ శ్రీరామునికి స్వాగతమివ్వడానికి బయలుదేరాడు. ఒక్కొక్కక్షణం గడపడం చాలా కష్టంగావుంది. హనుమ అసత్యము చెప్పలేడుగదా, అని ఆలోచించసాగాడు.

తూర్పున సూర్యోదయమవుతుండగా దక్షిణ దిక్కున పుష్పక విమానం వస్తూ కనుపించింది. శ్రీరామునకు శిరస్సున పాదుకలు పెట్టుకొని మిక్కిలి కృశించిన శరీరంతో భరతుడు కనుపించాడు, శ్రీరాముడు- చూడండి, అతడే నాసోదరుడు. రాజ్యాన్ని పాలిస్తూగూడా తపస్సుచేశాడు - అని, అంటూ వుండగా విమానం క్రిందకు దిగింది. శ్రీరాముడు భరతుని కలుసుకుందామనుకునేసరికి భరతుడు కర్రమాదిరిగా భూమి మీద పడిపోయినాడు. శ్రీరాముడు ఆయనను లేవనెత్తి కౌగలించుకున్నాడు. తరువాత అందరూ కలుసుకున్నారు.

ఇకపోతే మీరంతా పుష్పకారూఢుడైన శ్రీరాముని దర్శించండి. పుష్పకంలోవున్న సింహాసనంపైన శ్రీ సీతా

రాములు ఆసీనులైనారు. భరతుడు పాదుకలను శిరస్సున ధరించాడు. విభీషణుడు చామరాన్ని వీచుతున్నాడు. హనుమ తెల్లని గొడుగుని పట్టుకున్నాడు. సుగ్రీవుడు విసనకర్రతో విసురుతున్నాడు, శత్రుఘ్నుడు ధనుర్బాణాన్ని ధరించాడు, శ్రీ జానకి తీర్థజలం కల్గిన కమండలాన్ని చేతిలో పుచ్చుకొని వుంది. అంగదుడు ఖడ్గాన్ని తీసుకొని వున్నాడు, భల్లూకపతి ఢాలుని పుచ్చుకొనివున్నాడు. ఈవిధంగా రథారూఢుడైన శ్రీరాముని దర్శించి ప్రజలందరూ సంతోషించారు. ప్రస్తుతం మీరుగూడా పుష్పకంపైన ఆసీనులై వున్న భగవానుని దర్శించండి. మిగతా కథను తర్వాత వినిపిస్తాము.



## శ్రీహనుమత్కృత శ్రీరామస్తుతి

హేనాథ! హేనరోత్తమ! హేదయాళో!
సీతాపతే! రుచిరకుండల శోభవక్త్ర!
భక్తార్తిదాహకః మనోహర రూపధారిన్!
మాం బంధనాత్ సపది మోచయమావిలంబమ్॥

(పద్మ పురాణము)

శ్రీరామ జయరామ జయ జయ రామ

## రామనామ రసికుడు సర్వప్రియుడు హనువాన్

## 15

రామ ఏవం పరం బ్రహ్మ రామ ఏవం పరంతపః।
రామ ఏవం పరంతత్వం శ్రీరామో బ్రహ్మతారకం॥*

శ్రీరాముని అనుగ్రహం కలిగినవారిని అందరూ ఆదరిస్తారు. రామునికి ఇష్టులైనవారు అందరికీ ఇష్టులవుతారు, రాముడు స్వీకరించిన వారిని అందరూ స్వీకరిస్తారు. రాముని ప్రసన్నతే జగత్తునకు ప్రసన్నత, రామునిపట్ల విముఖులయినప్పుడు అందరూ విముఖులవుతారు. రాముడు సుఖధాముడు, కల్పతరువు. అందలి సుఖప్రదమైన శీతలఛాయలో శోక సంతాపములన్నీ శాంతించుతాయి.

శ్రీరాముడు రాజుఅయినాడు. అందరూసంతోషించారు. రామరాజ్యాభిషేక సమయంలో అందరికి కానుకలు పంచారు. శ్రీరాముడు స్వయంగా సుగ్రీవ, అంగద, విభీషణ, నల, నీల ముఖ్యులకు కానుకలిచ్చి గౌరవించాడు. హనుమకు మాత్రం ఏమీ ఇవ్వలేదు. ఒక విలువైన హారాన్ని సీతమ్మకిచ్చి తనకిష్టమైనవారికివ్వమన్నాడు.

సీతమ్మ – మహరాజ్? మీరు మానవపుత్రులమధ్య భేదభావాన్ని కలుగచేయదలచుకున్నారా? తల్లికిబిడ్డలందరూ సమానులే.

---

* హనుమ రామతారకోపనిషత్తులో అంటున్నాడు – శ్రీరాముడే పరబ్రహ్మ, తపస్సు, పరతత్వము, బ్రహ్మతారకము.

భగవాన్ — సమానులెలా అవుతారు? అందరూ సమానులే అయితే శాస్త్రాల్లో సుపుత్ర-కుపుత్రులని ఎందుకువర్ణించారు?

సీతమ్మ — మహారాజ్? ఏ వ్రేలికి సూదిగుచ్చినా నెప్పి సమానంగానే కలుగుతుంది. తల్లికి పుత్రులందరూ సమానులే. కాని పనులనుబట్టి చిన్నా-పెద్దాఅని తారతమ్యముంటుంది. తల్లి మమత పుత్రులందరిపైన సమానంగానే వుంటుంది. కాని సద్గుణాల కారణంగా భక్తి కారణంగా భేదభావం కలుగుతుంది. అట్టిభేదం గుణాలకు సంబంధించినదే.

భగవాన్—నా అభిప్రాయంగూడా ఇదే, నీవుగుణాలలో ఎవరిని ఎక్కువగా భావిస్తావో అతనికి ఇమ్మ అని అన్నాడు.

జానకి — అందరూ భక్తులే, గుణవంతులే.

శ్రీరాముడు — అయినా కొద్దితేడా వుండనే వుంటుంది. నీవు సంకోచిస్తున్నట్లున్నావు. నీవు ఇవ్వదలచినవానికి ఇవ్వవలసినది.

సీతమ్మ ఆహారాన్ని తీసుకొని ఆలోచిస్తున్నది.

అందరూ ఆ మెవైపు ఎంతో ఆశతో చూస్తున్నారు. అందరికీ ఆ హారాన్ని పొందాలనివుంది. ఆమె ఎవరికిఇస్తుందో అని చూస్తున్నారు, కాని హనుమమాత్రం ఆమెవైపుచూడక శ్రీరామునివైపు చూస్తూవుండిపోయాడు. సీతమ్మ హనుమను పిలిచి ఆకానుకను యిచ్చింది. హనుమ శ్రద్ధాభక్తితో ఆకాను

కను స్వీకరించి ధరించాడు. హారమును ధరించుటచేత హనుమ శోభ ద్విగుణితమయింది. సభాసదులంతా మురిసిపోయారు. తేజస్సు, ధైర్యము, కీర్తి, దక్షత, సామర్థ్యము, నీతి, వినయము, పౌరుషము, పరాక్రమము, బుద్ధి ఈ పదిగుణాలు హనుమలో పూర్తిగ వున్నట్లుగా అందరూ భావిస్తారు. ఈయన భక్తిని గురించి వేరే చెప్పనవసరంలేదు. శత్రువులుగూడా ఈయన భక్తికి లొంగిపోతారు. ఇందుకుగాను సీతమ్మ ఎంపికను అందరూ సర్వసమ్మతిన అంగీకరించారు. కాని హనుమ మరో తమాషా చేయసాగాడు.

హనుమ హారాన్ని కంఠంలోధరించి నోటితో నామోచ్ఛారణచేస్తూ నేత్రాలతో శ్రీరాముని రూపసౌందర్యాన్ని చూస్తూ మధ్య – మధ్య హారంలోనుంచి ఒక్కొక్క మణిని తీసి దంతాలతో కొరికి చూచి విసిరేస్తున్నాడు. అందరూ ఈవింతను చూస్తున్నారు, ఎవరికీ ఏమి అనడానికి సాహసం కలగడం లేదు. చివరికి విభీషణుడు వుండలేక అల్లానికి కోతిరుచి ఎలా తెలుస్తుందని అంటారు–అని అన్నాడు.

ఈమాటకు శ్రీరాముడు నవ్వి–ఓ రాక్షసరాజా? కోతికి ఏం తెలుసు అల్లంరుచి, అని అనండి, అనిఅన్నాడు.

విభీషణుడు – అవును, నేను పొరపాటుపడ్డాను. చూడండి ఈ హనుమ పని ఎలావుందో, ఎటువంటిదివ్యహారం ఎంతటి మణిపూసలు, ఈకోతి కొరికి పారేస్తున్నది.

శ్రీరాముడువిని ఏమీమాట్లాడక నవ్వి వూరుకున్నాడు. హనుమ ఏమిటి మీరు అంటున్నది? రాక్షసులు ఎక్కువగా అల్లం తింటూవుంటారు. అందుకే వారికి అల్లంరుచి బాగుగా తెలుసు.

విభీషణుడు — తినకపోతే నీమాదిరిగా వున్నామా? ఇంతటి విలువైన హారాన్ని పాడుచేస్తున్నావు?

హనుమ – ఏమీలేదు, సీతమ్మ దీనిని మిక్కిలి విలువైనదిగా భావించే ఇచ్చిందిగదా అని చూస్తున్నాను. ఈమణిపూసలలో నాఇష్ట దేవుడు రాముడు వున్నాడో లేడో అని చూస్తున్నాను. దేనియందు శ్రీరాముడు వుంటాడో అదే విలువైన వస్తువు. – శ్రీరాముడు లేని వస్తువు విలువలేనిది. వీనిలోఎక్కడా నారాముడుకనుపించడంలేదు. గనుకవ్యర్థంగా భావించి విసిరేస్తున్నాను.

ఇందుకు కొద్దిగా కోపంవచ్చి విభీషణుడు–ఈమణులలో శ్రీరాముడులేడు. పర్వతంమాదిరి శరీరంతో తిరుగుతున్నావు. మరి ఇందులో శ్రీరాముడు వున్నాడా?

ఈ మాట వినేసరికి ఆవేశంవచ్చి – ఓ రాక్షసరాజా? నా శరీరంలో శ్రీరాముడు లేకపోతే, శ్రీరామనామమే లేకపోతే నేను దీన్ని ఒక్కక్షణంగూడా ధరించివుండేవాడనుకాను. మీకు నమ్మకం లేకపోతే చూడండి.– అని హనుమ వజ్ర

సమానమైన గోళ్ళతో తన వక్షస్థలాన్ని చీల్చాడు. అందరూ ప్రత్యక్షంగాచూశారు, ఆయన హృదయంలో శ్రీ సీతారాములు ఆసీనులై వున్నారు. ప్రతి రోమమునుండి రామనామధ్వని వెలువడుతున్నది.—



ఇది చూడగానే అందరికి ఆశ్చర్యం కలిగింది. శ్రీరాముడు హనుమను గాఢంగా కౌగలించుకున్నాడు. భగవానుని ఆలింగానికి హనుమ తిరిగి ఆరోగ్యవంతుడైనాడు.

ఈ విధంగా హనుమ మహిమనుచూపి భగవాన్ అతనిని సర్వులకు ప్రియునిగా జేశాడు. అప్పుడు హనుమ లోపలవెలుపల శ్రీరామమయుడని అందరూ అంగీకరించారు.

శ్రీరామునకు ఇతను మిక్కిలి ప్రియసేవకుడు. కష్టపూరిత మైన సేవను ఇతనికే అప్పగిస్తారు. ఈయనమాత్రం ఎంతో ఉత్సాహంగా చేస్తాడు. ఒక విధంగా హనుమ భగవంతునికి బాహ్యప్రాణమే. భరత, లక్ష్మణ శత్రుఘ్నులు ఇతనిని విశేషంగా గౌరవిస్తారు. హనుమ అందరూ చెప్పేదాన్ని చేస్తూగూడా శ్రీరాముని సేవలన్నిటినీ తానే స్వయంగా చేయాలనుకుంటాడు. చిన్న సేవలపట్లగూడా ఈయనకు సంకోచముండదు. సేవకు చిన్నా పెద్దా ఏమిటి? సేవఅంటే సేవే, స్వామికి దేనివలన సుఖం కలుగుతుందో అదేసర్వోత్తమ సేవ. ఇందులకే శ్రీరాముని సేవలన్నిటిలో ఈయనకు ముఖ్యమైన స్థానముంటుంది.

కౌసల్య మొదలగు తల్లులు ఈయన్ని మిక్కిలి ఆద రిస్తారు. శ్రీరాముడు ప్రసాదాన్ని స్వీకరించాక మిగతా ప్రసాదానికి అధికారి ఈయనే. కౌసల్య ఇతన్ని తనఎదుట కూర్చునబెట్టుకుని ప్రేమతో తినిపిస్తుంది.

హనుమ సీతమ్మకి ముద్దుబిడ్డ. ఇతనిపట్ల ఆమెకు పూర్ణవాత్సల్యభావముంది. ఆమె హనుమ వచనములన్నిటినీ పాటిస్తుంది.

హనుమను అయోధ్యకు పోలీసుఇన్స్పెక్టరుగా భావించే వారు. అందర్నీ చూస్తూవుండేవాడు. ప్రజలు తమ ప్రాణాల కంటే మిన్నగా తలుస్తారు. శ్రీరాముని వరకు వెళ్ళనవసరం

లేదు. అన్నిపనులు ఈయనే చక్కబెట్టుతాడు.

రామనామాన్ని స్మరించువారిని ఈయన అన్నివేళలా కాపాడుతూ వుంటాడు. రామనామ జాపకులు ఈయనకు ప్రాణాధికప్రియులు. ఈ విషయానికి సంబంధించిన ఒక సంఘటన గలదు. రామనామాన్ని శుచిగా గాని, అశుచిగాగాని ఎవరు ఏస్థితిలో జపించినా, స్మరించినా అట్టివారిని ఈయన అన్నివేళలా రక్షిస్తూవుంటాడు.

ఒక మహాత్ముడుండేవాడు, ఆయన తన భక్తునితో_ నాయనా! మానవజన్మ మాటి-మాటికి లభించదు, అవకాశమున్నంతవరకు రామనామాన్ని జపించు, అని అన్నాడు.

అతను-అయ్యా? జపంచేసుకుందామని అనుకుంటాను. కాని ఈ సంసారం మాయాజలంలాంటిది. ఇందులోపడి కొట్టుకుంటూవుంటాను. బొత్తిగా అవకాశంచిక్కదు. ఉదయం 6 గంటలనుంచి రాత్రి 12 గంటలవరకు తన కార్యక్రమాన్ని వినిపించాడు.

మహాత్ముడు - సరే, ప్రాతః సాయం సమయములందు తోటకు వెళ్ళేటప్పుడు, మలవిసర్జన చేయునప్పుడు నిశ్చింతగా రామనామాన్ని స్మరించు.

పెద్దమనిషి — అయ్యా? మలవిసర్జన చేయునపుడు మాట్లాడడంకూడా నిషేధించారు కదా, మరి రామనామాన్ని స్మరించవచ్చునా?

మహాత్ముడు—నాయనా? రామనామాన్ని స్మరించడంలో ఏమీ తప్పులేదు. శుచిగా గానీ అశుచిగా గానీ అన్నివేళలా స్మరించవచ్చును. ఈరోజునుండి నీవు మలవిసర్జన చేయునపుడు రామనామాన్ని స్మరించు,

మహాత్ముని ఆదేశానుసారం ఆ పెద్దమనిషి మలవిసర్జన చేయుకాలమున రామనామాన్ని స్మరించసాగాడు. ఒకరోజున మలవిసర్జన చేయుచుండగా హనుమ వస్తున్నాడు. అశుచిగా వుండి ఎవడో మూర్ఖుడు నాస్వామి పావన నామాన్ని స్మరిస్తున్నాడు- అని అనుకొని ఒక్కదెబ్బకొట్టి వెళ్లిపోయినాడు. సాయంత్రం భగవంతుని శరీరానికి సేవచేయుచుండగా వీపు పైన వేళ్లుపొంగివున్నట్లు చూచాడు, ఆభాగం నల్లబడివుంది. హనుమకు ఆశ్చర్యం కలిగి-ప్రభూ! ఏ దుష్టుడు మిమ్ములను కొట్టాడో, చెప్పండి. ఇప్పుడేవెళ్ళి అతనిని దండించివస్తాను.

భగవాన్ - నాయనా? ఏమీ లేదులే. ఈ విషయాన్ని విడిచిపెట్టు, కాని హనును ఒక పట్టాన ఒప్పుకుంటాడా?

హనుమ — లేదు ప్రభూ, అతని పేరుమాత్రం చెప్పండి. అని గట్టిగా పట్టుపట్టాడు. ఎంత నివారించినా వినలేదు. అప్పుడు భగవాన్- నాయనా? అతనిపేరు హనుమాన్.

మిక్కిలి సంభ్రమంతో భయభీతుడై హనుమ - భగవాన్? నేను ఎప్పుడైనా ఇలాంటి దుస్సాహసం చేయగలనా?

భగవాన్ – ఇక వదిలిపెట్టవోయి ఆ విషయాన్ని. నీవు అడిగావు గనుక చెప్పాను.

హనుమ – నేను తెలిసినంతవరకు ఏమీ చేయలేదే! దయయుంచి చెప్పండి.

భగవాన్ – నాయనా? తెలియక చేసినతప్పు క్షమించ బడుతుంది.

హనుమ – నాకు ఏమీ జ్ఞాపకంరావడంలేదు. ఈతప్పు ఎప్పుడు జరిగిపోయిందో?

భగవాన్ – చూడు నాయనా? ఆ పెద్దమనిషి ఎంతో ప్రేమతో నా నామాన్ని స్మరిస్తున్నాడు. అతనికి మరెప్పుడూ అవకాశం చిక్కడంలేదు. నీకు ఈ విషయం చెడ్డగా అనిపించింది. నీవు ఒకేదెబ్బ కొట్టావు. నీ ఒక్క దెబ్బకి వేలఏనుగుల బలము గలిగినరావణుడు మూర్ఛితుడైనాడు గదా, నీదెబ్బకి పాపం అతను ఏమైవుండేవాడో, ఆదెబ్బను నేను సహించాను.

ఈ విషయాన్ని విని హనుమ లజ్జితుడై ఆ రోజునుంచి హనుమగూడా రామనామాన్ని శుచిగా లేక అశుచిగా గానీ స్మరించువారిని రక్షిస్తానని ప్రతిజ్ఞచేశాడు. ఈ కారణంగా రామనామ రసికుడగు హనుమ అందరికి ప్రియుడైనాడు.

హనుమంతునికి వున్నన్ని మందిరాలు బహుశ శ్రీరామునకు గూడా వుండి వుండవు. ఎందుకనగా రామ మందిరాలలో ఈయన ఎలాగూ వుండవే వుంటాడు. భయంకర అడవులలో, గ్రామాలలో, నగరాలలో హనుమ నిర్భయంగా వుంటాడు.

శ్రీరామ జయరామ జయ జయ రామ

# కౌతుకీ హనుమాన్

## 16

చరిష్యతి కథా యావదేషా లోకేచమామికా।
తావత్తే భవితాకీర్తిః శరీరేవ్యసవస్తధా॥ *

భగవంతునకు అమాయకతఅంటే చాలాఇష్టం. అమాయకులతో వేళాకోళం చేయడం అందరికి సరదాగా వుంటుంది. దృష్టిలో సమానత్వం కలవారు ఎవరినీ చెడ్డగా భావించరు. నిష్కపటభావంతో అందరి మాటలను నమ్మువారు అమాయకులనబడతారు.

మాతాకౌసల్యకు హనుమ మిక్కిలిముద్దుబిడ్డ, ఒకనాడు ఆయన పుట్టిరోజుపండుగ వచ్చింది. కౌసల్య ఆ పండుగను ఎంతో వైభవంగా జరుపుతుంది. పాటలుపాడిస్తుంది. అందరికి పిండివంటలతో భోజనం పెడుతుంది. హనుమ పుట్టినరోజు మంగళవారం. ఈయనకు భగవంతునికి సేవ చేయడంలో లభించినంతగా మరేపనిలో లభించదు. సేవకునకు సేవ చేయునపుడు అహంభావం కలగడం సహజమేగదా. హనుమ

---

* హనుమతో భగవాన్ అంటున్నాడు - హనుమా! ఈ లోకంలో నా కథ వుండువంతవరకు నీవు జీవించివుంటావు, నీ కీర్తిగూడా చిరస్థాయిగా వుంటుంది.

ఎవరన్నా భయపడడు. ఒకటి- ఏమంటే స్వయంగా మహా వీరుడు. రెండు- రామునికి ప్రియసేవకుడు, మూడు - అమాయక హృదయం గలవాడు. పుట్టినరోజుకు ముందురోజు రాత్రి ఆయన భగవంతునికి పాదము లొత్తుతున్నాడు, సేవ చేయునపుడు మిక్కిలి ఆనందం కలుగుతున్నది. సీతమ్మమాటి మాటికి వెలుపలకు వెళ్ళమంటున్నది. అర్ధరాత్రి వరకు సేవ చేస్తూనే వున్నాడు,

సీతమ్మ - నాయనా! ఇక వెళ్ళు. విశ్రాంతి తీసుకోనిస్తావా, లేదా?

హనుమ - మిమ్మల్ని విశ్రాంతి తీసుకొనవద్దని నేను ఎప్పుడు అన్నానండి. మీరు హాయిగా విశ్రమించండి. నేను ఈ రోజు రాత్రంతా సేవ చేస్తాను.

సీతమ్మ మనస్సులో నవ్వుకుని - నీవు పూర్తిగా వానరుడవే; చూడు రాత్రిపూట భగవంతునిదగ్గర ఎవరూ వుండరాదు.

హనుమ - అయితే మీరు ఎందుకు వుంటున్నారు?

భగవంతుడు ఇద్దరిమాటలు విని తనలో తాను నవ్వుకుంటున్నాడు.

సీతమ్మ - నామాట వేరు, నాయనా?

హనుమ - మీలో ఏమి విశేషముంది.

సీతమ్మ - ఏమంటుంది. చివరకు విసిగి నీవు ఇక్కడ నుంచి లేచి వెలుపలకు పద, చెబుతాను, అని అన్నది.

హనుమ లేచి నిలబడ్డాడు. ఉత్తర భారతదేశంలో పుణ్యస్త్రీలు తమ పావడిలో మాంగలిక చిహ్నంగా సింధూరాన్ని ధరిస్తారు.దక్షిణాదిన స్త్రీలు మంగళసూత్రాన్నిధరిస్తారు. దానిని వివాహ సమయంలో భర్త కట్టుతాడు. ఉత్తరదేశంలో భర్త సిందూరాన్ని దానం చేస్తాడు. సిందూరాన్ని పుణ్యస్త్రీల సౌభాగ్యసూచకంగా భావిస్తారు, సీతమ్మ తన సిందూరాన్ని చూడమని - నాలో ఈ విశేషత వున్నది, గనుక నేను లోపల వుండ గలను— అని అన్నది.

అప్పుడు హనుమ వెలుపలికి వెళ్ళాడు. మరుసటిరోజు బజారుకి వెళ్ళి ఒక వ్యాపారిని- నీదగ్గర సిందూరం, వుందా? అని అడిగాడు.

అయోధ్యా వాసులు హనుమను మిక్కిలి ప్రేమిస్తారు వ్యాపారి - మహా రాజ్? గోనెసంచినిండా సిందూరం వుంది. మీకు కావలసినంత తీసుకొని వెళ్ళండి.

హనుమ ఆ సిందూరాన్నంతా తీసుకొనివచ్చి నూనెలో కలిపి తన శరీరానికి పులుముకొని రాజదర్బారులోకివచ్చాడు. అక్కడ సీతారాములు ఆసీనులై వున్నారు. హనుమను ఈ వింతవేషంలో చూచి సభాసదులందరూపక పకనవ్వారు. కాని అడిగే సాహసం ఎవరికీలేదు. శ్రీరాముడు నవ్వి - హనుమా?

ఈ రోజు ఈ వికృతవేషం ఏమిటి? సిందూరాన్ని ఎందుకు పులుముకున్నావు?

హనుమ మాయామర్మం లేకుండా—మహారాజ్? సేవాధికారాన్ని పొందడానికి ఇలా చేశాను. సీతమ్మ కొద్దిసిందూరాన్ని ధరించి మీ సేవలో ఎల్లప్పుడూ వుండగలుగుతున్నది. నేను గోనెసంచీ సిందూరాన్ని పులుముకున్నాను. గనుక అహర్నిశలు మీ సేవలో వుండే అధికారాన్ని అనుగ్రహించాలి.

శీతమ్మకు నవ్వు వచ్చింది. శ్రీరాముడు నవ్వుతూ–ఈ రోజు మంగళవారం. మంగళవారంనాడు ఎవరు హనుమంతుని



విగ్రహానికి నూనెతో కలిపిన సిందూరాన్ని పులుముతారో అట్టివారి కోరికలన్నీ నెరవేరుతాయి. ఆరోజునుంచి వేటివరకు

ఆయన నిగ్రహానికి నూనెతో కలిపిన సిందూరాన్ని అర్పిస్తు న్నారు. మన ఈ అమాయకుడైన హనుమను గురించి మరి ఒక రసవత్తరమైన కథను వినిపించుతాను. శ్రద్ధగావినండి.

హనుమంతునిలో బలము, బుద్ధి, స్ఫూర్తి, శక్తి, పరాక్రమము మొదలగు గుణాలు వుండుటచేతనే శ్రీరామునికి మిక్కిలి ప్రియుడైనాడు. సేవ చేయాలని అమిత ఉత్సాహం ఉండేది. భగవంతుని సేవలన్నిటినీ తానొక్కడే చేయాలను కొనేవాడు. భగవాన్ ఏదైనా పని అప్పగించితేచాలు. శతయోజనాల దూరంలోవున్నా సరే పూర్తి చేసుకొనివచ్చి మరొక సేవలో నిమగ్నుడయేవాడు. ఎవరిని సేవ చేయ్యనిచ్చేవాడు గాడు. ఇందుచేత భరత, లక్ష్మణ, శత్రుఘ్నులు సీతమ్మ, ఇంకా ఇతర సేవకులకు హనుమపట్ల ఈర్ష్యగలిగి ఆలోచించారు. హనుమ మనలో ఎవరినీ సేవ చేయనివ్వడంలేదు గనుక ఏదోఒక విధంగా ఈయనను సేవాకార్యమునుంచి తప్పించాలి అని అందరూ సమావేశమై ఉదయంనుంచి రాత్రివరకు సేవల జాబితావ్రాసి పరస్పరం పంచుకొని శ్రీరాముని స్వీకృతి తీసుకుందామని నిశ్చయించారు. భగవంతుని స్వీకృతిగురించి ప్రశ్న వచ్చింది.

శత్రుఘ్నుడు:— ఈ పని లక్ష్మణునకు అప్పగించుదాం, అని అన్నాడు.

లక్ష్మణుడు —తమ్ముడూ, ఇది నావలన సాధ్యపడదు, భరతుడు మనలో పెద్దవాడుగదా? ఆయనను పంపితే బాగుంటుంది.

భరతుడు — చూడు తమ్ముడూ? మీరు ఏ పనులు చెప్పినా చేస్తాను. అయినవైపు కన్నెత్తిచూచే సాహసంగూడా నాకులేదు.

సీతమ్మ - మీరంతా ఎందుకయ్యా బాధపడతారు. నేను స్వీకృతి తీసుకొని ముద్రగూడా వేయిస్తాను అని ఈ కార్యక్రమాన్ని సీతమ్మ తీసుకొనేసరికి అందరికి సంతోషం కలిగింది.

రాత్రి ఏకాంతంగా ఉన్న సమయంలో సీతమ్మ - ఏమండీ, మీరు ఒక కాగితంపైన సంతకంచేయాలి అని అన్నది.

భగవాన్— ఎలాంటి కాగితంపైన?

సీతమ్మ—మేమందరమూ నానావిధులను పంచుకున్నాం. దానికి మీ స్వీకృతి కావాలి. ఇదిగో చూడండి. అని జాబితా చేతికియిచ్చింది.

భగవాన్ జాబితాను జాగ్రత్తగా చూచాడు, కానిహనుమ పేరు మాత్రం ఎక్కడా లేదు. తనలో తాను నవ్వుకొని ఏమీ మాట్లాడకుండా దానిపైన సంతకం చేశాడు.

సీతమ్మ - దీనిపైన కొంచెం రాజముద్రికనుగూడా వేయించండి.

భగవాన్ - రాజముద్రిక ఇక్కడ ఎక్కడ? లేవి రాజ

సభలో వేయించాలి. రెండవరోజున జాబితాపైన ముద్రవేయిం చారు. సర్వ సమ్మతిన ఆ జాబితా పాసైపోయింది,

మరునటిరోజున హనుమ ఏసేవచేద్దామన్నా అడ్డువచ్చి ఈ సేవ నాది, ముందుకురాకు, అని అంటున్నారు ఇతర భక్తులు, సీతమ్మతో సహా.

ఇద్దరు ముగ్గురు ఈ విధంగాచెప్పేసరికి హనుమ ఇవాళ ఏమైంది? మీరంతా సేవలను పంచుకున్నారా? అని అడిగాడు.

లక్ష్మణుడు - నీకు తెలియదా? అందరికీ సేవలను పంచడం జరిగింది. రాజముద్రికనుగూడా వేశారు. మహారాజు గూడా స్వీకరించి తన సంతకం చేశారు.

హనుమ - అయితే, జాబితా ఎక్కడ? నేనుగూడా చూస్తాను,

సేవల జాబితాల ప్రతులు ఎన్నో తయారు చేశారు. అందరి దగ్గరఉన్నాయి. లక్ష్మణుడు తన జాబితాను చూపిం చాడు. అందరూ గుమిగూడారు. హనుమ జాబితాను మొదటి నుంచి చివరిదాకా ఎన్నోపర్యాయములు చూచాడు. అందులో ఎక్కడా తనపేరు కనబడలేదు. హనుమ - ఇందులోనా సేవను ఎక్కడా ఉదహరించలేదు, అని అన్నాడు.

సీతమ్మ - నీవు ఆ సమయంలో లేవు, నిద్రించు తున్నావు. మేల్కొని వున్నవారికి లభించింది.

హనుమ గంభీరంగా - ఆ సమయంలో లేకపోవచ్చు, మరి ఇప్పుడు వున్నానుగదా, ఏ చిన్న సేవ లభించినాచాల్లు, అని అన్నాడు.

సీతమ్మ-నాయనా? వాత్రికోతలన్నీ అయిపోయాయి. రాజముద్రికనుగూడా వేశారు. ఈజాబితాలో లేని సేవ ఏదైనా వుంటే అదినీది.

హనుమ జాబితాను జాగ్రత్తగా చూచాడు. చిన్న చిన్న సేవల్నిగూడా ఉదహరించారు.

హనుమ జ్ఞానులలో అగ్రగణ్యుడుగదా, సరే, భగవంతునకు ఆవలింత వచ్చినప్పుడు చిటిక ఎవరువేస్తారు? ప్రభువుకు ఆవలింత వచ్చినప్పుడు చిటికవేయడం ఎంతైనా అవసరం అని అన్నాడు.

ఈ విషయాన్ని విని సభాసదులంతా నవ్వారు?

సీతమ్మ-సరే, చిటికవేయడం నీవంతు. ఈరోజునుంచి నీవు చిటిక దాసుడవన్నమాట.

హనుమ - జాబితాతో నా సేవనుగూడా జేర్చాలి. రాజముద్రిక వేయించాలి.

అందరూ అంగీకరించి జాబితాలో చేర్చి రాజముద్రిక వేయించారు. వెంటనే చిటిక వేయడానికి వీలుగా శ్రీరాముని ఎదుట పీఠాసనం వేసుకొని కూర్చున్నాడు. రాజసభ జరుగు

తున్నంతవరకు శ్రీరామునికి అభిముఖంగా చిటిక వేయడానికి ఉద్యుక్తుడై చూస్తూవున్నాడు. భగవంతుడు వెళ్ళిపోతూవుంటే హనుమ గూడా ఆయనకు ఎదురుగా ముఖాన్ని పెట్టి ఎదుటి దిక్కుగా నడుస్తున్నాడు. భగవంతుడు రథంపైన కూర్చుంటే హనుమగూడావచ్చి కూర్చున్నాడు. భగవాన్ బంతిఆట ఆడు తుంటే అక్కడగూడా చూస్తూవున్నాడు. భగవంతుడు భోజనం చేస్తుంటే అక్కడికి వచ్చి హనుమ కూర్చున్నాడు. మాతా కౌసల్య అన్నది - హనుమా? శ్రీరామునివైపు తదేకదృష్టితో చూస్తున్నావు. ఏమిటి విసేషం?

హనుమ - అమ్మా? ప్రస్తుతం నేను నాకిచ్చిన సేవలో నిమగ్నుడనై వున్నాను. ఈరోజు భగవంతుని ప్రసాదాన్ని తీసుకొనను. నాకు ఇక్కడే ఇవ్వండి. విధి నిర్వహణలో వుండి ఒక చేతితో తీసుకుంటాను. భగవానుని వెంట వుండాలి, అని భగవంతునితోపాటు లేచి వెళ్ళాడు. భగవాన్ శయ్యపైన పరున్నా హనుమకూడా తిష్ఠ వేసుకొని వారి ఎదుట కూర్చొనే వున్నాడు.

సీతమ్మ - నాయనా? ఇక వెళ్ళు, విశ్రాంతి తీసుకో.

హనుమ - విశ్రాంతి తీసుకోవడం ఎలా? రాత్రి అంతా ఇక్కడే వుండాలి.

సీతమ్మ - నాయనా? నీవు పగలంతా వెంటాడావు. రాత్రి అయింది. ఇప్పుడైనా వదలి వెళ్ళు.

హనుమ - ఎలా వెళ్ళను? నేను నా విధి నిర్వర్తిస్తాను. మీరు మీ సేవ చేసుకోండి.

సీతమ్మ - నీవు పూర్తిగా కోతివలెపించుకున్నావు. నీవు ఇక్కడ వుండగా నేను సేవచేయడం ఎలా?

హనుమ - బాగుంది. మీరు వుండగా మేము మా సేవ చేస్తున్నప్పుడు మీరుమాత్రం మేముండగా మీ సేవ ఎందుకు చేసుకొనరాదు?

సీతమ్మ - కోతివైన నీకు నేను ఎలా తెలియజెప్పను. నీవు కనుక వివాహం చేసుకొనివుంటే చెప్పివుండేదాన్ని. చూడు, హనుమా? ఏకాంతంలో తల్లి - దండ్రులున్నచోట పుత్రులుండరాదు. నీవు ఇక వెళ్లనాయనా? తిరిగి ఉదయమే వచ్చి సేవలో పాల్గొనుము.

హనుమ — బాగుంది. ఈ రాత్రి స్వామికి ఆవలింత వస్తే ఎవరు చిటిక వేస్తారు?

సీతమ్మ — వెళ్ళిపో? నీకు బదులు నేను వేస్తానులే.

హనుమ - మీ జాబితా తీసిచూపించండి. నేను మీ సేవను తీసుకొన నప్పుడు మీరుమాత్రం నా సేవను ఎందుకు తీసుకుంటానంటున్నారు?

చివరికి విసుగుకొని సీతమ్మ—నీలాంటి అడవి జంతువుకి

ఎలా నచ్చజెప్పను. అంటూ హనుమను వెంటనే బయ టికి గెంటి లోపలనుంచి తలుపు గడియవేసుకుంది.

హనుమ - భగవంతునకు ఎక్కడ ఆవలింత వస్తుందో అని రాత్రి అంతా ఒక ఇంటి పిట్టగోడపైన కూర్చుని చిటిక వేయ నారంభించాడు. నోటితో నిరంతరమూ రామనామాన్ని స్మరిస్తూ చేతుల్తో చట్ - చట్ అని చిటిక వేస్తున్నాడు.

ఏ భక్తుడు ఏరీతిన నన్ను కొలుస్తాడో నేనుగూడా అదేరీతిన అతనిని కొలుస్తాను. అని భగవంతుని ప్రతిజ్ఞ. భక్తుడు నిరంతరమూ చిటిక వేస్తున్నాడు. భగవంతుడుగూడా ఆవలిస్తున్నాడు. నోరు మూత పడడంలేదు. జానకి - ఏమండీ! ఏమిటి. ఇలా అంటున్నారు, అని అడిగింది. భగవంతుని ప్రాణాలు తన ప్రియభక్తుని దగ్గరే వున్నాయి. నోటితో ఏమీ అనడంలేదు. "భో" "భో" అని అంటున్నారు.

కౌసల్య శ్రీరాముని దగ్గరకు వచ్చి చూచి విలపించ నారంభించింది. ఈ విషయాన్ని విని భరతుడు, లక్ష్మణుడు, శత్రుఘ్నుడు. సేవకులు, మంత్రులు, సామంతులు అందర్నూ వచ్చారు. శ్రీరాముని చూచి విస్మితులైనారు. కౌసల్య - నాయనా? ఎవరైనా వెళ్ళి గురువుగార్ని పిలిచిరండి. లంక లోని రాక్షసుడెవడో ఇతని శరీరంలో ప్రవేశించి వుంటాడు గురువుగార్కి కబురు అందినవెంటనే వచ్చారు. కౌసల్య-గురువు

గారూ? ఏదైనా ఉపాయం చెప్పండి. నా ఈ పిల్లవాడిని రక్షించండి.

కౌసల్యమాట విని వసిష్ఠులవారు నవ్వారు. రాక్షసుడు ఏమిచేస్తాడు. ఆయన శ్రీరాముని శిరస్సున చేతిని నిమురుతూ - రామభద్రా? ఏమిలీల చేస్తున్నావు?

వరుండి, శ్రీరాముడు గురువుగారిపాదాలను స్పర్శించాడు. నోటితో మాట్లాడకుండా "భోం" "భోం' అని అంటున్నాడు. వసిష్ఠులవారు నలువైపులా చూచారు? కాని హనుమాన్ కనుపించలేదు. ఆయన హనుమ ఎక్కడ? అని అడిగారు,

అందరూ మౌనంగా వున్నారు. సీతమ్మ - మహరాజ్? అందరూ కలిసి హనుమకి అన్యాయం చేశారు. అతన్ని సేవలోనుంచి తొలగించారు. ఇక్కడే ఎక్కడో ఏడుస్తూ వుండివుంటాడు. అంతే, వసిష్ఠులవారికి అంతా అర్థమయింది. హనుమను తీసుకొని రమ్మనమన్నారు.

హనుమ కొరకు చూచారు. గోడపైన కూర్చొని - చట్ - చట్ అని చిటికవేస్తూ రా మ నా మా న్ని స్మరిస్తున్నాడు. అందరూ వెళ్ళి - హనుమా? దిగిరావయ్యా? గురువుగారు పిలుస్తున్నారు.

కళ్ళుమూసుకునే హనుమ సేవలో నిమగ్నత చెంది వున్నాడు. మీరు దయవుంచి అడ్డురాకండి-అని అన్నాడు.

ఎంత పిలిచినా హనుమ రాలేదు. శత్రుఘ్నుడు వెళ్ళి గురువుగారికి అన్నివిషయాలు చెప్పాడు. స్వయంగా గురువు గారు వెళ్ళి హనుమచేతుల్ని పట్టుకొని హనుమా? చిటిక వేయడం మానవయ్యా? నీసేవలను నీకు ఇప్పించుతాను. అని హనుమను శ్రీరామునిదగ్గరకు తీసుకొనివెళ్ళాడు.

హనుమ చిటికి వేయడం మానేశాడు. రాముడు భోం"భోం" అనడం ఆపుచేశాడు. హనుమ శ్రీరాముని పాద పద్మములకు నమస్కరించాడు. సీతమ్మ నాయనా? ఈరోజు నుంచి అన్ని సేవలునీవే. నీవు ఏమిచేయదలచుకుంటే దాన్ని చెయ్యి. ఇలాంటి లీలమాత్రం మరెప్పుడూ చేయకు, అన్నది.

భగవాన్ స్వస్థుడై నలువైపులా చూచాడు. గురువు గారికి నమస్కరించి ఏమి తెలియనట్లుగా మీరంతా ఇక్కడకు ఎందుకు వచ్చారు, అమ్మగారు ఎందుకు పిలపిస్తున్నారు?

వసిష్ఠులవారు-ఏమీలేదు రాఘవా? మేమంతా ఇక్కడికి మీభక్తవత్సలత నాటకాన్ని చూడడానికి వచ్చాము. భక్తులపైన మీరు ఎందులకు అనుగ్రహించరు? ఈ విధంగా రక్షించుట చేతనే మిమ్ములను కరుణాసముద్రులని పిలుస్తారు.

తరువాత వసిష్ఠులవారు శ్రీ రామునిద్వారా పూజింపబడిరి. అందరూ తమ తమ స్థావరాలకు వెళ్ళారు. మన హనుమ ప్రభు పరిచర్యలోపండితుడు, సేవకాగ్రణ్యుడు.

శ్రీ రా మ ర క్ష స ర్వ జ గ ద్ర క్ష

# అశ్వమేధీయ అశ్వరక్షక హనుమాన్

# 17

స్వరూపమమలం బ్రహ్మ చింతయస్వ దివానిశం.
త్వత్కృతం మత్కృతం కర్మ మత్కృతం త్వత్కృతం తథా॥*

శ్రీరాముడు తన భక్తులకు గొప్పతనాన్ని ప్రసాదిస్తాడు. వారికి అభిమానం కలుగకుండా ఎల్లప్పుడూ చూస్తాడు. శ్రీరాముని అనుగ్రహం వలన అన్ని కార్యాలు నెరవేరుతాయి సర్వత్రా విజయమే కలుగుతుంది. ఎక్కడున్నా పరాజయం కలుగుతున్నట్లనిపిస్తే భగవాన్ మన మనస్సులో కలుగుతున్న గర్వాన్ని నాశనం చేస్తున్నట్లుగా భావించాలి. శ్రీరాముని కార్యాన్ని సుఖ–దుఃఖాల, లాభ–నష్టాల, జయ–పరాజయాల విచక్షణ లేకుండా చేయాలి.

శ్రీరాముడు తన సమయాన్నంతా యజ్ఞ యాగాదులతో గడిపేశాడు. ఎందుకనగా ఆయనకు శత్రు

---

* శ్రీరాముడు హనుమతో ఇలా అన్నాడు — హనుమా! నా నిర్మలమైన బ్రహ్మస్వరూపమైన సత్యస్వరూపాన్ని అహర్నిశలు చింతించుము. ఇలా చేయడంచేత నీవు చేసిన పని నాదిగాను నేనుచేసినపని నీదిగాను అవుతుంది.

వనేవాడే లేడు. ఆయన రాజ్యంలో ఎక్కడా అధర్మం లేదు. ధర్మం నాలుగు పాదాల నడిచేది. కాలమంతా ధార్మిక కార్య క్రమాలలో నడుస్తూ వుండేది.

అశ్వమేధీయ యజ్ఞాశ్వ పరిరక్షణకు శత్రుఘ్న, భరత, సుగ్రీవ, హనుమలను నియమించారు. చాలామంది రాజులతో యుద్ధం జరిగింది. హనుమ ఆ యుద్ధాలలో తన పరాక్రమాన్ని ప్రదర్శించాడు. చక్రాంక నగరంలో రాజా సుబాహుడు అశ్వాన్ని పట్టుకున్నాడు. అతనితో గూడా భయంకర యుద్ధం జరిగింది. యుద్ధకాలంలో హనుమ అతని వక్షస్థలాన ఒక్క తన్ను తన్నాడు, వెంటనే సుబాహుడు మూర్ఛితుడైనాడు. మూర్ఛావస్థలో అతను శ్రీరాముని దర్శించాడు. బ్రహ్మాది దేవతలద్వారా శ్రీరాముడు పూజింప బడుతూ, స్తుతిస్తూ వుండడం చూచాడు. తెలివివచ్చిన తర్వాత అన్నాడు—"శ్రీ హనుమ పాదస్పర్శప్రభావంవలన పాపశాప విముక్తుడనై భగవానుని దర్శించగలిగాను." అని అతను హనుమకు నమస్కరించి అశ్వాన్ని తిరిగి అప్పగించాడు. తదుపరి అయోధ్యకు వెళ్ళి శ్రీరామునకు ఎన్నోకానుకలు అర్పించాడు. ఈయజ్ఞంలో సహాయకుడుగా వున్నప్పుడు హనుమకు శంకరునకు యుద్ధం జరిగింది. విషయం ఏమంటే దేవపురానికి చెందినరాజు వీరమణి శివభక్తాగ్రేసరుడు. అతని భక్తికి మెచ్చి, శంకరుడు వరము కోరుకోనమన్నాడు. అప్పుడు

అతడు పత్రిభూ? నాకు ఆపదవచ్చినపుడు, నారాజధానిపైన ఎవరైనా దాడిచేసినపుడు రక్షించండి, అని వరము కోరాడు. శంకరుడు "తధాస్తు" అని అన్నాడు. ఆరాజు తనను అపరాజితునిగా భావించ నారంభించాడు. భగవానుని అశ్వమేధ అశ్వాన్ని పట్టుకున్నాడు. యుద్ధం జరిగింది,

సాక్షాత్తు శ్రీశంకరుడు తన భక్త వత్సలతను చూపడానికి వీరమణి మహారాజు తరుపున యుద్ధం చేశాడు. శ్రీరాముని సైన్యంలో ముఖ్యమైన వీరులంతా మూర్ఛనొందారు. రామనామ ప్రభావంచేత హనుమ మాత్రమే మేల్కొనివున్నాడు. హనుమ శంకరునితో యుద్ధంచేయ నారంభించాడు ఇదే భగవానుని లీల హనుమంగూడా రుద్రుని అవతారమేగదా, శంకరుడు సాక్షాత్తు రుద్రుడేగదా. పరస్పరం పోరాడుతున్నారు. రెండువైపులా సమానంగా వున్నప్పుడు వేరే చెప్పవలసినదేముంది.

శంకరునితో హనుమ-భగవాన్? మేము శ్రీరాముని సేవకులం. సేవకుల ధర్మాన్ని నిర్వర్తించడానికి మాత్రమే యుద్ధం చేస్తున్నాం. తమరు సర్వసమరులు, శ్రీరాముడు తమ భక్తుడు, అలాంటప్పుడు తమరు శ్రీరామ రాజ్యపాలనలో ఎందుకు అంతరాయాన్ని కల్గిస్తున్నారు?

శంకరుడు-నాయనా? నీవు శ్రీరామ భక్తికి పరవశుడవై యుద్ధం చేస్తున్నావు. నేను నాభక్తుని భక్తికిమెచ్చి యుద్ధం చేస్తున్నాను. భక్తునికి అభయాన్ని ఇచ్చాను.

హనుమ-అయితే సరేనండి. నేనుగూడా యుద్ధాన్ని విరమించను. ఇరువురిమధ్యా కొంతకాలం భయంకరంగా యుద్ధం జరిగింది. హనుమ పరాక్రమానికి మెచ్చి శంకరుడు-వీరాగ్రగణ్యా? నిజానికి నీవు మహావీరుడవు.ఇలాంటి యుద్ధం నీవు మాత్రమే చేయగలవు. నాదెబ్బలను తట్టుకొంటూ నారథాన్ని విరుగగొట్టడం నీకే సాధ్యమయింది. నీపట్ల నాకు మిక్కిలిసంతసంకల్గింది. గనుక ఏదైనా వరము కోరుకొన వలసినది.

హనుమ-తమ అనుగ్రహమే అన్నివరాలలోకి శ్రేష్ఠమైనది.

శివుడు-నీకు ఏమీ అపేక్షలేదని నాకు తెలుసు. అయినా నాసంతోషానికి ఏదైనా అడుగుము.

హనుమ-అయితే, నేను ద్రోణాచల పర్వాతాన్నుంచి ఔషధిని తీసుకొని రానంతవరకు శత్రుఘ్న, పుష్కలులకు, మిగతా మూర్ఛిత సైనికులకు ఏవిధమైన హాని కలుగకుండా రక్షిస్తూ వుంటానని వరమివ్వవలసినది. అని అడిగాడు.

శంకరుడు "తథాస్తు" నీవు తిరిగి వచ్చేవరకు నేను వీరిని కాపాడుతాను, అని అన్నాడు.

హనుమ క్షీరసాగరం దగ్గరవున్న ద్రోణాచలంపైకి వెళ్ళాడు. కాని సంజీవనీ మాలికను మరిచిపోయినాడు. అప్పుడు తన తోకకి కట్టి ద్రోణాచలాన్ని పెళ్ళగించ నారంభించాడు. ఇంతలో ఇంద్రుడు బృహస్పతి మొదలగు దేవతలతో కలిసి అక్కడికి వచ్చాడు. వజ్రాయుధంతో కొట్టుదామనుకున్నాడు. కాని బృహస్పతి రామభక్తుని జయించుట కష్టమనిచెప్పాడు. ఇతనితో ప్రేమపూర్వకంగా సఖ్యంజేసుకొనడం మంచిదని-హనుమా? ఈద్రోణాచలాన్ని ఎందులకు పెళ్ళగించుతున్నావు? అని అన్నాడు.

హనుమ-అయ్యా? యుద్ధంలో శంకరుడు శత్రుఘ్న, పుష్కల, ముఖ్యులను మూర్ఛితులుగా చేశాడు. వారికొరకు సంజీవనీ తీసుకొని వెళుతున్నాను.

బృహస్పతి-అయితే ఈ పర్వతాన్ని తీసుకొనివెళ్ళి ఏంచేస్తావు?

హనుమ-ఔషధిని గుర్తించలేక పోవుటచేత పర్వతాన్నే తీసుకొని వెళ్ళుతున్నాను.

బృహస్పతి-నీకు పర్వతం అక్కర్లేదన్నమాట.సంజీవనీ నాకు తెలుసు. ఆమాలికను నీకు ఇస్తే చాలుగదా?

హనుమ - నాకు ఔషధి కావాలి. అంతే.

బృహస్పతి ఔషధిని వెదికి తీసి ఇచ్చాడు. హనుమ యుద్ధభూమికి వచ్చాడు. పుష్కల శరీరంలో ప్రాణం లేనట్లు గా అనిపించింది. ఔషధిని వాసనచూపుతూ -నేను శ్రీరాముని త్రికరణ శుద్ధిగా భావిస్తూవుంటే ఈ బాలకుడు మేల్కొనాలి. అని అంటూవుండగా పుష్కలుడు లేచాడు.

ఆపైన శత్రుఘ్నునకు వాసనచూపుతూ - నేను జీవిత పర్యంతమూ బ్రహ్మచర్యవ్రతాన్ని పాటించివుంటే ఈ . శత్రుఘ్నుడు వెంటనే జీవించాలి. అని అంటూవుండగా శత్రుఘ్నుడు నిద్రిస్తున్న పురుషుని మాదిరిగాలేచాడు. మరల యుద్ధం సాగింది. కాని శంకరుణ్ని శత్రుఘ్నుడు ఎలా ఓడించగలడు? ఆయనకి మరల మూర్ఛ వస్తూవుంటే చూచి నవ్వి శంకరుడు - నాయనా? అహంభావాన్ని విడిచి పెట్టి అన్నగార్ని స్మరించు.

శత్రుఘ్నుడు రామనామాన్ని స్మరించుట మరిచి పోయినాడు. రామనామాన్ని జపించువాడు ఎల్లవేళలా విర్భయంగా వుంటాడు. హనుమ రామనామ ప్రభావంచేతనే మూర్ఛనొందలేదు.శంకరుడు జ్ఞాపకంచేయగనేరామనామాన్ని స్మరించనారంభించాడు. శ్రీరాముని స్మరించగానే శ్రీరాముడు ప్రత్యక్షమయినాడు. శంకరుడు శ్రీరాముని సత్కరించి పూజించాడు. శ్రీరాముడు శంకరజీ? ఏమిటీ లీల చేయుచున్నావు?

శంకరుడు - నేను భక్తాధీనుడను. నన్ను శరణువేడిన వారిని రక్షిస్తాను.



భగవంతుడు....ప్రభో! ఇది మీకుతగినట్లుగానేవున్నది. మీలో నాలో తేడా అంటూవుంటేగదా? మీరు ఎల్లప్పుడూ నా హృదయంలో వుంటారు, నేను మీహృదయంలో వుంటాను, మీలో నాలో భేదభావాన్ని చూపే మూర్ఖులు నరకంలో పడుతారు. మీభక్తులే నాభక్తులు, నాభక్తులే మీభక్తులు.

ఇలా అని భగవాన్ యుద్ధములో మూర్ఛనొందిన వీరులను స్పర్శించగానే అందరికి తెలివి వచ్చింది. రాజా వీరమణి శ్రీరాముని పూజించి అశ్వాన్ని అప్పగించాడు. అశ్వాన్ని తీసుకొని శత్రుఘ్న హనుమలు ముందుకు సాగారు. శ్రీరాముడు అయోధ్యకు తిరిగి వచ్చాడు.

భక్తునిపైన భగవానుని అనుగ్రహం ఎల్లవేళలా వుంటుంది, భక్తుల మనస్సులో అహంకారం కలిగినప్పుడు దాన్ని పోగొట్టుతాడు. శరీరము వున్నప్పుడు అహంకారం వచ్చేస్తుంది. భక్తులకు అహంకారం కొద్దిక్షణాలు మాత్రమే వుంటుంది. భగవాన్ వెంటనే దాన్ని పోగొట్టి భక్తుని హృదయాన్ని పవిత్రం చేస్తాడు.

అశ్వమేధ అశ్వం తిరుగుతూ మహర్షి వాల్మీకి ఆశ్రమానికిచేరింది. లవకుశులు దాన్ని పట్టుకున్నారు. హనుమ వారినిచూచి నవ్వి—బాలులరా, వేళాకోళం చేయకండి. ఇది మామూలు గుర్రంకాదు, దీన్ని శూరవీరులు మాత్రమే పట్టుకుంటారు, మిమ్ములను పిల్లలని భావించి క్షమిస్తున్నాను. గుర్రాన్ని విడిచిపెట్టండి అని అన్నాడు.

అప్పుడు— మేముగూడా వీరులమే. మా గురువులు, కులపతిఅగు మహర్షివాల్మీకిదగ్గర అస్త్రశాస్త్రాలను ప్రయోగించడం నేర్చుకున్నాం.

హనుమ—నేర్చుకొని వుండవచ్చు, కాని మీరు మీ చిలిపితనాన్ని వదలండి. ఈ సైన్యానికి రక్షకుడు శత్రుఘ్నుడు, మీలాంటి శూరవీరులెందరో వారికి సహాయకులుగా వున్నారు. ఎందులకు అయ్యానికి కాలుదువ్వి ప్రాణాలను పోగొట్టుకుంటారు?

కుశుడు-మీరు శూరవీరులయితే మాతో యుద్ధానికి రండి. అని వారిరువురు విల్లుపైన బాణాన్ని ఎక్కుపెట్టి యుద్ధానికి సన్నద్ధులైనారు. వారిని చూచి నవ్వి హనుమ ఆలోచించాడు-ఈ పిల్లలు నాతో యుద్ధం ఏంచేస్తారు, నేను యుద్ధంలో శంకరుని గూడా సంతోషపరించాను.

భయంకరంగా యుద్ధం జరిగింది. హనుమ, శత్రుఘ్నులను లవకుశులు మూర్ఛపోయినట్లు జేశారు. శత్రుఘ్న పుష్కలులను మిగతా సైన్యాన్ని మృతప్రాయులుగా జేసి హనుమనుగ్రీవులను గుర్రంతోకకుకట్టి ఆశ్రమానికి తీసుకొని వెళ్ళాడు. గుర్రాన్ని ఆశ్రమంలో బంధించి తన తల్లి దగ్గరకు వెళ్లారు. మిక్కిలి స్నేహంతో తమ సంతోషాన్ని వెలిబుచ్చుతూ-అమ్మా, నీవు వచ్చిచూడు. మేముఎంతగానో అందమైన గుర్రాన్ని తీసుకొనివచ్చి బంధించాం.

అమ్మా! దానిమెడకి ఒక బంగారు పత్రంకట్టివున్నది.

జానకి....నాయనా? మీరు ఎవరిగుర్రాన్ని పట్టుకొని తీసుకొనివచ్చారు? ఎవరి వస్తువును అడగకొండా తీసుకొనరాదు. మీరు కొంటెవాళ్ళులాగా తయారవుతున్నారు.

లవకుశలు- అమ్మా? మేము దొంగిలించి తీసుకొని రాలేదమ్మా? యుద్ధంచేసి విజాయాన్ని పొంది తీసుకొని

వచ్చాం. అయోధ్యలో ఎవరో రాముడనే రాజువున్నాడట. ఈ గుర్రం ఆయనది. పుష్కల శత్రుఘ్నులు దానికి రక్షకులుగా వుండి గొప్పాగా గొప్పలు పలికారు. తమను నిజమైన క్షత్రియులుగా చెప్పుకున్నారు. అప్పుడు మేము- భూమిపైన మీరేకాదు క్షత్రియులు, మేముకూడా క్షత్రియులమే, అని యుద్ధం చేశాం. యుద్ధంలో పుష్కల, శత్రుఘ్నులను చావకొట్టాం, వారిసైన్యాన్ని మూర్ఛనొందునట్లుజేసి గుర్రాన్ని తీసుకొనివచ్చాం. అమ్మా! మరొక విషయం. మేము రెండు కోతులనుగూడా బంధించి తీసుకొనివచ్చాం. అవి చాలా మంచి కోతులు. మేము వాటితో ఆడుకున్నాం. అమ్మా? మేము మంచిపని చేశాంగదా? దీన్ని దొంగతనం అని అనరుగదా?

జానకి- అయ్యో? నాయనలారా? మీరు గొప్ప అనర్థం చేశారు. మీరు స్మరించినవారే అయోధ్యా మహారాజు, మీనాన్నగారు, శత్రుఘ్నుడు మీకు చిన్నాయనగారు. పుష్కలుడు మీచిన్నతమ్ముడై వుంటాడు. మీరు ఆలోచించకుండా గొప్ప అనర్థాన్ని తలపెట్టారు. ఆరెండుకోతులు ఎవరై వుంటారు? పదండి, గుర్రాన్ని ఎక్కడ కట్టేశారో, చూపండి!

లవకుశులు తల్లిని వెంటపెట్టుకొని గుర్రం దగ్గరకు తీసుకొని వెళ్ళారు. సుగ్రీవహనుమలను చూచి జానకి స్తంభించిపోయింది. వారి మూర్ఛ తొలిగిపోయింది. సీతమ్మ-సుగ్రీవ హనుమల్లారా? ఈ పిల్లలు తొందరపడ్డారు. చెడ్డగా భావించ

కండి. లంకను జయించిన మీరు ఈ పిల్లలచేతిలో ఎలా ఓడి పోయారు?

హనుమ నమస్కరించి– అమ్మా? మేము ఓడిపోలేదు. పరమ పవిత్రులమయాం. "ఆత్మా వై పుత్రనామాసి" అన్నారుకదా? తండ్రేపత్ని గర్భాన్నుంచి పుత్రుని రూపంలో జన్మించుతాడు. వీరు మా స్వామి పుత్రులవడంచేత మాకూ స్వాములే. స్వామిచేతిలో సేవకుడు ఎల్లప్పుడు పరాజితు డవుతాడు. భగవాన్ మా హృదయాలను పవిత్రం చేయు డానికే ఈ లీలను చేయించాడు, అమ్మా? మీ దర్శన భాగ్యం చేత మేము ధన్యులమయాము. ఇక మాకు సెలవు.

ఆదేసమయంలో జానకి "నేను స్వప్నంలోగూడా శ్రీరామునితప్ప మరేపురుషుని చింతించకుండావుండివుంటే శత్రుఘ్నుడు సైన్యంతో జీవించాలి." అని ప్రతిజ్ఞ చేసింది.

సీతమ్మ ఇలా సంకల్పంచేయగనే సైన్యమంతా జీవించింది. సుగ్రీవ, హనుమలు సీతమ్మ పాదాలకి నమ స్కరించి సెలవు తీసుకొని వెళ్ళారు. శ్రీరాముని అశ్వమేధ యజ్ఞం చాలా గొప్పగా జరిగింది. అందులో హనుమ గొప్ప పరాక్రమాన్ని చూపాడు. ఇక్కడ కొద్దిగా వర్ణించాము, వాల్మీకి రామాయణంలోనూ, పద్మపురాణంలోనూ హనుమ గురించి విస్తారంగా వర్ణించారు.

శ్రీ రా మ ర క్ష స ర్వ జ గ ద్ర క్ష

# రామ జాపకుని రక్షణకు రామునితో సైనాసరే పోరాడు హనుమాన్

# 18

శ్రీరామ నామామృత బీజరూప
సంజీవనీ చేన్మనసి ప్రవిష్టా।
హాలాహలం వా ప్రలయానలం వా
మృత్యోర్ముఖంవా విశతాంకుతోభీః॥

రామునికంటే ఆయన నామము గొప్పది. స్వామి కంటే సేవకుడు గొప్పవాడు. భగవంతునికంటే భక్తుడు గొప్పవాడు. భగవానుని ప్రతిజ్ఞ కంటే భక్తుని ప్రతిజ్ఞ గొప్పది. భక్తునివిజయంపట్ల భగవంతునికి మిక్కిలిసంతోషం కలుగుతుంది; ఎందుకనగా తన భక్తుడు తనకంటేగొప్ప వాడవుతున్నాడుగదా.

ఒకనాడు శ్రీరామునితో హనుమ—ప్రభూ! చాలా కాలమయింది. మీరు అనజ్ఞ యిస్తే వెళ్ళి మాతల్లిగార్ని దర్శించి వస్తాను, అని అన్నాడు.

---

- శ్రీరామనామామృత బీజమనెడు సంజీవనీ మూలిక రసము హృదయంలో ప్రవేశించిన ఎడల హాలహల విషాన్ని త్రాగినా, ప్రళయాగ్నిలో ప్రవేశించినా, మృత్యుముఖంలోకి వెళ్ళినా భయపడవలసిన పనిలేదు. రామనామ జాపకుడు సర్వత్రా నిర్భయంగా వుంటాడు.

భగవాన్—హనుమా? ఇదికూడా అడగాలా? వెంటనే వెళ్ళిరా. అమ్మగార్కి— నానమస్కారంచెప్పు. అయితేఎప్పుడు వెళ్లుతున్నావు?

హనుమ — ప్రసాదం పుచ్చుకున్న తరువాత,

భగవాన్ - సరే, వెళ్ళిరా.

హనుమ వెళ్ళడానికి తయారవుతున్నాడు, ఇంతలో కాశీనుంచి ఒక రాజుగారు శ్రీరాముని దర్శనంకొరకు వస్తూవున్నాడు. దారిలో నారదుడు కనుపించాడు. నారదుడు కలహప్రియుడుగదా! ఇద్దరిమధ్య కలహాన్ని పెట్టడం ఆయనకి సరదాగావుంటుంది. నారదుడు రాజుని— మీరు ఎక్కడకువెళ్లుతున్నారండీ? అని అడిగాడు.

రాజు—భగవన్? నేను శ్రీరాముని దర్శనానికి వెళ్ళుతున్నాను.

నారదుడు - అయితే నేను ఒకమాట చెపుతాను, వింటావా? అని అన్నాడు.

రాజు నమస్కరించి—ఈ భూమండలంలో మీ మాటను ఎవరు వినరండీ. మీరు దేవతలకు, రాక్షసులకు అందరికీ పూజనీయులు. నేను ఏమి చేయవలసివుంటుందో, చెలవివ్వండి.

నారదుడు - సరే. నీవు ఒకపనిచెయ్యి. సభలో

శ్రీరాముని దర్శించు, కాని విశ్వామిత్రునకుమాత్రం నమస్కరించకు.

రాజు-ఎందులకు? భగవన్? ఇది మర్యాదకు విరుద్ధం గదా?

నారదుడు - దీనికి సమాధానం తరువాత చెబుతాను. ప్రస్తుతం నామాట మన్నించు.

రాజు - సరే, అలాగే చేస్తాను, అని రాజసభలోకి వెళ్ళాడు. అక్కడ భగవంతునకు నమస్కరించి విశ్వామిత్రునకు నమస్కారం చేయకుండా కూర్చున్నాడు.

మనం ఎవరినుండి సన్మానితులం కావాలనుకుంటామో, వారు తెలిసి మనలను సన్మానించనియెడల, మనలను ఉపేక్షాభావంతో చూచినయెడల అట్టివారిపట్ల క్రోధం కలగడం సహజమేగదా. విశ్వామిత్రునకు రాజు ప్రవర్తన చెడ్డగా అనిపించింది. సభలో అందరిఎదుట ఆయన ఏమీ మాట్లాడలేను. తరువాత శ్రీరామునితో - రామా? నిన్ను మర్యాదాపురుషోత్తముడని అంటారు. నీసభలోనే మర్యాదకు భంగంవాటిల్లితే ఎలా?

భగవాన్ - మహారాజ్? ఏ విధంగా మర్యాదకు భంగం కలిగిందో దయచేసి చెప్పండి.

విశ్వామిత్రుడు - నీవు చూడలేదా? నిండు సభలోకి

రాజు వచ్చి నీకు నమస్కారం చేశాడు కాని నాకుచేయలేదు. ఇది నాకు మిక్కిలి అవమానంకాదామరి?

శ్రీరాముడు - భగవన్? అతను ఇంతకంటే గొప్ప అపరాధం చేశాడు. మీకు అవమానం జరగడం అలావుంచండి. అన్నిటికంటే గొప్పఅవమానం నాకుజరిగింది. నాగురువుగార్కి నిండుసభలో నమస్కరించకుండా ఎవరైనానాకు నమస్కరిస్తే ఇదినాకు సవాలుగాదా?

విశ్వామిత్రుడు - ఇలాంటి సిగ్గులేనివానికి కఠినమైన శిక్ష విధించాలి.

శ్రీరాముడు - తప్పనిసరిగా ఇలాంటివ్యక్తి దండనీయుడే. ఈరోజు సూర్యాస్తమయంలోపల ఆవ్యక్తిని చంపుతానని ప్రతిజ్ఞ చేస్తున్నాను. ఆవ్యక్తికొరకు మూడుబాణాలను పంపుతున్నాను. మూడు లోకాల్లోనూ అతనిని రక్షించువారెవ్వరూ లేరు.

ఈమాట విని విశ్వామిత్రుడు మిక్కిలి ప్రసన్నుడైనాడు. ఒక్కక్షణంలో ఈవిషయం అంతటా వ్యాపించింది. రాజుగూడా విన్నాడు. నారదుని దగ్గరకు వెళ్ళి - భగవన్ భగవంతుడు నన్నుచంపుతానని ప్రతిజ్ఞచేశాడు! ఇప్పుడేమిటి చేయడం?

నారదుడు - భగవంతుని ప్రతిజ్ఞను ఎదుర్కొనేశక్తి ఎవరికివుంది? మరెవ్వరి ప్రతిజ్ఞనైనా మార్చవచ్చును.

రాజు బ్రతిమలాడుతూ – ప్రభూ! నన్ను ఏవిధంగా నైనాసరే రక్షించండి.

నారదుడు - అయితే వెంటనేవెళ్ళి అంజనామాత పాదాలను ఆశ్రయించు. అభయుదానమివ్వనంతవరకు ఆమె పాదాలను విడువవద్దు.

ఆపదలో వున్నవాడు ఏదైనా చేస్తాడు. ఒక్కపరుగున వెళ్ళి అంజనామాత పాదాలపైబడి ఏడవసాగాడు. ఆమె ఎంతగానో నచ్చజెప్పింది. కాని అతను లేవలేదు. చివరికి అంజనా అతనిని కష్టమేమిటో చెప్పమని అడిగింది.

రాజు - ఒకరు నన్ను చంపుతానని ప్రతిజ్ఞచేశారు. ఆవ్యక్తినుంచి అభయుదానమివ్వనంతవరకు నేను లేవను అని పలికాడు.

అంజనా మాతకు తన పుత్రుని బలంపట్ల పూర్తి నమ్మకం వుంది. ఇందువలన ఆమె రాజుకు అభయదాన మిచ్చినట్లుగా మూడుసార్లు ప్రతిజ్ఞచేసింది. అప్పుడు రాజు జరిగిన కథనంతా వినిపించాడు, అంజనా అన్నది. నాయనా? ఈకార్యము చాలా కఠినమైనది. శ్రీరాముని ప్రతిజ్ఞను ఎవరు ఎదుర్కొనగలరు? అయినా ప్రయత్నిస్తాను.

ఇంతలో హనుమవచ్చి తల్లికి నమస్కరించాడు. ఆమె హనుమను ఆశీర్వదించి - నాయనా? నాపని ఒకటివుంది, చేస్తావా? అని అన్నది.

హనుమ – అమ్మా. నీవు ఆదేశించితే తప్పకచేస్తాను.

అంజనా – నాయనా? మిక్కిలి కఠినమైన కార్యము.

హనుమకు తన బలంపట్ల నమ్మకం పుండనేవుంది.– అమ్మా, కార్యం ఎంత కఠినమైనాసరే నేను చేస్తాను. నా బలంపట్ల ఏమాత్రం శంకించవద్దు.

అంజనా – నాకు నీ బలంపట్ల నమ్మకం లేకపోలేదు. అయినా నాకార్యము మిక్కిలి కఠినమైంది. మూడుసార్లు ప్రతిజ్ఞ చేయునంతవరకు చెప్పను.

హనుమ వెంటనే ప్రతిజ్ఞచేశాడు.

అంజనా విషయమంతా చెప్పింది. హనుమవిని–అమ్మా? ఈ కార్యము చాలా కఠినమైనది. శ్రీరాముని ప్రతిజ్ఞను ఎవరు ఎదుర్కొనగలరు? శ్రీరామునితో పోరాడుశక్తి ఎవరికివుంది? అని అన్నాడు.

అంజనా – ఏవిధంగానైనాసరే, శరణాగతుని రక్షించి తీరాలి.

హనుమ – సరే, ఏదైనా ఉపాయాన్ని ఆలోచిస్తాను. సూర్యాస్తమయం వరకు వ్యవధి వుందిగదా, నాకు సెలవు ఇవ్వండి. అని రాజుని తీసుకొని వెంటనే అయోధ్యకుచేరాడు. ఆరాజుని సరయూనదిలో నడుంలోతు నీటిలోనిలబెట్టి ఓరాజా!

నీవు ఆపకుండా రామనామాన్ని స్మరించు. పాపం అతను భయపడిపోయి రామనామాన్ని స్మరిస్తున్నాడు.

హనుమ భగవంతుని దగ్గరకు వెళ్ళి నమస్కరించి ప్రభూ నాకు ఒక వాగ్దానం చేయండి, అని అన్నాడు.

భగవాన్ – హనుమా? నీకు ఏమికావాలో చెప్పు.

హనుమ – భగవన్? మీ నామాన్ని నిరంతరమూ స్మరించువానిని రక్షించమని కోరుతున్నాను. మీ నామాన్ని స్మరించువానిని ఎవరూ దండించరాదు.

భగవాన్-నా నామాన్ని స్మరించువానిని రక్షించుటలో నీవు నిరంతరమూ సమర్థుడవవుతావు. అని ఆశీర్వదించాడు. అంతే ఇంకేముంది. హనుమ తనగదను తీసుకొని సరయూనది ఒడ్డున నిలబడి రాజుతో "రామనామాన్ని ఆపకుండా స్మరించు" అని పలికాడు.

ఈ విషయం అంతటా వ్యాపించింది. శ్రీరాముడు చంపుతానని ప్రతిజ్ఞచేసిన వ్యక్తిని హనుమ రక్షిస్తున్నాడు. నగరంలోని స్త్రీ, పురుషులందరూ ఈ అద్భుత దృశ్యాన్ని చూడడానికి తండోప తండాలుగా వస్తున్నారు. అంతటా కోలాహలంగావుంది. ప్రజలు తమలో తాము అనుకొంటున్నారు, భక్తుని, భగవంతుని ప్రతిజ్ఞలో ఎవరు విజయాన్ని సాధిస్తారో చూడాలి. శ్రీరాముడు సూర్యాస్తమయంలోపల రాజుని

చంపుతానని ప్రతిజ్ఞ చేశాడు. అతనిని హనుమ రక్షిస్తున్నాడని గూడా విన్నాడు. అయినా భగవాన్ తన బాణాన్ని ప్రయోగించాడు. హనుమ రాజుని కాపాడుతూ వున్నాడు. రాజు నిరంతరమూ రామనామాన్ని బిగ్గరగా స్మరిస్తున్నాడు.

బాణం రానేవచ్చింది. కాని రామనామాన్ని స్మరించువానిని ఏ అస్త్ర శస్త్రమూ ఏమీ చేయజాలదని శ్రీరాముడు ప్రతిజ్ఞ చేసివున్నాడు. రాజు నిరంతరమూ రామా - రామా అని అంటున్నాడు. బాణం అతను రామనామాన్ని ఎప్పుడు ఆపుతాడా, వధించుదామని చూస్తూవుంది. రాజు మానకుండా రామానామాన్ని స్మరిస్తూ వుండడంచేత బాణం తిరిగి శ్రీరామునిదగ్గరకు వెళ్ళి - ప్రభూ! ఆరాజుని హనుమాన్ రక్షిస్తున్నాడు. నేను ఏమీ చేయలేక తిరిగి వచ్చాను, అని తెలిపింది.

ఈ విషయం వినగానే శ్రీరామునకు మిక్కిలి కోపం వచ్చింది. ఆయన దానికంటే తీవ్రమైన బాణాన్ని ప్రయోగించాడు. హనుమ రాజుతో - చూడవయ్యా? ఇక "సీతారాం సీతారాం" అని బిగ్గరగాస్మరించు. అని అన్నాడు. ఇంకేముంది నామానికి రెండురెట్లు శక్తి వచ్చింది. నామాన్ని ఎప్పుడు ఆపుతాడా, చంపుదామని బాణం చూచింది. హనుమ చూస్తూనే వున్నాడు. బాణం ఏమీ చేయలేక తిరిగి వెళ్ళి పోయింది. శ్రీరామునకు విశేషంగా క్రోధం వచ్చింది.

మూడవ బాణాన్ని తీసుకొని రాముడు సరయూ తటానికి వెళ్ళి ఆరాజుని, హనుమనుగూడా చంపుతాను, అని బాణాన్ని ఎక్కుపెట్టి సరయూనది పైపుకి వెళ్ళాడు. హనుమ ఆలోచించి రాజుతో - "జయ సియ రామ జయ హనుమాన్" అని బిగ్గరగా స్మరించమన్నాడు. సీతా, రామ, హనుమ మూడు నామాలు కలియడంచేత మహాదుర్గ శక్తి వచ్చింది. శ్రీరాముడు హనుమను చంపడానికి వెళ్ళుతున్నాడు అని విని వసిష్ఠులవారు ఎక్కడ అనర్థం జరిగిపోతుందో అని భావించి ఒక్క పరుగున హనుమ దగ్గరకు వెళ్ళి - నాయనా? నీవు ప్రతిరోజూ ఏదో ఒక గొడవ తెచ్చిపెడుతుంటావు. ఈ రాజును విడిచిపెట్టు, శ్రీరాముని ప్రతిజ్ఞ నెరవేర్చుకొననిమ్ము. ఒక రాజు చనిపోతే ఏమవుతుంది. అతను విశ్వామిత్రుని అవమానపరచి గొప్ప తప్పుచేశాడు. ఇతన్ని సూర్యాస్తమయం లోపల చంపుతానని రాముడు ప్రతిజ్ఞచేశాడు. సూర్యాస్తమయం రానున్నది. అందుచేత శ్రీరామునకు మిక్కిలి కోపం వస్తున్నది, అని అన్నారు.

అప్పుడు హనుమ - గురువుగారూ? మీరు అంటున్నదేమిటి? శ్రీరాముడు ఆరాజుని చంపుతానని ప్రతిజ్ఞచేశాడు. రామనామాన్ని స్మరించువానిని రక్షిస్తానని నేను ప్రతిజ్ఞ చేశాను. ప్రతిజ్ఞకొరకు నేను నా ప్రాణాలనుగూడా అర్పిస్తాను. శ్రీరాముడు నన్ను వధించినాసరే, అని అన్నాడు.

నిరంతరము రామనామాన్ని స్మరించడంచేత రాజు కంఠం ఎండిపోయింది. అప్పుడు హనుమ రాజు కంఠంలో స్వయంగా ప్రవేశించి రామనామాన్ని జపిస్తున్నాడు. అందరూ గుమిగూడారు. శ్రీరాముడు హనుమను ఎలా చంపుతాడో చూడడానికి విశ్వామిత్రుడుగూడా వచ్చాడు. అప్పుడు వసిష్ఠుడు రాజుతో —ఏమయ్యా? నీవు విశ్వామిత్రుని పాదాలను పట్టుకోవయ్యా? నీకు అభయదానమివ్వనంతవరకు విడిచిపెట్టకు, అని అన్నాడు.

వసిష్ఠులవారు చెప్పినటుగా రాజు "జయసీతారాం జయ హనుమాన్" అంటూ విశ్వామిత్రుని పాదాలపైన పడ్డాడు. అతనిపట్ల మహర్షికి దయకలిగి అభయదానమిచ్చాడు. మహర్షి శ్రీరామునితో – రామా? ప్రాయశ్చిత్తమైపోయింది. ఇతన్ని క్షమించి హనుమకు అభయదాన మొసంగవలసినది అని అన్నాడు.

గురువుగారి ఆదేశాన్ననుసరించి శ్రీరాముడు రాజును క్షమించాడు. హనుమకు విజయం కలిగింది. అందరూ బిగ్గరగా "హనుమాన్‌కిజాయం" "జయ హనుమాన్‌కీ" అని గర్జించారు.

ఈ విషయాన్ని విని అంజనాదేవి మిక్కిలి ప్రసన్నురాలై వెంటనే శ్రీరాముని దర్శించడానికి అయోధ్యకు వచ్చింది. అంజనామాతను చూచి శ్రీరాముడు లేచి ఆమెకు

నమస్కరించి కుశలక్షేమాన్ని అడిగి నవ్వుతూ అమ్మా? మీ పుత్రుడు మహావీరుడు. అతనితో సమానమైన బలవంతుడు ఈ జగత్తులో లేడు. నన్ను కూడా జయించాడు.

ఈమాట వినేసరికి అంజనా మనస్సులో కొద్దిగా అభిమానం కలిగింది ఆమె – రామా? నీకు ఎల్లప్పుడూ దిగ్విజయం చేకూరుగాక, అని అంతఃపురంలోకి వెళ్ళింది. కౌసల్య అంజనా మాతను ఎంతగానో సత్కరించింది. అదే సమయంలో అగస్త్యుని తల్లిగూడా వచ్చింది. ఇప్పుడు ముగ్గురు తల్లులమధ్య చర్చసాగింది.

వివాహ యోగ్యులైన ఆడపిల్లలు కలుసుకున్నప్పుడు తమలోతాము తమ భావివరుడ్ని గురించి నాకు ఇలాంటి వరుడు లభించాలి, అలాంటి వరుడు కావాలి అని చర్చించుకుంటారు. తల్లులు కలుసుకున్నప్పుడు తమ తమ భర్తలగురించి మాట్లాడుకుంటారు. వారు అలాంటివారు. ఒకనాడు ఆయన నాతో ఇలా అన్నారు. నేనుగూడా గట్టిగా అన్నాను, ఆయనకు ఫలానా వస్తువు ఇష్టము, ఫలానా రంగుబట్టలు నచ్చుతాయి. మొదలగు విషయాలు.

ముసలి తల్లులు కలుసుకున్నప్పుడు తమ తమ పుత్రుల బలపరాక్రమాలను పొగుడుతారు. నా కుమారుడు ఫలానా సభలో దిగ్విజయాన్ని సాధించాడు, ఫలానా పని చేశాడు. పుత్రుల పొగడ్తను వింటుంటే వారికి సుఖం కలుగుతుంది. ఈ తల్లులు ముగ్గురు ముసలివారు. గనుక ఈముగ్గురు

తమ పుత్రులనుగురించి చర్చించుకుంటున్నారు. కౌసల్య అన్నది – నా రాముడు అమాయకుడు కాని అతను మహా పరాక్రమశాలి. శతయోజనాల సముద్రంపైన వంతెనను నిర్మించాడు, సైన్యాన్ని తీసుకొని లంకానగరానికి వెళ్ళాడు. ఇది సామాన్యమైన కార్యమా?

అంజనామాత వుండబట్టలేక – సముద్రవిషయ మంటారా, రాముడు వంతెనమీదుగా లంకకు చేరాడు. నా హనుమ వున్నాడే ఒక్కదూకుదూకి సముద్రాన్ని దాటి వెళ్ళాడు.

అగస్త్యుని తల్లి – నా కుమారుడు వున్నాడే, సముద్రాన్ని ఒక్కదోసెట్లోనే తాగేశాడు. గనుక అతనే గొప్పవాడు.

కౌసల్య అన్నది – నా రాముడు గొప్పవాడు, గనుకనే రావణుని చంపాడు,

అంజనా– ఆ రాముణ్ణిగూడా నా కుమారుడు ఓడించాడు

అగస్త్యుని తల్లి – రామునకు అస్త్రశాస్త్రాలన్నీ నా కుమారుడేగదా ఇచ్చింది.

ఈ విధంగా ముగ్గురు తల్లులమధ్య వివాదం కొనసాగుతున్నది. శ్రీరాముడు అక్కడకు వచ్చి నవ్వి - ఏమిటి విశేషం అని అన్నాడు.

కౌసల్యతో అన్నది– ఒక విషయాన్ని గురించి వాదించుకుంటున్నాం. ఎవరు పెద్దవారో – నువ్వు నిర్ణయించి చెప్పాలి. శ్రీరాముడు నిష్పక్షపాతంగా నిర్ణయించుతారని నమ్మకంవుంది. శ్రీరాముడు న్యాయమూర్తిగా మువ్వురూ స్వీకరించారు.

మువ్వురి విషయాన్ని విని శ్రీరాముడు అన్నాడు— తల్లులారా, చూడండి. నేనుగానీ, హనుమగానీ, అగస్త్యుడుగానీ ఎవరూ గొప్పవారు కాదు. నిజానికి అందరికంటే నా పేరు గొప్పది. రామనామ ప్రభావం చేతనే గొప్పతనం వస్తుంది. హనుమకు రామనామం వల్లనే విజయం ప్రాప్తించింది. ఈ మాట వినగానే మువ్వురు తల్లులకు మిక్కిలి సంతోషం కలిగింది.

## ప్రదక్షిణ శ్లోకము

అంజనేయం మహావీరం బ్రహ్మవిష్ణు శివాత్మకమ్।
తరుణార్క ప్రభం శాంతం రామదూతం నమామ్యహమ్॥

ఇది చదువుచు హనుమద్విగ్రహమునకు గాని, యంత్రమునకు గాని ప్రదక్షిణ మొనర్చిన సకలారిష్టములు నివారణమగును, సకల వాంఛలు నెరవేరును.

# రౌద్రరూపుడైన హనుమాన్

## 19

మహాశైలం సముత్పాట్యధావంతం రావణం ప్రతి
తిష్ఠతిష్ఠ రణే దుష్ట ఘోరరావం సముత్సృజన్।
లాక్షారసారుణం రౌద్రం కాలాంతకయమోపమం।
జ్వలదగ్ని లసన్నేత్రం సూర్యకోటి సమప్రభం।
అంగదాద్యైర్మహావీరై ర్వేష్టితం రుద్రరూపిణం।
ఏవంరూపం హనూమంతం ధ్యాత్వా యః ప్రజపేన్మనుం॥ *

హనుమ నిజానికి ఏకాదశ రుద్రుడు. ఈయనలోనూ రుద్రుని రూపంలోనూ ఏమీ తేడాలేదు. ఈయన ఎల్లప్పుడూ తన రౌద్రరూపాన్ని త్యజించి దానభావంలో సౌమ్యంగానూ శాంతంగానూ వుంటాడు. ఒకొ్కక్కప్పుడు తన రుద్ర రూపాన్నిగూడా చూపుతాడు. భక్తుల ప్రసన్నతకొరకే ఈయన ఇలా చేస్తూవుంటాడు.

---

* పెద్ద పర్వతాన్ని పెళ్ళగించి రావణుని చంపడానికి బిగ్గరగా కేకలు పెడుతూ వెళ్ళుతూ - ఓరీ దుష్టుడా? ఆగు, ఆగు. లక్క మాదిరి ఎర్రనిరంగుగల్గిన, కాలాంతకయమునితో సమానుడు, రౌద్రరూపుడు అగ్ని మాదిరి జాజ్వల్యమానవేత్రములు గల్గిన, కోటిసూర్యులకాంతి కల్గిన, రుద్రరూపుడు అగు హనుమను అంగదుడు మొదలగు మహావీరులు చుట్టూజేరి వున్నారు. ఇలాంటి హనుమ రూపాన్ని ధ్యానించిన తప్పక కోరిక నెరవేరును.

ఒకసారి శని – హనుమాన్? నిన్ను బాధిస్తాను, అని అన్నాడు.

హనుమ – ఇంతటి పెద్ద జగత్తు వుండగా, నన్ను ఎందుకు బాధిస్తావు?

శని – నేను అందర్నీ బాధిస్తూవుంటాను. నిన్ను గూడా బాధిస్తాను.

హనుమ – ఏ అవయవాన్ని బాధిస్తావు?

శని - శిరస్సును

హనుమ – అయితే నాశిరస్సుపైన కూర్చోనుము.

శని హనుమ శిరస్సుపైన ఎక్కి కూర్చున్నాడు. వెంటనే హనుమ ఒక పెద్ద పర్వత శిఖరాన్ని తీసుకొని తన తలపైన బాదుకున్నాడు. శని అణిగిపోయి – మహారాజ్? మీరే స్వయంగా తలనుబాదుకుంటుంటే నేను ఏంచేయగలను? మీరు సాక్షాత్తు రుద్రుని స్వరూపులు, అని అన్నాడు.

ఒకసారి సీతమ్మకు హనుమ తన రౌద్రరూపాన్ని చూపించాడు. సీతమ్మ శ్రీరామునితో – నేను హనుమను భోజనానికి ఆహ్వానించాలని అనుకుంటున్నాను, అని అన్నది.

శ్రీరాముడు – ప్రియే! నీవు భోజనానికి పిలవవద్దు, హనుమకు భోజనం పెట్టడం సామాన్యమైన పనికాదు. కాని, మంగళవారంనాడు గాని లేక శనివారంనాడు గాని లడ్లు తినిపించావంటే హనుమసంతృప్తి చెందుతాడు.

సీతమ్మ – లేదండి. నేను హనుమకు కడుపునిండా భోజనం పెట్టాలనుకున్నాను, అని అన్నది.

భగవాన్ – నీవు ఇతని కడుపు నింపలేవు, అని అన్నాడు.

సీతమ్మ – మీరు ఏమిటి అంటున్నది? నా దగ్గర వేలమంది దాస దాసీలు, సేవకులు వున్నారు. హనుమ ఏమితిన్నా సరే, పెడతాను.

భగవాన్ – బాగుంది. నీకు ఇష్టమువచ్చినట్లు చేయుము: సీతమ్మ హనుమను భోజనానికి పిలిచింది. అంతే, హనుమ తనరుద్ర రూపాన్ని ధరించి భోజనం చేయడం ప్రారంభించాడు. వడ్డన చేస్తున్న పదార్థాలనన్నిటినీ స్వాహాచేస్తున్నాడు. లక్షల గంపలు ఖాళీ అయిపోయినాయి. పాయసాన్ని తాగివేశాడు. సీతమ్మ గాబరాపడి శ్రీరాముని స్మరించింది. భగవాన్ ప్రత్యక్షమై చూచాడు. హనుమ రుద్రుని రూపంలో భోజనం చేస్తున్నాడు. అతని శిరస్సుపైన వెనుకనుంచి "ఓంనమశ్శివాయ" అని వ్రాసి–మహారాజ్! ఇకతృప్తి చెందు అని అన్నాడు. వెంటనే హనుమ తృప్తిచెందాడు.

హనుమ రుద్రుని రూపంలో అర్జునుని రథంపైన వున్నాడని శ్రీకృష్ణునకు తెలుసు. పాండవ సైన్య పరాజయాన్ని చూచినప్పుడు హనుమ ఒక్కసారి గర్జించేవాడు. ఈయన గర్జనకి కౌరవ సైన్యం యోజనాల దూరం వెనుకకు పారిపోయేది.

ఒకసారి కర్ణుడు అర్జునుని రథాన్ని వెనుకకు గెంటాడు. భగవాన్ కర్ణుని పొగడుతూ - సూర్యనందనా? నీవు చాలా గొప్పపని చేశావు, నీవుతప్ప ఇలా ఎవరూ చేయలేరు. అని అన్నారు.

అర్జునుడు - భగవాన్? నేను ఇంతగా కష్టపడుతున్నాను, ఎన్నోసార్లు కర్ణుని రథాన్ని పడగొట్టాను, కాని మీరు ఎప్పుడూ పొగడలేదు. ఇతన్ని పొగిడేస్తున్నారు? ఏమిటి విశేషం? అని అన్నాడు.

భగవాన్ - అర్జునా? నీకు తెలియదు. నీ రథంపైన హనుమ సాక్షాత్తు వుండటంచేత నీ రథం సురక్షితంగా వుంది. లేకుంటే దివ్య బాణాలకి ఇదిఎప్పుడో భస్మమైపోయేది. ఎవని రథంపైన రుద్రరూపుడైన హనుమ వుంటాడో అతని రథాన్ని ఎవరూ కదల్చలేరు, అని అన్నాడు. అప్పుడు అర్జునునకు కలిగిన భ్రమ తొలగిపోయింది,

ఒకసారి భీమునకుగూడా హనుమ తనరౌద్రరూపాన్ని చూపాడు. ద్రౌపదికి ఒక శతదళ పద్మం దొరికింది. ఆమె అలాంటి పద్మాలనే తేవాలని కోరింది. భీముడు ఆమెకోర్కెను తీర్చటానికి గంధమాదన పర్వతంపైనుకి వెళ్ళాడు. హనుమ ఆలోచించాడు - ఈ భీముడు ముందుకె వెళ్ళి చిక్కుల్లో పడిపోతాడు. ఇతను నా చిన్నసోదరుడు, ఇతన్ని అపుచేయాలి అని ఒక వానరుని ముదుసలి రోగిష్టి కోతివేషాన్ని ధరించి మార్గానికి అడ్డుగా పరున్నాడు. భీముడు దారిలోనుంచి తొలగమన్నాడు.

హనుమ - నాయనా? ఎక్కడికి వెళ్ళుతావు? ముందు దారి లేనేలేదు, మానవులు ముందుకి వెళ్ళరాదు, అని అన్నాడు.

భీముడు - మార్గముందో, లేదో, నాకు తెలుసు. నాకు అడ్డుతొలగుము, అన్నాడు.

హనుమ - నాయనా? నీవు చూడడంలేదా? నేను ముసలివాణ్ణి, రోగగ్రస్తుణ్ణి, నేను లేవలేను, కూర్చొనలేను, నీవు వెళ్ళాలనుకొంటే నాతోకను దాటివెళ్ళు, అని అన్నాడు.

భీముడు - నాయనా? నీకు తెలియదు, సర్వేశ్వరుడు అందరిలో నివసిస్తున్నాడు, శక్తి వున్నంత వరకు ఎవరిని దాటి పోరాదు, అని అన్నాడు.

హనుమ - నీకు బలముంటే నా తోకను ప్రక్కకు తొలగించి వెళ్ళిపో అని అన్నాడు.

భీముడు ఎడమచేతితో తోకను కదిపాడు, కదలలేదు. రెండు చేతులతో కదిపాడు, కాని లాభం లేకపోయింది. తన బలాన్నంతా ప్రయోగించి ప్రయత్నించాడు- నోట రక్తం పడ నారంభించింది. చివరకు నమస్కరించి - మీరు చూడబోతే సామాన్యవానరులనిపించడంలేదు. ఇంతటి బలాన్ని నేను ఎక్కడా చూడలేదు, అని అన్నాడు.

హనుమ నవ్వి-నేను మీ పెద్దఅన్నగారిని. హనుమను.

హనుమ పేరు వినగానే భీముడు నమస్కరించి – నేను అనుకుంటూనే వున్నాను. చాలకాలాన్నుంచి మిమ్ములను దర్శించాలను కున్నాను. ఈ విధంగా దర్శన భాగ్యాన్ని కలుగజేశారు, ధన్యుడనైతిని.

హనుమ – భీమసేనా? ధృతరాష్ట్రుని పుత్రులు మీకు దుఃఖాన్ని కలుగజేశారని విన్నాను. దుర్యోధనుని దుర్బుద్ధికి మీ సోదరులంతా వనాల్లో తిరుగుతున్నారట. ఈనాడు మిమ్ములను ఇలాంటి పనిచేయడం చూచి అడ్డువచ్చాను, అని అన్నాడు.

భీముడు – మహారాజ్? మీరు దారిలో ఎందుకు అడ్డుగా పరున్నారు?

హనుమ – ఇలా పరుండకపోతే మీరు మామూలుగా ఒప్పుకుంటారా? యుద్ధానికి సన్నద్ధులయేవారు. మన మిరువురం పవనపుత్రులమే. సోదరులమధ్య యుద్ధం జరగడం ఏమంత మంచిపని కాదుగదా? అందుకని పరున్నాను.

భీముడు – నాకు ఇంకొక సందేహముంది. మీరు శత యోజనాల సముద్రాన్ని దాటారని విన్నాను, ఇంతటి చిన్నరూపంలో ఎలాదాటారు?

హనుమ నవ్వి – చూడు సోదరా? యుగాలనుబట్టి నా రూపాలుమంటాయి. సత్యయుగంలో, త్రేతాయుగంలో, ద్వాపరయుగంలో, కలియుగంలో నా రూపం వేరు వేరుగా

వున్నది. సముద్రాన్ని దాటి వెళ్ళిన నా రూపం వేరుగా వుంది.

భీముడు - భగవన్? మీరు ధరించిన రూపాన్ని చూడాలని నా కోరిక.

హనుమ - సోదరా? అది నా రౌద్రరూపం. ఆ రూపాన్ని చూచి మీరు ఏంచేస్తారు?

భీముడు - ఏమీ లేదు? ఒక్కసారి మీ ఆ భయంకర రూపాన్ని చూడాలని వుంది.

హనుమ - అది నా రుద్రరూపం. దాన్ని మీరు చూడలేరు. మీరు భయపడుతారు.

భీముడు - నాకు భయం లేదు. నేను చూస్తాను?

హనుమ - వెంటనే ఒక విశాల పర్వతశిఖరంపైకి వెళ్ళి తన భయంకర రూపాన్ని చూపాడు. ఆ రూపాన్ని చూచి భీముడు గజ-గజ వణికిపోయి కళ్లు మూసుకొని - సోదరా? మీరూపాన్ని చూచాను. చాలు, చాలు, మీరు తిరిగి చిన్న రూపాన్ని ధరించండి. అని అన్నాడు.

భీముడు - భగవన్? మీ ఈ రూపాన్ని చూచిన తరువాత నాకు ఒక సందేహం కలుగుతున్నది?

హనుమ - ఏమిటి ఆ సందేహం?

భీముడు-మీరూపం ఇంత భయంకరమైనప్పుడు మీరే ఒంటరిగా రావణుని చంపగలరుగదా, మరి రాముడు

సేతువుని ఎందుకునిర్మించాడు? ఇంతమంది వానరులను ఎందుకు పోగుచేశాడు? ఇన్ని రోజులు యుద్ధం ఎందులకు చేశాడు? సంజీవనీని ఎందులకు తెప్పించాడు? అని అన్నాడు.

హనుమ - భీమసేనా? మీరు చెబుతున్నది యథార్థమే ఒక్క రావణుడేంఖర్మ. అలాంటి చాలమంది రావణులను వధించగలను. నేను ఒంటిరిగానే వెళ్లి రావణుని హతమార్చేవాడిని, లంకను సముద్రంలో ముంచేవాడిని, నాకు అసాధ్యమంటూ ఏదీలేదు, కాని సోదరా? ఈ రామచరిత్ర ఎలా రచించబడేది. శ్రీరాముని కీర్తి ఎలా విస్తరింపబడేది. రామాయణమను భవసేతువు ఎలా నిర్మించబడేది? ఈ రామ చరిత్రను ఆశ్రయించి అసంఖ్యాక జనులు భవసాగరాన్నుంచి తరిస్తున్నారు, సృష్టివుండునంతవరకు తరిస్తూ వుంటారు. ఆ రామచరిత్రను ఆశ్రయించే నేను జీవిస్తున్నాను. రామ చరిత్రలేకపోతే నేను ఒక్కరోజుకాదు, ఒక్కక్షణంగూడాజీవించే వాడనుకాను, అని అన్నాడు.

భీముడు - మీరు నిజం చెబుతున్నారు. నా సందేహానికి సమాధానం లభించింది.

హనుమ - సోదరా? దుష్టదుర్యోధనునిపైన నాకు మిక్కిలి కోపం వస్తున్నది. ఇతను జూదంలో మిమ్ములను మోసంచేసి వనవాసాన్ని కలుగజేశాడు. మీరు చెప్పినచో నేను. ఇప్పుడేవెళ్లి హస్తినాపురంపైన రాళ్ళవర్షం కురిపిస్తాను.

ధృతరాష్ట్రుని పుత్రులనందర్నీ చంపివస్తాను. అన్యాయానికి, అధర్మానికి, అత్యాచారానికి, మోసానికి ఫలితం ఎలా వుంటుందో వారికి చూపించివస్తాను, అని అన్నాడు

ఇది విని భీముడు హనుమ పాదాలు పట్టుకొని – ప్రభూ! మీరు ఆ ధృతరాష్ట్రుని పుత్రులపైన క్రోధాన్ని చూపకండి. దోమను చంపడానికి ఇంత పెద్ద ప్రయత్నం చేయనవసరం లేదు. మీ దెబ్బను సహించే సామర్థ్యమెవరికివుంది. మీరు నన్ను ఆశీర్వదించండి. మీ ఆశీర్వాదం వలన యుద్ధంలో ధృతరాష్ట్రుని నూర్గురు పుత్రులను చంపగలను, అని అన్నాడు.

హనుమ – నేను మనసారా ఆశీర్వదించుతున్నాను. నేను అర్జునుని రథంపైనవుండి మీకు సహాయం చేస్తాను. అర్జునుడు చాలకాలం నన్ను ఆరాధించాడు. నేనా అతనికి సహాయంచేస్తానని వరమిచ్చాను. మీరు ఏవిధంగానూ చింతించకండి. యుద్ధంలో మీకు తప్పక విజయం చేకూరుతుంది. మీరు ఈ దుష్ట కౌరవులను చంపి అఖండ భూమండలానికి రాజు అవుతారు, అని అన్నాడు.

ఆపైన భీముడు హనుమకు నమస్కరించి కౌగిలించుకున్నాడు. హనుమ ఎన్నో విధాల ఆశీర్వదించి పద్మములు లభించు మార్గాన్ని చూపాడు.

హనుమ చెప్పిన మార్గాన వెళ్ళి భీముడు ఎన్నో పద్మములను తీసుకొని తిరిగివచ్చాడు. భీముడు జరిగిన కధనంతా ధర్మరాజుకు వినిపించాడు. ధర్మరాజు హనుమ దర్శనము కలిగినందులకు సంతసించి ఇలాంటి సాహస కార్యములను చేయవద్దని హెచ్చరిక చేశాడు.

ఈ విధంగా రామకధా రసికుడైన హనుమకు ఎన్నో రూపాలు వున్నాయి. .... .... .... ....

శ్రీరామ జయ రామ జయ జయ రామ

నిత్యము భగవత్సన్నిధిని చదువ దగిన శ్లోకము

యావదా వర్తతే చక్రం యావతీచ వసుంధరా।
తావత్వమిహ సర్వస్య స్వామిత్వ మనువర్తయ॥

ఈ కాల చక్రము ఎంతకాలము సాగుచుండునో, ఈ భూమి ఎంతకాలము నిలచి యుండునో, అంతకాలము సమస్త విశ్వమునకు స్వామివై యుందువు గాక!

శ్రీరామ జయ రామ జయ జయ రామ

# గర్వాన్ని అణచి వేయుటకు ఉద్యుక్తుడైన హనుమాన్

## 20

లోకవాసనయాజన్తోః శాస్త్రవాసనయాపిచ।
దేహవాసనయా జ్ఞానం యథావన్నైవజాయతే॥ *

ఒక్కొకప్పుడు భక్తులకుగూడా పరాభవం జరుగుతున్నట్లుగా కనబడుతుంది. కాని భగవద్భక్తులకు ఎన్నటికీ పరాభవం కలుగదు. పరాభవంచేత వారి మనస్సుని భగవాన్ ఎంతగానో పవిత్రం చేస్తాడు. అన్ని అనర్థాలకు అభిమానమే మూలకారణము. భక్తుల మనస్సులో ఏ కొంచెం అభిమానం కల్గినా భగవాన్ దాన్ని వెంటనే పోగొట్టడానికి ప్రయత్నిస్తాడు. భక్తుని హృదయంలో అభిమానం స్థిరంగా నిలిచిపోకుండా చూస్తాడు. ఆవు తన దూడ శరీరమును నాలుకతో నాకి - నాకి దాన్ని స్వచ్ఛంగా చేసినట్లుగా భగవాన్ తన భక్తుని మనస్సులో ఉదయించిన అభిమానాన్ని పరాభవ నాటకాన్ని చూపి అతన్ని నిరభిమానునిగా చేస్తాడు. ఇందువలన భక్తునకుఎక్కడైనా అవమానంగాని లేక పరాభవంగాని జరుగుతున్నట్లుగా కనబడితే భగవాన్ అతనిమనస్సులో సూక్ష్మ

---

* శ్రీరాముడు హనుమతో - చూడు హనుమా! లోకవాసనా, శాస్త్రవాసనా, దేహవాసనా ఈ విధంగా మూడు వాసనలున్నాయి. వీటివల్లనే ప్రాణికి యదార్థజ్ఞానం కలుగదు అని తెలియజేశాడు.

రూపంగావున్న అభిమానాన్ని వెంటనే తొలగించడానికి ప్రయత్నిస్తున్నాడని మాత్రమే భావించాలి.

రామకృష్ణులలో ఏమీ భేదంలేదు. రాముడే ద్వారకలో కృష్ణుని రూపంలో ఆవిర్భవించాడు. జానకి విదర్భ రాజ కుమారిగా జన్మించింది. హనుమకి ఈ విషయమంతా తెలుసు. ఆయన వారిని శ్రీ సీతారాముల రూపంతో చూడాలనుకుంటాడు. ఆయన నేత్రాలలో సీతారాముల సౌమ్యశాంత మూర్తి నిండివుంటుంది. భగవంతునకు ఈ విషయం తెలుసు. అయినా భక్తుల అభిమానాన్ని పోగొట్టడానికి ఆయన క్రొత్త - క్రొత్త వింతలు చేస్తూవుంటాడు.

సత్యభామ స్వభావం చాలా సున్నితమైంది. ఆమెకు తన రూపంపట్ల మిక్కిలి అభిమానం వుండేది. కృష్ణుడుగూడా ఆమె మాటలను సహించేవాడు. ఈ కారణంగా తనను అందరి కంటే అధికంగా భావించనారంభించింది. భగవాన్ స్వర్గమ్నుంచి కల్పవృక్షాన్ని తీసుకొనివచ్చి ఆమె ముంగిలిలో వేసినప్పటినుండి ఆమెకు అభిమానం మరీ ఎక్కువయింది. అప్పుడు గర్వభంగం చేయాలనుకున్నాడు భగవాన్.

ఒకసారి సుదర్శన చక్రానికిగూడా తన శక్తిపట్ల అభిమానం కలిగింది. — నేను ఇంద్రుని వజ్రాన్ని ఓడించాను దుర్వాసుని హతమార్చాను, లోకాలోక పర్వతగర్వాన్ని అణచివేశాను. భగవంతునికి కష్టాలు వచ్చినప్పుడు నన్నే

పిలుస్తూవుంటాడు, అని సుదర్శన చక్రానికి కలిగిన గర్వాన్ని పోగొట్టాలనుకున్నాడు భగవాన్.

గరుత్మంతునికిగూడా ఒకసారి అభిమానం కలిగింది - నాతో సమాన బలవంతుడు వేగంగా ఎగిరేవాడు మరొకడు లేడు. యుద్ధంలో భగవంతునికిగూడా సహాయము చేశాను. ఇందులకే భగవాన్ తనకంటే ఎత్తైన ధ్వజంపైన నాకు చోటు ఇచ్చాడు. భగవానుని గరుడ ధ్వజుడని అంటారు. భగవానునికి నేను స్నేహితుడను, ఆసనాన్ని, వాహనాన్ని, ధ్వజాన్ని, ఛత్రిచామరాన్ని గూడా...

భగవాన్ ఈ ముగ్గురి గర్వాన్ని హనుమద్వారా అణచి వేయాలనుకున్నాడు. హనుమను మనస్సులో తలచుకున్నాడు - హనుమ వానర రూపంతో ద్వారకకు వచ్చాడు. శ్రీకృష్ణుని ఉద్యానవనంలో ఫలాలను తింటున్నాడు. చెట్ల కొమ్మలను విరుగగొట్టుతున్నాడు. రక్షకులు ఎంతగానో ప్రయత్నించారు, లాభం లేకపోయింది. శ్రీకృష్ణునికి తెలియచేశారు. ఆయన వెంటనే గరుత్మంతుని పిలిచి - గరుత్మంతా! ఎవరో వానరుడు మన ఉద్యానవనాన్ని నాశనంచేస్తున్నాడట, నీవు అతన్ని ఏ విధంగానైనా పట్టుకొనిరమ్ము, అని అన్నాడు.

గరుత్మంతుడు - మహారాజా! [illegible] బ్రహ్మాస్త్రం వదులుతున్నారా? ఇప్పుడే పట్టుకొని తీసుకువస్తాను.

భగవాన్ - అలాగే తీసుకొనిరా!

గరుత్మంతుడు వెళ్ళిచూచాడు. హనుమ ఫలాలను తింటున్నాడు. అక్కడక్కడ కొమ్మలను విరుస్తున్నాడు.

గరుత్మంతుడు మందలిస్తూ - ఒరేయి కోతీ, ఏమిటి చేస్తున్నావు?

హనుమ మౌనంగా వున్నాడు.

గరుత్మంతుడు - ఓ చెవిటివాడా? నీకే చెబుతున్నది? ఏంచేస్తున్నావు?

హనుమ నవ్వి - ఫలాలను తింటున్నాను. నీకు కనుపించడంలేదా?

గరుత్మంతుడు - అయితే ఫలాలను ఎందుకు తింటున్నావు?

హనుమ - ఆకలివేస్తున్నది గనుక?

గరుత్మంతుడు - ఈ తోట నీ అబ్బదనుకున్నావా?

హనుమ - మరి నీ అబ్బదేమో? నాకు తోటలన్నీ మా స్వామివే, ఎక్కడ తినాలనుకుంటే అక్కడ తింటూ వుంటాను.

గరుత్మంతుడు - ఈ తోట ద్వారకాధీశునిది. శ్రీకృష్ణుడు నిన్ను పిలుస్తున్నాడు?

హనుమ - ద్వారకాధిపుడు నీకు స్వామికావచ్చు. నా స్వామి అయోధ్యాధిపతి నేను. శ్రీ సీతారాముల దాసుడను.

గరుత్మంతుడు - అందుకే అంటున్నాను. నీవు పూర్తిగా వానరుడవని, అయోధ్యానాధుడు, ద్వారకానాథుడు ఇరువురూ శ్రీమన్నారాయణ స్వరూపులే గదా.

హనుమ - నేను వేరు-వేరు అని ఎప్పుడన్నానయ్యా? కాని నాకు శ్రీ సీతారాములపైన నిష్ఠగలదు. నా నేత్రాలలో వారు మూర్తీభవించి వుంటారు.

గరుత్మంతుడు - సరే పద. వారికే చెప్పుకొందువు గాని,

హనుమ - నేను శ్రీరాముని ఆజ్ఞనుతప్ప మరెవ్వరి ఆజ్ఞను పాటించను. నాకు రావలసిన పనిలేదు.

గరుత్మంతుడు - నీవు రాకపోతే బలవంతంగా తీసుకొని వెళ్లుతాను.

హనుమ - నీకు శక్తి వుంటే తీసుకొనివెళ్లు, చూస్తాను, అనేసరికి గరుత్మంతునకు కోపంవచ్చి హనుమతో ముష్టి యుద్ధం చేయసాగాడు. హనుమ తన తోకకి చుట్టి మెల్లగా విసిరేసరికి వెళ్ళి సముద్రంలో పడ్డాడు. హనుమ మలయాచలంపైకివెళ్ళాడు. గరుత్మంతుడు తరువాత భగవంతుని దగ్గరకు వెళ్ళాడు.

భగవాన్ - గరుత్మన్? సముద్రస్నానమయిందా?

గరుత్మండు - భగవన్? ఆ వానరుడు మహాతుంటరి. నేను ఎంత చెప్పినా రాలేదు. నన్ను సముద్రంలోకి విసిరాడు.

భగవాన్ – అతను సామాన్యవానరుడుకాదు. పవన తనయుడు. అతను నీకంటే బలవంతుడు.

గరుత్మంతుడు – అవును, అవునండీ. ఈ విషయం నాకు అతనితో పోరాడినప్పుడే తెల్సింది. కాని నాతో వేగంలో మాత్రం సమానంగా ఎగురలేడు. నేను పక్షిని, అతను పశువు. అని అన్నాడు.

భగవాన్ – సరే, అతను ఇప్పుడు మలయాచలంపైన వున్నాడు. నాపేరు చెప్పకుండా శ్రీ సీతారాములు పిలుస్తు న్నారని చెప్పు, అని అన్నాడు.

వెంటనే గరుత్మంతుడు మలయాచలంపైకి వెళ్ళి – నిన్ను శ్రీ సీతారాములు పిలుస్తున్నారు, అని అన్నాడు.

హనుమ – నీవు పద, నేను వస్తున్నాను, అనిఅన్నాడు.

గరుత్మంతుడు విసుగుజెంది – హనుమా? నీవు శాఖా మృగానివి. నేను గగన విహారంచేయు పక్షుల రాజువి, నీవు నాతో సమానంగా ఎలా ఎగురగలవు? మా మహారాజుగారు నిన్ను త్వరగా రమ్మనమన్నారు, అని అన్నాడు.

హనుమ:– నీవు పద, నేను వస్తున్నానని తిరిగి అన్నాడు.

గరుత్మంతుడు – హనుమా? నీవు బలవంతుడవే, కాని

నాతో సమానంగా వెళ్ళజాలవు. నా వీపుపైన కూర్చుంటే క్షణంలో స్వామి దగ్గరకు చేర్చుతాను. అని తన వీపుపైన కూర్చొనబెట్టుటకు ప్రయత్నించాడు.

హనుమ – స్వామి కూర్చుండు వాహనంపైన కూర్చొనరాదు. నీవు పద, వస్తున్నాను. అని అన్నాడు.

గరుత్మంతుడు మొండిపట్టు పట్టాడు. ఏమైనాసరే తీసుకువెళ్ళతానంటున్నాడు. హనుమ చివరకు తన తోకకిచుట్టి ఒక్క విసురు విసిరాడు. అతను ద్వారక దగ్గరకు వచ్చిపడ్డాడు.

భగవంతుడు ఎవరిని లోనికి రానీయవలదని సుదర్శనచక్రాన్ని ఆదేశించాడు. సుదర్శన చక్రం గర్వంతో రొమ్ము విరుచుకుంటూ ముఖ్యద్వారందగ్గరకు చేరి నిలబడింది.

హనుమ లోనికి ప్రవేశించుచుండగా సుదర్శన చక్రంచూచి జాగ్రత్త! ఈరోజు లోనికి ఎవ్వరూ వెళ్ళరాదు. అని అన్నది.

హనుమ – సోదరా! ప్రభువు కబురుచేశారు, లోనికి వెళ్ళనివ్వు.

సుదర్శనుడు – భగవంతుని ఆదేశంపైన నేను ఇక్కడ వున్నాను, లోనికి వెళ్ళడానికి వీలులేదు.

హనుమ వాదాన్ని పెంచుకోవడం బాగుగా లేదని సుదర్శనాన్ని నోటో పెట్టుకొని లోనికి వెళ్లాడు.

భగవాన్ సత్యభామతో – హనుమ సీతారామ రూపాన్ని చూడడానికి వస్తున్నాడు. రుక్మిణిని పంపు. సీత రూపంలో నా దగ్గర కూర్చుంటుంది.

సత్యభామకు కోపంవచ్చి – ఏమండీ? నేను మాత్రం అందంగా లేనా? సీత నాకంటే అందంగా వుందా? రూపం మార్చుకోవడమేగదా? నేనే మార్చుకొని కూర్చుంటాను, అని అన్నది.

ఆమె గర్వాన్ని పోగొట్టడమే ఆయన లక్ష్యము. అలాగే కూర్చొన మన్నాడు. సీత రూపంలో సత్యభామ ప్రక్కనే కూర్చున్నది. హనుమ లోనికివచ్చి శ్రీరాముని రూపంలో వున్న శ్రీకృష్ణుని పాదాలకు నమస్కరించాడు. కాని సీత రూపంలో వున్న సత్యభామవైపు చూడనైనా చూడలేదు.

భగవాన్ – హనుమా? నిన్ను తీసుకొని రమ్మనమని గరుత్మంతుని పంపాను. అతను ఇంకా రాలేదేమిటి?

కొన్ని క్షణాలు గడిచాక గరుత్మంతుడు రొప్పుతూ వచ్చాడు. హనుమను ప్రభువు ఎదుట చూచి మిక్కిలి లజ్జితుడైనాడు. హనుమ భగవంతునితో – మహారాజ్? ఈ పక్షికి మిక్కిలి గర్వంవుంది. ఎప్పుడు చూచినా యుద్ధానికి

తయారవుతాడు. తన వేగంపట్ల గొప్ప అభిమానం కలదు. నేను ద్వారక దగ్గరకు విసిరాను గనుక ఇప్పటికైనా రాగలిగాడు, అని అన్నాడు. ఈ మాట వినగానే గరుత్మంతుని గర్వంకాస్తా కరిగి పోయింది.

భగవాన్ — అయితే నిన్ను గుమ్మం దగ్గర ఎవరూ ఆపలేదా? 'అని ప్రశ్నించాడు.

హనుమ – ఈగరుత్మంతుడెంతో ఆ సుదర్శనచక్రమూ అంతే. ఎంతగానో ప్రార్థించాను. వినలేదు. నోట్లో పెట్టుకొని వచ్చాను. అని నోట్లోనుంచి వెలుపలకుతీసి ప్రభువు ఎదుట వుంచాడు. అప్పుడు సుదర్శనచక్రానికి వున్న అభిమానం కాస్తా పోయింది.

హనుమ – ప్రభూ? సీతమ్మగారు కనుపించడంలేదేమిటి? సీతమ్మగారిస్థానంలో ఈమె ఎవరు కూర్చునివున్నది? అని అన్నాడు.

ఈ మాట వినగానే సత్యభామకు తన సౌందర్యంపట్ల వున్న గర్వంకాస్తా మాయమై పోయింది.

ఈ విధంగా ముగ్గురి గర్వాన్ని పోగొట్టి హనుమ భగవంతునికి నమస్కరించి మలయాచలంపైకి తిరిగి వెళ్ళాడు.

ఇదే మాదిరిగా అర్జునుడికి తన ధనుర్బాణాలపైన అభిమానంకల్గి భగవంతునితో – ప్రభూ? లంకకు వెళ్ళడానికి

సేతువుని నిర్మించారు, వానరులను పోగుచేశారు, చెట్లను, పర్వతాలను తీసుకొనివచ్చారు. ఎందుకు ఇంతగా పరిశ్రమ చేశారు? బాణాలతో వంతెన కట్టితే బాగుండేదికదా? అని అన్నాడు.

భగవాన్ అతని గర్వాన్ని పోగొట్టడానికి అయితే నీవు కొద్దిగా వంతెన కట్టిచూపించు, అని అన్నాడు.

భగవంతుడు చెప్పినట్లు అర్జునుడు సముద్రంపైన కొద్దిదూరం వంతెన కట్టి హనుమతో — ఎలా వున్నదో, చూడమని అన్నాడు.

హనుమ రెండు అడుగులు వేశాడు. వంతెన చర-చర అన్నది.

భగవాన్ — హనుమా? తప్పుకో, లేకపోతే వంతెన విరిగిపోతుంది, అని అన్నాడు.

హనుమ తప్పుకున్నాడు అప్పుడు భగవాన్ తన వీపు చూపాడు. రక్తం ప్రవహిస్తున్నది. అర్జునుడితో — పార్థా? నీవు నిర్మించిన వంతెనను నా వీపుపైన మోపాను. లేకుంటే హనుమబరువుకి వంతెన విరిగి సముద్రంలోపడి పోయేది. ఇలాంటి వానరులెందరో ఆ సేతువు మీదుగా వెళ్ళారు. ఈ మాట వినినప్పుడు అర్జునునిగర్వం పూర్తిగ నశించింది. ఈవిధంగా భగవంతుడు తన పరమ భక్తాగ్రేసరుడగు హనుమద్వారా ఎందరి అభిమానాన్నో పోగొట్టాడు, పోగొడ్తూ వుంటాడు.

———

## శ్రీ రామ రక్ష - సర్వ జగ ద్రక్ష

# రామకథా సంకీర్తన ప్రియం హనుమాన్

## 21

యత్ర యత్ర రఘునాథ కీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్,
బాష్పవారి పరిపూర్ణలోచనం
మారుతిం నమత రాక్షసాంతకమ్ ॥ *

జీవుడు ఆహారం లేకుండా జీవించలేడు. జీవులన్నీ తమ తమ ఆహారాన్ని పొంది ప్రసన్నులౌతారు. ఎవనికి ఎట్టి వస్తువుపట్ల వ్యసనమేర్పడుతుందో అతను ఆ వ్యసనాన్ని విడిచిపెట్టి వుండలేడు. చేప ఏ విధంగా నీరు లేకుండా జీవించలేదో అదేవిధంగా నిజమైన భక్తుడు భగవంతుని కథాసంకీర్తన లేకుండా జీవించలేడు. మన కథానాయకుడు హనుమ నిజమైన రామభక్తుడు. రామకథాకీర్తన లేనిదే ఒక్క క్షణంగూడా వుండడు.

భగవాన్ శిష్టరక్షణకు, దుష్టశిక్షణకు ధర్మసంస్థాపనకు అవతరిస్తూ వుంటాడు. భూభారం తగ్గిపోయినతరువాత ఆయన

* శ్రీ రఘునాథుని కథాసంకీర్తన జరిగే ప్రతిచోటా శిరస్సున అంజలి మోపి, ప్రేమాశ్రువుల నింపి రాక్షసులను అంతమొనరించు హనుమ శోభాయమానుడై వుంటాడు, అలాంటి మారుతిని నమస్కరిస్తాము.

తన తేజస్సును తన భక్తులయందు ప్రవేశబెట్టి అదృశ్యు డవుతాడు.

శ్రీకృష్ణుడు అవతారము చాలించుతూ ఉద్ధవునితో - ఉద్ధవా? నీవు గొప్ప గుణవంతుడవు గనుక ఇక్కడేవుండి నా భక్తులకు మేలు చేకూర్చవలసినది, అని అన్నాడు. ఈ విధంగానే శ్రీరాముడు తన ప్రేమపాత్రుడైన హనుమకి చెప్పాడు. పవనకుమారునిపట్ల భగవంతునికి గల అనురాగాన్ని, భగవంతునిపట్ల హనుమకుగల కృతజ్ఞతను వర్ణించలేము.

భగవాన్ ఒక రోజున కృతజ్ఞతను తెలుపుతూ — హనుమా? ఈ జగత్తులో నా కథ వుండునంతవరకు నీకీర్తి చిరస్థాయిగా వుంటుంది. నీవు శరీరంతో జీవించివుంటావు. నీవు నిజంగా నాకు గొప్ప గొప్ప ఉపకారాలు చేశావు, అని అన్నాడు.

హనుమ: ప్రభూ? ఉపకారం చేసేశక్తి నాకెక్కడిది. మీరు శక్తిసామర్థ్యాన్ని ప్రసాదిస్తే చేయగల్గుతున్నాను, అని అన్నాడు.

భగవాన్- నాకు హనుమా, నీవు చేసిన ఉపకారాలను లెక్కించలేను. నేను ఒకవేళ నీ ఒక్కొక్క ఉపకారానికి నా ప్రాణాలను ఒక్కొక్కటి అర్పించినా ఎన్నో

ఉపకారాలకి ఇంకా ఋణపడివుంటాను. ఈ ఉపకారాలన్నిటికీ నేను ప్రత్యుపకారం చేయలేను. నాకు చేయాలనిగూడా లేదు. ఉపకారాలకి ప్రత్యుపకారం సామాన్యంగా ఆపదలు వచ్చినప్పుడు చేయడం జరుగుతుంది. నీకు ఆపదలు రావాలని నేను కోరడంలేదు. నేను నీకు ఎల్లప్పుడు ఋణపడి వుండాలను కుంటున్నాను. ఈ కారణంగా నీవు సదా ఈ భూమండలం పైన వుండాలి. నీవు ఎప్పుడు స్మరించినా నేను హాజరవుతాను. అని అన్నాడు.

హనుమ - ప్రభూ? సేవకునకు తన కోరికఅంటూ వుండదు. స్వామి నియమించిన కార్యమును నెరవేర్చడమే తన కర్తవ్యముగా భావిస్తాడు. నేను మీ ఆజ్ఞ ప్రకారం ఇక్కడ వుంటాను. కాని నాకొక వరాన్ని అనుగ్రహించండి. "తమ కథాసంకీర్తన జరిగేడి ప్రతిచోటా అన్నిరూపాలతో వుండగలగాలి."

భగవాన్ - "తథాస్తు" నా కథాసంకీర్తన జరిగే ప్రతిచోటా నీవు తప్పక వుంటావు, అని అన్నాడు. ఈ కారణంచేతనే రామకథ జరిగేచోట అందరికంటే ముందు హనుమదు జాగా కేటాయిస్తారు. హనుమ ఏ రూపంలో వస్తాడో, ఎవరూ చెప్పలేదు. కాని ఆయన తప్పక వస్తాడు, తన భక్తుల కోరికలను నెరవేర్చుతాడు. ఎందుకంటే భగవాన్ ఆయన ఆధీనంలోనే వున్నాడుగదా. భగవంతుని దర్శించ

కోరువారు హనుమను తప్పక ఆశ్రయించాలి. తులసీదాసుకి హనుమంతుడు భగవంతుని దర్శనం కలుగచేశాడు.

ఉత్తరభారతదేశంలో ఒక కథ ప్రచారంలో కలదు. తులసీదాసు చిత్రకూటంలో వుండేరోజులలో ప్రతిరోజూ ఉదయం మలమూత్ర విసర్జనకు బహిర్భూమికి వెళ్ళుతూ వుండేవాడు. తన దగ్గర మిగిలిపోయిన నీటిని ఒక జమ్మిచెట్టుమీద పోస్తూవుండేవాడు. ఆ చెట్టుపైన ఒక ప్రేతాత్మ వుండేది. ప్రేతాత్మలకి ఇలాంటి అపవిత్రమైన పదార్థమే ఆహారంగా వుంటుంది. ఆ నీటితో ప్రేతాత్మ తృప్తిచెందసాగింది. భూత ప్రేతాత్మలయోని మిక్కిలి నికృష్టమైనది. ఆ యోనిలో గూడా మంచి-చెడ్డ అన్నిరకాల ప్రేతాత్మలుంటాయి. ఆ ప్రేతాత్మ తృప్తిచెంది తులసీదాసు ఎదుట ప్రత్యక్షమై ఏదైనా వరాన్ని కోరుకొనుమని అన్నది.

తులసీ – నాకు ఏమీ అక్కరలేదు. నీవు చేయించగల్గితే భగవంతుని దర్శనం చేయించు, అని కోరాడు

ప్రేతాత్మ–మహారాజ్? నాలో ఇంత సామర్థ్యముంటే ఈ అధమ యోనిలో ఎందుకు వుంటాను, నేను భగవంతుని దర్శనం చేయించలేను కాని ఉపాయం చెప్పగలను.

తులసీ – అయితే ఉపాయం చెప్పవలసినది.

ప్రేతాత్మ – చూడండి, రామకథ జరిగే ప్రతిచోటా

హనుమాన్ ఏదో రూపంలో వినడానికి వస్తూఉంటాడు. ఫలానా చోట నిత్యమూ రామకథ జరుగుతూ ఉంటుంది. అక్కడికి హనుమ కుష్ఠువాని రూపంలో వస్తాడు. మీరు ఆయన పాదాలను పట్టుకోండి. ఆయన ఎంతగానో ముట్టుకోవద్దని అంటాడు, కాని మీరుమాత్రం విడిచిపెట్టకండి. ఆయన మీకు భగవంతుని దర్శనం తప్పక చేయిస్తాడు. అని చెప్పింది.

తులసీదాసు మిక్కిలి ప్రసన్నుడైనాడు. కథ జరుగుతున్నచోటుకి వెళ్ళాడు. అక్కడ అందరికీ దూరంగా ఒక కుష్ఠువానిని చూశాడు. అతని నేత్రాలనుండి కన్నీరు ప్రవహిస్తున్నది. కథను వింటూవున్నాడు. కథ పూర్తి అవగానే ఆయన కాళ్ళను పట్టుకొనడానికి ముందుకు వెళ్ళాడు. ఆయన పాదాలనుముట్టుకోవద్దు, నేను కుష్ఠువాడనని చెప్పాడు. కాని తులసీదాసు పట్టినపట్టు వదలలేదు. చివరికి ఆయన భగవంతునిదర్శనం చేయింపుతానని వాగ్దానం చేశాడు. ఎన్నో పర్యాయములు దర్శనం చేయించాడుకూడాను. ఒకసారి దర్శనం అయింది కాని తులసీదాసు గుర్తించలేదు. ఒకనాడు తులసిదాసు గంధాన్ని తీస్తున్నాడు. భగవాన్ బాలకుని రూపంలో వచ్చి గంధం అడిగి పూసుకుంటున్నాడు కాని తులసీ గుర్తించలేదు. అప్పుడు చిలుక రూపంలోవచ్చి హనుమ ఈ ద్విపద చదివాడు.

చిత్రకూటకే ఘాటపై భయీ సంతనకీ భీర్॥
తులసిదాస చందనఘిసై తిలకదేత రఘువీర్॥

భక్తులకు ఆపదలు వచ్చినప్పుడు స్మరించగానే హనుమ వచ్చి **వారి** ఆపదలను పోగొట్టి వారికోరికలను నెరవేర్చుతాడు. రామకథారసికులు రామసంకీర్తనపరులు అసంఖ్యాకులు. **రామ**కథను విన్నంతగానూ, రామసంకీర్తన చేసినంతగానూ మరెవరికథను, నామాన్ని చేయరు. హనుమ ఫోటోను నేలపైన వేసినా, కాగితంపైన చిత్రించినా, గోడపైన వేసినా, రాతిపైన చెక్కినా, అచట ప్రత్యక్షమవుతాడు. హనుమను ప్రసన్నునిగా చేసుకొనగోరువాడు ఆయన్ని సింహాసనంపైన ప్రతిష్ఠించి రామకథ వినిపించ నారభించితే ఆయన అతని కోరికలన్నిటినీ నెరవేర్చుతాడు. అతనికి ఎప్పుడూ ఏవిధమైన లోటు రానీయడు. హనుమ ఈలోకంలో సకలసంపదలను ఇస్తాడు, భూత, ప్రేత, పిశాచ, గ్రహబాధలనుంచి రక్షిస్తాడు, పరలోకంలో గూడా సహాయం చేస్తాడు, భగవంతుని దర్శనంగూడా కలుగజేస్తాడు. ఇలాంటి ప్రత్యక్ష దైవాన్ని ఎవరు ఆరాధించరు? ఏ విధంగా ఈయన ప్రత్యక్ష దైవమో, అనన్య సేవకుడో, అదేవిధంగా ఆధ్యాత్మతత్వవేత్త గూడాను.

రామదూత హనుమ సకల అశుభములను పోగొట్టి శుభములను కలుగజేస్తాడు. కరుణా సముద్రుడైన శ్రీవాయుతనందనుని పాదపద్మాలకి మనసారా నమస్కరించు చున్నాను.



శ్రీరామ జయరామ జయ జయ రామా

# ఆధ్యాత్మ తత్వ వేత్తా హనుమాన్

## 22

దేహదృష్ట్యాతుదాసోహం, జీవదృష్ట్యాత్వదంశకః
ఆత్మదృష్ట్యాత్వమేవాహం. ఇతిమేనిశ్చితామతిః ॥ *

భక్త భగవంతులలో, సేవక స్వాములలో, శిష్య గురువులలో, మిత్రులలో, తండ్రి కుమారులలో, భార్యా భర్తలలో నిజానికి ఏమి తేడా వుండదు. రసాస్వాదన చేయుటకు ఇరువురుగా వుంటారు. ద్వైతీభావం వున్నపాటి, ఒకరు మరిఒకరిని తననుంచి వేరుగా భావించేపాటి రసానుభూతి కలుగదు. ద్వైతభావము నశించినప్పుడు మాత్రమే రసాస్వాదన కలుగుతుంది. ఎనుంటూ వేరేవిమీవుండదు. "రసోవై సః" ఆ సర్వేశ్వరుడే రసస్వరూపుడు. మోహమే బంధనము, మోహరహితత్వమే మోక్షము. భక్తుడు సదాముక్తుడే, అతనికి ఎప్పుడూ బంధనము లేదు. అయినా వ్యావహారికదృష్ట్యా భక్తుడు భగవంతునినుంచి తాత్విక విషయాలను తెలుసుకోవాలనుకుంటాడు. మోక్షమార్గాన్ని తెలుసుకుంటాడు, తనగురించి కాదు, చనకుతాను ముక్తుడే,

---

* హనుమ భగవంతునితో – ప్రభూ! దేహదృష్టితో నేను మీకు దాసుడను. జీవదృష్టితో మీ అంశాన్ని, ఆత్మదృష్టితో మీరే నేను, ఇది నా నిశ్చితమైన అభిప్రాయము, అని అన్నారు.

అతని ప్రశ్న పరిజ్ఞాసియున్నకొరకు, లోకకళ్యాణ నిమిత్తము.
శ్రీ హనుమగూడా లోకకళ్యాణముకొరకు తన స్వామి అయిన
శ్రీరామచంద్రుని ముక్తిమార్గాన్ని గురించి, ఆధ్యాత్మతత్వ
రహస్యాన్ని గురించి తెలుపమని కోరాడు.

హనుమ - భగవానుని ప్రశ్నించాడు-ప్రభూ! నాకు
మోక్షతత్వాన్నిగురించి ప్రబోధించండి.

శ్రీరాముడు - హనుమా! తత్వజ్ఞానంకొరకు వేదాన్త
శాస్త్రాన్ని ఆశ్రయించు - అని అన్నాడు.



హనుమ - వేదాన్తమనగానేమి?

శ్రీరాముడు - నువ్వులలో నూనె వున్నట్లు వేదాలలో
సారరూపంగా వేదాంతముంది, అని అన్నాడు

హనుమ-వేదాలు, ఉపనిషత్తులు, వేదాలసంఖ్యా వాని
పేర్లు అడిగి తెలుసుకున్నాడు. తదుపరి హనుమ ముక్తి

కలగడానికి విభిన్నమార్గాలను గురించి తెలియజేయమని కోరాడు.

శ్రీరాముడు – సాలోక్య, సారూప్య, సామీప్య, సాయుజ్యములోని ముక్తి నాలుగువిధాలు, అని అన్నాడు.

హనుమ – ప్రభూ? కైవల్యముక్తి అంటే ఏమిటి? దానికి ఎన్ని భేదాలున్నాయి?

శ్రీరాముడు – కైవల్యముక్తి ఒక్కటే. అది పరమార్థ స్వరూపమే. దీనికి నాలుగు భేదాలున్నాయి, అని చెప్పాడు

హనుమ – సాలోక్యముక్తి అంటే దేన్ని అంటారు?

శ్రీరాముడు – నాలోకంలో ఉండేవారిని సాలోక్య ముక్తి అంటారు. ఇది నా నామ సంకీర్తనాదిభక్తి సాధనవలనేత లభిస్తుంది.

హనుమ – సారూప్యముక్తి అంటే ఏమిటి?

శ్రీరాముడు–నాతో సమానమైన రూపాన్ని పొందడాన్ని సారూప్యముక్తి అంటారు. ఈ విధమైనముక్తి కాశీ క్షేత్రంలో నా తారకమంత్రాన్ని వింటూ చనిపోవడంచేత లభిస్తుంది.

హనుమ – సామీప్యముక్తి అనగానేమి?

శ్రీరాముడు – నా సామీప్యాన్ని పొందడాన్ని సామీప్యముక్తి అంటారు. సదా నా పారాయణులై నా రూపాన్ని నిరంతరమూ ధ్యానిస్తూ ఉండేవారికి ఈముక్తి లభిస్తుంది.

హనుమ – సాయుజ్యముక్తి అంటే ఏమిటి?

శ్రీరాముడు – గురూపదిష్ట మార్గాన ఎవరు నన్నే ధ్యానిస్తూవుంటారో, అట్టివారు భ్రమరకీట న్యాయంచేత నారూపాన్నే పొందుతారు. దానిని సాయుజ్యముక్తి అంటారు. అది నిత్యమూ నన్ను ఆరాధించుటవలన లభిస్తుంది. ముక్తి సాధనగురించి ఉపనిషత్తులలో చక్కగా బోధించారు. ఉపనిషత్తులలో బోధించిన మార్గాన పయనించిన తప్పక ముక్తి కలుగును.

హనుమ – ఉపనిషత్తుల సంఖ్య, ఏ ఉపనిషత్తులు ఏ వేదానికి చెందినవి – అని ప్రశ్నించాడు.

భగవాన్ 108 ఉపనిషత్తుల పేర్లను, ఏది ఏ వేదానికి చెందినదోగూడా చెప్పాడు.

హనుమ – కైవల్యముక్తి ఏ విధంగా లభిస్తుంది అడిగాడు.

శ్రీరాముడు – సాధనచతుష్టయ సంపన్న పురుషునకు జ్ఞానంవలనకైవల్యముక్తిలభిస్తుంది, అని అన్నాడు.

హనుమ – జీవన్ముక్తి, విదేహముక్తి అని దేన్ని అంటారు? దీనికిగల ప్రమాణమేమిటి? దీనికిగల సిద్ధిని, అట్టి సిద్ధికిగల ప్రయోజనమేమిటి, అని ప్రశ్నించాడు.

శ్రీరాముడు – ప్రాపంచిక జ్ఞానమే బంధనము. తత్వజ్ఞానమే జీవన్ముక్తి. ప్రారబ్ధరూపమైన ఉపాధి

నశింపడమే విదేహముక్తి. వీటికి వేదాలు, ఉపనిషత్తులే ప్రమాణాలు దుఃఖనివృత్తి, నిత్యానందప్రాప్తి ఇందుకు ప్రయోజనము. ఆనందోపలబ్ధి పురుషార్థసాధ్యము. వాసనలన్నీ నశించిపోవడమే జీవన్ముక్తి స్వరూపము, అని అన్నాడు.

హనుమ — భగవన్ — పురుషార్థమంటే ఏమిటి?

శ్రీరాముడు — పురుషార్థము రెండు విధాలు. ఒకటి శాస్త్రవిరుద్ధము, రెండవది శాస్త్రానుకూలము. శాస్త్రవిరుద్ధ పురుషార్థము బంధనమునకు కారణము. శాస్త్రానుకూల పురుషార్థము మెల్ల మెల్లగా మనలను పరమార్థం వైపుకి నడలిస్తుంది. ముందుగా అశుభప్రదమైన వాసనలను తొలగించి శుభప్రదమైన వాసనలందు మనస్సుని లగ్నం చేయాలి, తిరిగి శుభప్రదమైన వాసనలను పరిత్యజించి వాసన అంటూ లేకుండునట్లుగా మనస్సుని వశపరచుకోవాలి. వాసనలతో వున్నవాడు బద్ధుడు, వాసనరహితుడు ముక్తుడు.

హనుమ — భగవన్? వాసన స్వరూపం ఏమిటి?

శ్రీరాముడు—చిరపరిచితమైన పదార్థాలను ఏ మనస్సు నిరంతరమూ చింతిస్తూ వుంటుందో అవే వాసనలు, వాటివల్లనే జన్మ—మరణములు కలుగుతూవుంటాయి. వాసన వల్లనే ప్రాణాలలో స్పందన వుంటుంది. ఆ స్పందనచే వాసనలు పుట్టుతూ వుంటాయి. ఇందులకే మాటి - మాటికి పుట్టుట

చప్పుట జరుగుతూ వుంటుంది. ఇందుకే ముందు అశుభ ప్రదమైనవాసనలను పరిత్యజించి తిరిగి మంచివాసనలను త్యజించాలి. ఆవిధంగా మనస్సుని వశపరచుకోవాలి.

### హనుమ – మనస్సుని వశంచేసుకొనడం ఎలా?

శ్రీరాముడు – ఆధ్యాత్మవిద్య, సాధుసంగము, వాసనాత్యాగము, ప్రాణాయామము, ఈ నాలుగు మనస్సుని వశం చేసుకొనడానికి మంచి సాధనములు. చంచలమైన మనస్సే మనలను జగత్తులో త్రిప్పుతుంది. మనస్సు చాంచల్యాన్ని వదిలి ఏకాగ్రత చెందినవెంటనే జ్ఞానోపలబ్ధి కలుగుతుంది. జ్ఞానం వలన ముక్తి లభిస్తుంది. ధ్యానంవలన మనస్సు ఏకాగ్రత పొందుతుంది. ఇందుకుగాను చిదానంద స్వరూపాన్ని ధ్యానించాలి, కొంతకాలం ధ్యానాభ్యాసం జరిగినప్పుడు అహంకారం నశిస్తుంది. మనోవృత్తి బ్రహ్మతత్వమందు లగ్నమవుతుంది ఆ వృత్తిని సంప్రజ్ఞానసమాధి అంటారు. మనస్సులోని సకలవృత్తులు నశించినప్పుడు దాన్ని అసంప్రజ్ఞాత సమాధి అంటారు. వాసనలు నశించనంతవరకు పరమానందప్రాప్తి కలుగదు. మలినవాసనలు మనలను ప్రాపంచిక జన్మ మరణాలకు వశీభూతులను చేస్తాయి. విశుద్ధమైన వాసన మనలను జన్మమరణాలనుంచి ముక్తులనిగా చేస్తుంది. ఇందుచేత వాసనలు నశించనంతవరకు బ్రహ్మానంద ప్రాప్తి కలుగదు. సమస్త వాసనలకు ఈ అపవిత్రమైన శరీరమే నిలయము. విషయవాసనలను వదలి మోక్షవాసనను

